# ఎవరన్నారు 'శాంతా' టీకాల కంపెనీ మాత్రమేనని...?

**స్వదేశీ ప్రజ్ఞను బహుముఖాలుగా
వెలారిస్తున్న శాంతాగ్రూప్
రథసారథులు
తెలుగువారే...!**

క్యాన్సర్, హెపటైటిస్-బి వంటి అనేక భయానక వ్యాధుల
చికిత్సలో ఉపయోగపడే ఇంటర్‌ఫెరాన్ ఆల్ఫా 2
**శాన్ ఫెరాన్**

భారతదేశంలో మునుపెన్నడూ
లేని విధంగా యునిసెఫ్‌కు టీకాల విక్రయం

అంతర్జాతీయ ధార్మిక సంస్థల కోరిక మేరకు
వారి తరఫున టీకాల ఉత్పత్తి



అనుబంధ సంస్థ **శాంతా వెస్ట్**
(అమెరికా) ద్వారా క్యాన్సర్
చికిత్సా మూలకాలపై పేటెంటు

కాంట్రాక్టు పద్ధతిపై ఫారిన్
కంపెనీల తరఫున పరిశోధన

హృద్రోగులకు
అత్యవసర సమయాలలో
ప్రాణదానం చేసే
స్ట్రెప్టోకైనేస్
**శాన్ కైనేస్**

చికిత్సకు లొంగని కాలేయపు వ్యాధి
హెపటైటిస్-బి నివారణకై **శాన్‌వాక్-బి**

చిన్నపిల్లలకు పలుమార్లు టీకాలు వేసే అగత్యం
తప్పించే కాంబినేషన్ వ్యాక్సీన్‌లను అభివృద్ధి చేస్తూ...

కలరా, టైఫాయిడ్, హిబ్, మెనింగోకోకల్
టీకాల రూపకల్పనలో ముందుకు సాగుతూ...

ప్రాణరక్షక ఔషధాలను సామాన్యుడికి
అందుబాటు ధరలో అందించే లక్ష్యంలో భాగంగా
విదేశాలపై ఆధారపడకుండా స్వదేశీ పరిశోధన

## ఔను...
## 'శాంతా'
## టీకాలు కూడా
## తయారు చేస్తుంది...

ఆ మాటకొస్తే శాంతాకు అనేక జాతీయ, అంతర్జాతీయ
ప్రశంసలు, అవార్డులు లభించడానికి తొలి సోపానం
టీకాలను పరిశోధించి, తయారు చేసి, మార్కెట్టు చేయడమే!

శరీర నిర్మాణానికి సన్నిహితంగా ఉండే జీవప్రక్రియ ద్వారా తయారయిన బయోటెక్ ఉత్పాదనలు మానవాళికి అనువైనవి. ఆరోగ్యరీత్యా సురక్షితమైనవి.

**బయోఫార్మా రంగంలో ప్రపంచపటంలో భారతదేశానికి స్థానం కలిగించిన ఔషధ సంస్థ శాంతా బయోటెక్నిక్స్**

Pioneers in r-DNA Based Human Healthcare Products in India

Customised Monoclonal & Polyclonal Antibodies

Recombinant Protein Development, Manufacturing & Formulation

Vaccines, Therapeutic Products & Diagnostics

cGMP Compliant Facility for Manufacturing Biopharmaceuticals

Nutraceuticals

W.H.O.(Geneva) Pre-qualified U.N.Supplier of Hepatitis-B Vaccine


SHANTHA BIOTECHNICS PVT. LTD.
www.shanthabiotech.com
3rd Floor, Serene Chambers, Road No.7,
Banjara Hills, Hyderabad - 500 034. A.P., INDIA.
Ph: +91-40-23548507, 23543010, 23608843
Fax: +91-40-23548476
Email: info@shanthabiotech.com

హాసం
హాస్య - సంగీత పత్రిక

# ఇవీ సంగతులు





ముఖచిత్రం
'అడవి రాముడు' చిత్రంలో ఆర్తీ అగర్వాల్

## హాస్యం — సంగీతం



పాటల ప్రత్యేకం




69, 70, 71, 72, 73 పేజీల్లో





సినిమా పాటల ప్రత్యేకం 'సెంటర్ ఫ్రూట్' లో



# ప్రియ జనవాక్యం

'హాసం'పత్రిక అందుకోగానే ముందుగా చూసేది సంగీతం శీర్షికలో పాత పాటలు, హ్యూమర్ బాక్స్, సరిగపదమని. 'హాసం' పరితలమైనందుకు మేము ఎంతో గర్విస్తున్నాం. మా హోటలు కొచ్చిన కొందరు తిరగేసి చాలా బాగుంది పత్రిక. మీది మంచి టేస్టు అంటూంటే గర్వంగా వుంది. రసరమ్యమైన పాత హిందీ, తెలుగు, తమిళ గీతాలు అందిస్తున్న 'హాసం' కు అభినందనాలు.

**- గుంటియామిని కార్తీక్ సాగర్,వనపర్తి**

16-30 ఏప్రిల్ సంచికలో కుమారి కౌతాప్రియంవద గారిని గురించి చిత్తరంజన్ రచన చదివాను. ప్రియంవదగారు నెల్లూరు జిల్లా కావలిలో వుండేవారు. సుమధుర గాయని ప్రియంవదగారి జనకులు, శ్రీకౌతారామమోహన శాస్త్రి గారు కావలి కళాశాల (ప్రస్తుతం జవహర్ భారతి కళాశాల)లో పనిచేశారు. విశ్వవిఖ్యాత చిత్రకారులు అయినప్పటికి శ్రీ శాస్త్రిగారు వినయసంపదతో గాంభీర్యంగా వుండేవారు. ప్రియంవదగారి మాతామహులు ప్రసిద్ధ ఆంగ్లోధ్యాపకులు. శ్రీపెద్దాడరామస్వామి గారు కూడా మా కావలి కళాశాలలో పని చేయడం కావలికి గర్వకారణం. ప్రియంవద గారిని గురించి వ్రాసిన చిత్తరంజన్‌గారికి, ప్రచురించిన మీకు నమస్సులు.

**- కాకుటూరు సుజాత నాగరాజరావు, కావలి**

అర్థంచేసుకుందాం ఆస్వాదిద్దాంలో "నైన్ లడ్ జాయ్‌హై" పాటలో "గోరి" అంటే తెల్ల అమ్మాయి అని రాశారు. గోరి అంటే తెలుగులో ఎర్రని అమ్మాయి అన్నారు. గోరి అంటే హిందీ, ఉర్దూలోఎర్రని అమ్మాయి అనే అర్థం-తెల్లని అని కాదు. "ఇన్సాఫ్ కీ డగర్" లో అన్నపాట ప్రతిస్కూల్ పిల్లాడికి రావలసిన పాట.

**-కె. రామారావు, హైదరాబాద్**

ఏప్రిల్ ద్వితీయార్థ సంచికలో 'నేనున్నాను' ఆడియో రివ్యూలో శాస్త్రిగారి గురించి మీరు వ్రాసిన వాక్యాలు చదువుతుంటే మేను పులకరించి కళ్ళుచెమ్మగిల్లాయి. ఆ ప్రశంసకు ఆయన ముమ్మాటికీ అర్హులు. నా అభిప్రాయం లో శాస్త్రిగారు దేవులపల్లి, మల్లాది, సి.నా.రె. వేటూరిల కలబోత. సరస్వతీపుత్రుడు లాంటి టైటిల్ ఆయనకు కరెక్టుగా సరిపోతుంది. 'శభాష్‌రాముడు' పాటల పరిచయం చక్కగా వుంది. తవ్వేకొద్దీఊట వస్తున్నది హాసంలో హాస్యసంగీతాల జీవనది 'హాసం'.

**- ఐ. మురళీమోహనరావు, హైదరాబాద్**

'హాసం' పత్రిక ప్రారంభించినప్పటి నుంచి నేను 'హాసం' పాఠకురాలిని. ప్రతి సంచిక ఎంతో ఇష్టంగా చదువుతుంటాను. పాత సంచికలు మళ్ళీ మళ్ళీ తిరగేస్తుంటాను. 'హాస్యం'సంగీతం -ఈ రెండూ ఆస్వాదిస్తున్నంతకాలం, మనిషి జీవిస్తున్నట్లు లెక్క. ఈ రెండింటికి ప్రాధాన్య మిస్తూ, మీరు ఓ పత్రికను నడపాలన్న ఆలోచన రావటమే అద్భుతం, మా అదృష్టం. ఈ పత్రిక ద్వారా మీరు మానవజాతికే ఊపిరిని, ఉత్సాహాన్ని అందిస్తున్నారు. హాస్యం, సంగీతం ద్వారా అన్ని రోగాలను జయించి, సంపూర్ణ ఆరోగ్యంతో జీవించే అవకాశాన్ని మీరు మాకు కల్పిస్తున్నారు. పొగడ్తగా అనిపించినా, ఇది సత్యం, వాస్తవం, మీకు శతకోటి ధన్యవాదాలు.

**- పి. సుధ, ఒంగోలు.**

మన 'హాసం'లోని శీర్షికలు చాలా బాగుంటున్నాయి. ముఖ్యంగా మాకు నచ్చినవి. ఆపాత మధురం, హ్యూమరథం, కరాజు కథలు మొదలగునవి. ఈ మధ్య హాసం క్లబ్‌లు ఏర్పాటు చేసినందుకు చాలా సంతోషం. ఇలాంటిది ఏదైనా ఏర్పాటుచేస్తే బాగుంటుంది అని నేను అనుకునేవాడిని. నా ఊహలకి మీరు కార్యరూపంలో చేసినందుకు చాలా సంతోషంగా వుంది. నేను త్వరలోనే హాసం క్లబ్‌లో సభ్యునిగా చేరతాను.

**-బి.వి.కుమార్, క్రొత్త వెంకోజీపాలెం.**

16-30 ఏప్రిల్ సంచికలోని డాక్టర్ డూలిటిల్ హాస్యం నింపుకుని నవ్విస్తున్నందుకు మీకు నా కృతజ్ఞతలు. సింగీతం గారి'క'రాజు కథలు సమాజంలోని పరిస్థితులను చక్కగా వివరిస్తున్నది. ఈవారం మీరందించిన 'నేనున్నాను' సాంగ్స్ అద్భుతంగా వున్నాయి. సీతారామశాస్త్రిగారి చేతినుంచి జాలువ్రాలిన ఆణిముత్యాల వంటి పాటలు వింటుంటే ఈ తరంలోనే కాదు ఎన్నిదశాబ్దాలైనా కీరవాణిగారు ఎదురులేని సంగీతపుత్రుడు. సరిగమల చిరంజీవని రుజువైంది. సంగీత ప్రతిభకు అంతంలేదు. సంగీతం ప్రపంచాన్నే కాదు. ప్రతి అణువును స్పందింపజేసే మహాశక్తి. అటువంటి మహాశక్తిని అవమానపరచకుండా ఆలోచించి అద్భుతాలు సృష్టించే వారే నిజమైన సంగీత దర్శకులు. ఇది గమనించి ప్రతి ఒక్కరూ తమ అవకాశాలను సద్వినియోగ పరచుకొని ఓ పెండ్యాల, రాజేశ్వరరావు, కె.వి.మహదేవన్, ఇళయరాజా, ఘంటసాల, రమేష్‌నాయుడు, కీరవాణిలా ఎదగాలని కోరుకుంటూ....

**-జె. నాగేష్, ఫిలింనగర్,హైదరాబాద్.**

'హాసం'16-30 ఏప్రిల్, 2004 సంచిక పఠించి అత్యంతానంద కందళిత హృదయా(ని) రామచంద్రుడనైతిని. నాగయ్య పుస్తకావిష్కరణ సభలో చేసిన ప్రసంగమును సంపాదకీయము లో సమర్పించిరి. 'ఆలాపన' కొత్తవిధముగా పరిచయము చేయ ప్రారంభించిరి. అంతియేగాక నా గురించి శ్రీ సింగీతము వారిచే ఒక కథను వ్రాయించి ప్రచురించితిరి. ఈ మూడింటికి, ముఖ్యముగా చివరిదానికి నేను బహుధా కృతజ్ఞుడిని.

-వి.ఎ.కె.రంగారావు, మద్రాసు

**(వేదిక ఏదైనా సరే, మీరు లేవనెత్తిన అంశం ఆలోచింపజేసేదే కాబట్టే ఆ సంపాదకీయం! 'సంవీక్షణం' శీర్షిక క్రింద ఇంతకుముందు కొన్ని వున్నకాలను పరిచయం చేసిన తీరులోనే 'ఆలాపన' పరిచయమూ సాగుతోంది. సింగీతంవారి కథ విమర్శకులు యావన్మందిపై ఓ చెణుకు. ఆయనకు చెప్పి ఏ కథా ఇప్పటివరకూ మేం రాయించలేదు. క రాజు కథల సృష్టికర్త పూర్తిగా సింగీతం గారే ! - ఎడిటర్)**

'కొమ్మా కొమ్మా..'లో జి.వరలక్ష్మి గారి గురించి రాస్తూ 'దొంగల్లో దొర'కు బదులు 'దొరికితే దొంగలు'అని రాసినట్టున్నారు. 'అందులో పాటలు అంతంతమాత్రమే' అన్నారు. ఈవిడ పాడిన పాటగానీ, ఈవిడపై చిత్రీకరించబడిన పాటగానీ రెండు సినిమాలలోనూ లేదు. మరి ఆ వ్యాఖ్య ఎవరిని ఉద్దేశించినట్టు? శీర్షిక బాగున్నది.

**-ఆర్.అర్జునరావు, రాజమండ్రి**

16-30 ఏప్రిల్ హాస్య సంగీత పత్రిక చాలా బాగుంది. నాకు ఈ సమ్మర్ హాలిడేస్‌లో మంచి నేస్తం దొరికినంతగా ఫీలయ్యాను."ఆస్థాన విమర్శకుడు" చదువుతున్నప్పుడు కల్గిన ఆనందం మాటల్లో వర్ణించలేను. హాసం క్లబ్‌లో టైటానిక్ పాట ప్రచురించినందుకు 'హాసం' యూనిట్‌కు, పాడిన మాధురికి స్పెషల్ థాంక్స్. నాకు హిందీ పాటలంటే చాలా ఇష్టం. మీరు మరీ ఓల్డ్ ట్యూన్‌కు వెళ్లిపోతే మాలాంటి యూత్‌కు అన్యాయం జరుగుతుంది.(అంటే ఈ ట్యూన్ మాకు పరిచయం ఉండదు కదా!) మాకోసం ఒక నవతరపు పాటను కూడా ప్రచురించి విశ్లేషిస్తే మాక్కూడా యంకరేజింగ్‌గా ఉంటుంది.

**-జీవా, రాజోలు**

**(జీ టీవీ మొదలైన ఎన్నో ఛానల్స్‌లో చిన్న పిల్లలు సైతం పాడి ప్రైజులు తెచ్చుకుంటున్న హిందీ పాటలలో అధికశాతం పాతవేనని గమనించండి. పాటలు పాతవా కొత్తవా అన్నది కాదు ముఖ్యం. మనం నేర్చుకోదగ్గ విషయం ఎందులో వుందన్నది ముఖ్యం. అటువంటి ప్రమాణాలతో నేటి తరానికి సంబంధించిన హిందీ పాటలను 1,2,4,5,6,16,18,20,21,26, 31, 33, 34,54,56 సంచికలలో ప్రచురించాం. దయచేసి గమనించగలరు. -ఎడిటర్)**

మా (మీ)'హాసం' పత్రిక బాలా బాగుంటుంది. ఈ పత్రికను చాలా కాజువల్ గా ఒక సంవత్సరం క్రితం కొన్నాను. పత్రికను తిరగేసిం తరువాత సంగీతసాహిత్యాలకు అలాగే హాస్యం కోసం మీరిస్తున్న విలువ అర్థమయింది. ఆ తరువాత రెగ్యులర్ రీడర్‌ని అయ్యాను. ప్రతి పత్రిక మునుపటి పత్రిక కన్నా మెరుగులు దిద్దుకుంటుంది.

ఏప్రిల్ రెండవ సంచికలో నాగయ్యగారిని గురించిన వ్యాసం చాలా బాగుంది. చదువుతున్నంత సేపు సంగీతం కోసం ఆయన పడిన తపన అర్థమయింది. 35-40 ఏళ్ల క్రితం చూసిన భక్తరామదాసు లోని రామదాసు, కబీర్ పాత్రలు కళ్ళ ముందు కదలాడాయి. అంతేకాదు రెండు మూడు రోజులు జ్ఞాపకం చేసుకుంటే 'సాగర్ ఊపర్ పత్తర్ తారే' అనే రఫీ పాట చెవుల్లో గింగురుమంది. మంచి సినిమాను, మంచి పాటను జ్ఞాపకం చేయించారు.

**- పి. జయప్రకాష్,హైదరాబాద్.**

సంపుటి: 3 సంచిక:16

**16-31 మే 2004**

పేజీలు: 76

విడి ప్రతి : రూ. 10-00

సంవత్సర చందా: రూ. 200

విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $ 50

జీవిత చందా: రూ. 2000

విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $ 400

మేనేజింగ్ ఎడిటర్

ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్

**రాజా**

రిఫరెన్స్ కర్టెసీ

డా॥ కె.వి.రావు

జె.మధుసూదన శర్మ

మేనేజర్

పి.గిరి

చీఫ్ లే-అవుట్ డిజైనర్

జి.రాజేష్

**HAASAM HAASYA SANGEETHA PATHRIKA**
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 2383 1388 / 5557 0215
*email:* haasammag@hotmail.com

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
On behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD - 500 018

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eenadu Compound
Somajiguda, Hyderabad-82

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

## హాస్య-సంగీత పత్రిక

64

'పుట్టినరోజు పండగే అందరికీ' అంటారు. దాన్ని వేడుకగా చేసేది - చిన్నప్పుడు తల్లిదండ్రులు, పెద్దయ్యాక భార్యా, పిల్లలు! కొంతకాలానికి దానికి పెద్దగా పట్టించుకోం కూడా. కానీ ప్రసిద్ధుల విషయంలో వారి పుట్టినరోజు గురించి పదిమందికీ తెలుస్తుంది. అభినందనలు, ఆశీస్సులు వర్షిస్తాయి. ఎంత నిరాడంబరుడికైనా అవి ఆనందాన్నిస్తాయి. తన జీవితం అర్థవంతమైన దారిలో నడుస్తోందన్న సంతృప్తిని కలిగిస్తాయి.

తమకు నచ్చిన, తాము మెచ్చిన వారి పుట్టినరోజులను కొందరు అభిమానంతో జరుపుకుంటే, మరికొందరు వాటిని వాణిజ్యపరంగా మలుచుకుంటారు. రాజకీయనాయకుల విషయంలో ఇది తరచుగా చూస్తూ ఉంటాము. వారు అధికారంలో ఉండగా ఎంతో హంగామాగా జరిగే పుట్టినరోజుకు, పరాజితులై వున్నప్పుడు సాదాసీదాగా జరిగే పుట్టినరోజుకు పోలికే ఉండదు. గ్లామరు ప్రపంచంలో ఉన్నవారికీ ఇది అనుభవంలోకి వస్తుంది. కథానాయకులైనా సరే తెరపై వెలిగినంతసేపే వేడుకలు, పేపర్లో ప్రకటనలు!

తెరవెనుక ఉండి కథ నడిపే సాంకేతిక నిపుణుల గురించి పట్టించుకోవడం చాలా తక్కువ. దశాబ్దాలపాటు రంగంలో ఉన్నా, తమ కళ ద్వారా ఎందరో ప్రేక్షకులను అలరిస్తున్నా వారి జన్మదిన వేడుకలు జరుగవు. పత్రికలలో అభినందన ప్రకటనలు కనబడవు, వ్యాసాలు వ్రాయబడవు. ఎందుకంటే వారికి అభిమాన సంఘాలు ఉండవు. యాడ్స్ వేయించరు. ప్రేక్షక పాఠకులకు వారిపట్ల అభిమానం ఉన్నా దాన్ని వెలిబుచ్చే సందర్భం లభించదు.

తక్కినవారందరి కంటె ఒక కళాకారుడికి ప్రోత్సాహం చాలా అవసరం. ఒక వ్యాపారస్తుడికి అంకెలే చెబుతాయి తను గొప్పవాడో కాదో! కానీ సినిమావంటి సమిష్టి ప్రయత్నంలో వ్యక్తిగతమైన గుర్తింపు రావడం కష్టం. సినిమా పరాజయం పొందినా గీతకారుడో, సంగీతకారుడో, ఛాయాగ్రాహకుడో ఫెయిలు కాకపోవచ్చు. ఆ విషయం వారికోసారి గుర్తుచేసి నీ ప్రతిభను, కృషిని గుర్తిస్తున్నాం, కీపిటప్! అని చెప్పడం మంచిదనిపిస్తుంది. అలా చెప్పడానికి పుట్టినరోజు కంటె మంచి సందర్భం ఉంటుందా!

'హాసం' తొలినుంచీ దీన్ని ఒక బాధ్యతగా స్వీకరించింది. ఈ పత్రిక సంపాదకుడు గతంలో ఓ దినపత్రిక సినిమా పేజీ నడిపే రోజుల నుండే కళాకారుల పుట్టినరోజులను గుర్తు పెట్టుకుని ప్రత్యేక రచనలు ప్రచురించే పద్ధతి పెట్టుకోవడం జరిగింది. దానికి కొనసాగింపుగా 'హాసం' ప్రారంభించిన తర్వాత హాస్య-సంగీత రంగాలకు చెందిన వారి పుట్టినరోజులను వ్యాపార ప్రయోజనాల గురించి ఆలోచించకుండా ప్రత్యేకంగా జరుపుకుంటోంది. కీర్తిశేషులను సైతం జయంతి అనో, వర్ధంతి అనో స్మరించడం జరుగుతోంది. క్రమంగా పాఠకులే కాక పరిశ్రమలో ఉన్నవారు కూడా దీనిపై మక్కువ పెంచుకున్నారు. తమ సీనియర్ల గురించి, సహకళాకారుల గురించి తమ అభిప్రాయాలను పాఠకులతో పంచుకోవడానికి 'హాసం'ను వేదికగా చేసుకుంటున్నారు.

పాఠకులు కూడా ఇది గమనించారులా ఉంది. 'ఫలానావారి పుట్టినరోజు వస్తోంది, ఎవరి చేత వ్రాయిస్తున్నారు?' వంటి ఉత్తరాలు వస్తున్నాయి. ఈ క్రమంలో తెరవెనుక ఉన్న సాహితీకారులకు, సంగీతకారులకు కూడా 'స్టార్ స్టేటస్' సమకూరడం 'హాసం'కు అత్యంత సంతోషదాయకం. పబ్లిసిటీ మాట ఎలాగున్నా పుట్టినరోజునాడు తన రంగంలోని నిష్ణాతులచే ప్రశంసావాక్యాలు వినడం ఎవరికైనా ఆనందం కలిగించే విషయమే కదా! కాసుల కంటె రసజ్ఞుల గుర్తింపుకే ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చే కళాకారుల విషయంలో ఇది మరింత నిజం!

తమ కళాకౌశలం ద్వారా మనకు ఆహ్లాదం పంచే సరస్వతీపుత్రులకు ఈ విధమైన తృప్తిని, ఆనందాన్ని కలిగిస్తున్నందుకు 'హాసం' గర్వపడుతోంది. ఈ సంచిక లోపలి పేజీలు చూస్తే అర్థమవుతుంది ఈ దిశలో 'హాసం' చేస్తున్న కృషి ఏమిటో! ఈ సంచికే కాదు, వరుసగా రాబోయే సంచికలు కూడా ఈ అంశాన్ని మరింత స్పష్టంగా చాటి చెబుతాయి.





ప్రముఖ సినీ గీత రచయిత
**శ్రీ భువనచంద్ర**
'హాసం' పాఠకుల కోసం
ప్రత్యేకంగా రాస్తున్న

**మా ఆవిడ ఇంతే మరి మీ ఆవిడ?-9**

# నేను చెవలాయా...నువ్వు బడుద్దాయా...

## (అనబడే మగధీరుల కథ)

వాకింగ్‌కి వెళ్ళి తిరిగొస్తుంటే గోమతీ శరవణన్ పిలిపించింది 'అణ్ణా' అని.

"ఎన్నమ్మా?" అడిగా.

"ఏమీలేదన్నా..... మా యింట్లో వుండే 'సుమీత్' రబ్బర్ కట్టాయింది...శరవణన్ సారు రొంబ సోంబేరి..! మీకు సొప్తేదా పని అవుతాదని సొప్తావుండా...!" ఇబ్బంది పడుతూ కొంచెం మొహమాట పడుతూ చెప్పింది గోమతి.

"అంతేగదా...! మధ్యాహ్నం బాగు చేయిస్తాలే..!" అభయం ఇచ్చేశా.

"రొంబ థేంక్సన్నా...మిక్సీలేక రొంబ కష్టంగా వుండాది!" రిలీఫ్‌గా ఫీలవుతూ అంది.

ఇంకో నాలుగిళ్ళు దాటేసరికి మళ్ళీ 'అణ్ణా' అని పిలుపు. తిరిగి చూద్దునుగదా... ఎడంపక్క మూడో ఇంట్లోంచి మరకతం అయ్యంగార్ నా వంకే చూస్తోంది. ఆవిడ మా అసోసియేషన్ మాజీ ప్రెసిడెంటు మాతృభూతం అయ్యంగార్ భార్య.

"ఎన్నమామీ?" అడిగా

"ఒణ్ణు మిల్లైతంబీ....! మూడురోజుల్నించీ పైపులన్నీ లీకవుతావుండాయ్ ప్లంబరుదొరకలా... మీకయితే వూండ్లో వాడ్లందరూ తెలుస్తురు గదా.." అంది.

"సరే మామీ...! మా ఇంటికొచ్చే ప్లంబర్ని పంపిస్తా...!" మరో అభయం ఇచ్చేసి బయల్దేరా.

"రొంబ థాంక్స్ తంబీ!"మరకతం మామీ సంతోషంగా అంది.

ఎంత ఆలోచించినా ప్లంబరు పేరు, వాడి ఫోన్ నంబరూ గుర్తుకి రాలా. ఇంటికి రాగానే మా ఆవిడ్ని ప్లంబర్ నంబరడిగా. సీరియస్‌గా నా వంక చూసి లోపలికి పోయింది. 'క్షణక్షణముల్ పెళ్ళాల చిత్తముల్' అని వూరికే అన్నారా!

మొత్తానికి స్నానం, పూజా, టిఫినూ అన్నీ ముగించినా మా ఆవిడ 'మూడ్' మారలేదు.

"ఏమిటి విశేషాలు సుబ్బూ..." ప్రేమ ఒలకపోస్తూ పలకరించా....

"విశేషాలా? నా దగ్గరేవుంటై వి...శే...షా...లు? పనివాళ్ళంతా చుట్టాల పెళ్ళని చెక్కేశారు. పొద్దున్నించీ ఒంటి చేత్తో చేస్తున్నా ఏ పనీ తెమిలి చావటంలా...! మీకేం ? తీరిగ్గా బలాదూర్ తిరగటం. ఆ వూగుడు కుర్చీలో వూగటం....! అయ్యో.. ఒక్కత్తే పనిచేసుకుంటోంది గదా.... ఏమన్నా సహాయం చేద్దాం అనే ధ్యాస వుంటేగా?" విసవిసా వంటింట్లోకి వెళ్ళి కూరగాయల్ని కిచెన్ టేబుల్ మీద గుమ్మరించింది.

"సరే సరే.... ఏం హెల్ప్ కావాలో చెప్పు ...! చిటికెలో చేసేస్తా"

ప్రసన్నం చేసుకుందామనే ఉద్దేశంతో పళ్ళికిలించా... (నేను కావాలని నవ్వితే 'సూపర్‌గా వుంటానని నేననుకునేవాడ్ని! కానీ అది తప్పని తెలిసిపోయింది. మొన్నో చిన్నపాపని చూసి పళ్ళికిలించేసరికి ఆ పిల్ల భయపడి 'దడుపుజ్వరం తెచ్చుకుంది. అప్పట్నించీ 'పెళ్ళాన్ని' భయపెట్టడానికి మాత్రమే నా 'నవ్వు'ని వుపయోగిద్దామని నిర్ణయించుకున్నా....! కానీ...అలవాట్లు అంత తొందరగా మారవుకదా !)

"అదొక్కటే తక్కువ నా బతుక్కి....." నా వంక చూడనైనా చూడకుండా కూరలు పరపరా తరగటం మొదలెట్టింది.

"అదికాదే...మరీ...ఆ కూరలు ఇలాతే.. తరిగి పెట్టేస్తా..!" చాకు లాక్కోబోయా.

"ఆహా ...! ఎంత ప్రేమ ! మూడు రోజుల్నించీ చెవిలో జోరీగలా పోరుతున్నా పట్టించుకోలేదుగానీ కూరలు తరిగిపెడతాట్ట... కూ...ర.....లు" ఈసడిస్తూ అంది.

"మూడు రోజుల్నించా? ఏమడిగావూ?" బుర్రగోక్కుంటూ అడిగా.

"మా నాన్నగారి అడ్రస్సు...! " చికాగ్గా అంది.

"ఓస్ అదేనా....? సింపుల్... ! వేదాంతం.." ఆలోచించాగానీ వెంటనే గుర్తుకిరాలా. (మా పెద్దన్నయ్యా అంతే... నాకంటే మతిమరుపు)

"చెప్పండి...! మా నాన్న పేరైనా గుర్తుందా?"

"అదీ....ఆ...! వేదాంతం నరసింహమూర్తి కాదూ?"

"నరసింహమూర్తి మా మూడో మావయ్య..!" కోపం రెట్టింపయింది.

"అయితే వేదాంతం రాఘవయ్య...!" గ్యారంటీగా అన్నా.

"హు...! ఆయన మా పెదనాన్న! " పిచ్చ సీరియస్‌గా అంది.

"అలాగా..ఆగు...ఆయన పేరు..వేదాంతం..." (ఇదేమిటో......! ఎంత బుర్రగోకున్నా గుర్తు రావడంలా)

"మా నాన్న పేరు వేదాంతం లక్ష్మీనరసింహం గారు. మా అమ్మపేరు జయలక్ష్మి ..నాపేరు శేష సామ్రాజ్యలక్ష్మి ...సరేనా?" వెటకారంగా అని చాకు విసిరేసింది మా ఆవిడ.

"అవునవును..! కరెక్టే... !అయినా...నేను మొదట



ఆల్‌మోస్ట్ కరెక్టుగానే నరసింహం గారని చెప్పాగా..!'' సంతోషంగా అన్నా.

''నరసింహానికీ, లక్ష్మీ నరసింహానికీ తేడా తెలీని వాళ్ళతో నాకు మాటలేమిటీ?'' వొంగి చాకు కలెక్టు చేసుకుని వంటింట్లో నించి హాల్లోకి నడిచింది మా ఆవిడ. ఇంతలో ఫోనుమోగింది.

బ్రతికాంరా బాబూ అనుకుంటూ ఫోనెత్తి "హలో" అన్నా.

"నేనణ్ణా...గోమతిని...!"

''ఓకే ఓకే వచ్చేనన్తున్నా...!'' అని ఫోనుపెట్టేసి...'ఇప్పుడే వస్తా' అని మా ఆవిడతో చెప్పి ఇంట్లోంచి బయటపడ్డా. నాలుగడుగులు వేశానో లేదో....

''వణక్కం అయ్యా...!'' వినయంగా స్కూటరాపి నమస్కరించాడు ఓ నామాలవాడు "ఏం తంబీ.. ..నల్లాయిరుక్కా..ఎన్న విశేషం?'' పళ్ళికిలిస్తూ పలకరించా గానీ ఆ నామాల వాడెవరో గుర్తుకిరాలా. కానీ చాలాసార్లు చూసిన ఫీలింగు.

''గుర్తువట్టలేదాయ్యా? నేను దీన దయాళ్‌ని..! మీ ఇంటికి రెగ్యులర్‌గా వచ్చే ప్లంబరు కమ్ ఎలక్ట్రీషియన్ని...!'' నా వేపు చిత్రంగా చూస్తూ అన్నాడు.

"కరెక్ట్ కరెక్ట్..! దీనదయాళ్‌కదూ...! అబ్బా...! నీకోసమే వెతుకుతున్నానయ్యా మన మూడో ఇంటి మరకతంగారికి అర్జంటుగా ప్లంబరు కావాల్ట..! వెళ్ళి ఆవిడకి 'హెల్ప్' చేస్తావా?''

"ఇప్పుడే వెళ్తాసార్..!'' స్కూటర్ స్టార్ట్ చేసి మరకంతం ఇంటివైపు దూసుకుపోయాడు. అమ్మయ్య...! ఓ పనై పోయింది.

గోమతీ వాళ్ళ మిక్సీ తీసుకుని ఎల్‌క్ట్రికల్ షావు వైపు వెళ్తూంటే నటరాజన్ కనిపించాడు...సైకిల్ మీద వస్తూ.

"ఏం నటరాజన్ ఎక్కడికి ?'' అని నటరాజన్ని పలకరించా .

''ఫోను బిల్లూ, ఎల్‌క్ట్రికల్ బిల్లూ కట్టడానికి'' సైకిలాపి అన్నాడు నటరాజన్.

"ఇంతలేటెందుకయిందీ?'' ఇంకో ప్రశ్న సంధించా.

"మనది కాదు బీసీ సార్...! ఆ శివమణి గాడు ఉత్తి బడుద్ధాయ్. పాపం వాళ్ళావిడ పదిరోజుల్నించీ పోరుతున్నా'బిల్లు' కట్టడం మర్చిపోతున్నాడట... పాపం ఆవిడ నా దగ్గర 'మొర' పెట్టుకుని 'అణ్ణా..! మీరే సహాయం

చెయ్యాలి...! లేకపోతే అటు ఫోను, ఇటు ఫ్యూజు పీకేస్తారని' అడిగితే ఆవిడ బాధ చూడలేక బిల్సు కట్టడానికి వెళ్తున్నా...!" వివరించాడు నటరాజన్.

"నేనూ మీలాగే...! ఈ మిక్సీ గోమతీ వాళ్ళది.. శరవణన్ మహా 'చెవలాయ్..!' అస్సలు ఇంటిపని పట్టించుకోడట. మిక్సీ లేకపోతే పాపం ఆడవాళ్ళకి ఎంత బాధ? అలాగే మన మాతృభూతం ఓ లేజీ ఫెలో...! మూడురోజులుగా పంపులో లీకవుతున్నా ఆయనకి 'చీమకుట్టినట్టు' కూడా లేదట. మరకతం మామి నాతో చెప్పుకుని బాధపడితే ఇప్పుడే ప్లంబర్ని పంపించా...!" నేనూ నా గొప్ప చెప్పుకున్నా.

"గ్రేట్ బీసీసార్..! మన వీధివాళ్ళకి 'మనం' సాయం చెయ్యకపోతే ఎవరు చేస్తారు? వస్తా...!" అంటూ బయల్దేరి వెళ్ళిపోయాడు నటరాజన్.

ఎల్క్ట్రికల్ షాపు దగ్గర దండాయుధ పాణి ఎమర్జన్సీ లైటు బాగు చేయిస్తున్నాడు. "చూస్తివా బీసీ సారు వాడూ....! మన నారాయణన్ రొంబ గుడ్‌ఫర్ నథింగ్ ఫెలో....! మూడు నెలలుగా ఇందలైటుని ఇంట్లోనే వుంచినాడు. పావం కరెంటు పోయినవ్వుడల్లా అండవాండ్లు ఎంత భయపడతావుంటారు? అందుకని నేనే రిపేరు చేయిస్తావుండా...!" ఒక'మంచి' పనిచేస్తున్నానన్న 'తృప్తి' మొహంలో 'తాండ' విస్తుండగా అన్నాడు దండాయుధపాణి.

"ఆమ దండాయుధపాణీ..! నేనుకూడా .." మొదట్నించీ నా సేవా కార్యక్రమాన్ని నేనూ 'తృప్తి' గా వివరించా..

మిక్సీకి కొత్త వాషర్ వేయించి తీసుకొస్తుండగా నత్తినాయర్ 'పెద్ద' వాటర్ పైపు భుజాన వేసుకొస్తూ కనిపించాడు.

"ఏమి నాయర్...పైపెందుకూ?" అడిగా.




"నాది కాదు సారూ....!మన నటరాజన్ శుద్ధ వేస్టుగాడు! రొంబ మోసం...! గార్డెనంతా ఎండిపోతా వున్నా పైపుకొని తీసుకురావటం లేదని 'అందమ్మా' కళ్ళనీళ్ళుపెట్టుకుంటే పోనీ కదా అని పైపుకొని తెస్తున్నా..!" నత్తుతూ అన్నాడు నాయర్.

"చూశావా? ఇంటి విషయం మానేసి పక్కింటి వాళ్ళకి సహాయ చేస్తాట్ట..! ఇంట్లోకి కావాల్సిన పైపు కొనలేడు గానీ ఆ శివమణి వాళ్ళ ఫోను బిల్లూ, కరెంటు బిల్లూ కట్టడానికి వెళ్ళాడు..!" కోపంగా అన్నా.

"కరెక్టు సారూ... మన పని మనం ముందు చెయ్యాల....! ఏమన్నా అనండి....! ఆ నటరాజన్ రొంబ 'మక్కు'..! "అన్నాడు నాయర్.

మిక్సీ గోమతి ఇంట్లో ఇచ్చేసి మా యింటి వైపు వెళ్తుండగా వేలాయుధం వాళ్ళ 'కుక్కర్' బాగు చేయించడానికి నాచ్చియారు, అన్బళగన్ వాళ్ళ 'హౌస్ టేక్స్' కట్టడానికి మధురై మునియాండీ ఆఘమేఘాల మీద వెళ్ళడం చూశా. (చూడటం కంటే వాళ్ళని ఆవి ఎంక్వయిర్ చేశాననడం కరెక్టు)

ఏమైతేనేం....ఇంటికి చేరి 'ఉస్సు' మంటూ ఊగుడు కుర్చీలో కూలబడ్డా.

"అయిపోయిందా దే...శ...సే....వ...!" మంచినీళ్ళగ్లాసు చేతి కందించి సీరియస్‌గా నా వంక చూసింది నా పెళ్ళాం.

"సేవ.. అంటే.. అదేంలేదు గానీ.. మరీ...!" కాస్త నసిగా. (అర్జంటుగా అబద్ధం ఆడలేక పోవటం నా వీక్‌నెస్. ఒకవేళ అబద్ధం ఆడినా మా ఆవిడ సెకన్లలో మరో 'కొచ్చిను' వేసి నిజం బయటకి లాగుతుంది. గోమతి వాళ్ళ 'మిక్సీ' స్వహస్తాలతో మోసుకెళ్ళి మరీ రిపేరు చేయించానని తెలిస్తే కొంపలు అంటుకుపోవూ....!)

"ఓహో...సేవలేం చెయ్యలేదన్న మాట..! సరే..! ముద్దపప్పు, వడియాలు, పచ్చిపులుసూ చేశా... పచ్చడి కావాలంటే మాత్రం రుబ్బుకోవాల్సిందే...! నా వల్లకాదు...!" డిక్లేర్‌చేసింది.

(అమ్మయ్య...గూఢచారులింకా పనిమొదలు పెట్టినట్టులేరు బ్రతికిపోయా..! గూఢచారులని ఎందుకంటున్నానంటే నేను ఎక్కడ ఏ పని చేసినా ఆవిడకి అర నిముషంలో 'వార్త' వచ్చేస్తుంది. అంతెందుకూ? మొన్న ఓ కాలేజీ పిల్లకి నా 'స్కూటీ' లో లిఫ్టిచ్చానని నేను చెప్పకపోయినా తనే తెల్సుకుని ఎంత ..! క్లాసు పీకిందనీ.)

"ఏం పచ్చడీ?" కుతూహలంగా అడిగా.

'గోంగూర'

"శభాష్...ఇంకేం క్షణంలో రుబ్బేస్తా...!" మహోత్సాహంగా రుబ్బురోలు ముందర పీటవేసుకుని కూర్చున్నా. అదేమిటో గానీ పచ్చడి రుబ్బేటప్పుడు భలే భలే ఐడియాలు వస్తయ్. పచ్చడి రుబ్బుతూ రాసిన పాటలన్నీ సూపర్ హిట్లే...!(అయ్యా..ఈ విషయం మా ప్రొడ్యూసర్లకీ కూచిపూడి వాళ్ళకీ మాత్రం చచ్చినా చెప్పకండి. నా మీద ఒట్టు. ప్రొడ్యూసర్లకి తెలిస్తే 'రుబ్బుతూ'నే పాటలు రాయమంటారు. ఇహ కూచిపూడి వాళ్ళకి తెలిస్తే నా పరువేం గానూ?)

"ఏమి హాయిలే హలా" అని పాడుకుంటూ గోంగూర పచ్చడి రుబ్బి టేస్టు చేద్దునుగదా. -వాహ్...! స్వర్గం గోంగూరలోనే వుందని పించింది. అయినా అప్పుడే ఏమయిందీ? 'దిట్టంగా' ఇంగువ పోపువేసి ఆ యొక్క ముద్ద పప్పులో కలిపి - చారెడు నెయ్యిపోసి ..మళ్ళీ కళాత్మకంగా కలిపి- ఉల్లిపాయ కొరుక్కుంటూ తింటూవుంటే- అప్పుడు తెలుస్తుంది



'పుల్లగోంగూర' పచ్చడి రుచి! (అన్నట్టు పచ్చి మిరపకాయి ఉప్పు అద్ది కొరికి నంజితే తిరుగే లేదు!)

పుల్లుగా లంచి 'బిగించి' ఓ నిద్దర తీసేసరికి హాల్లోంచి మాటలు వినిపిస్తున్నై. జాగ్రత్తగా విన్నా. అందరూ ఆడవాళ్ళే....! పకపకా నవ్వుకుంటూ మాట్లాడుకుంటున్నారు.

"భలే ఐడియా చెప్పినావు అణ్ణీ! పాపం ఆ మిక్సీ మాదేనని 'అన్న' అర్జంటుగా బాగు చేయించి తెచ్చారు...,!" గోమతి అంటోంది. నవ్వుల్లో మిగతా మాటలు వినిపించలా. గభాల్నలేచి చొక్కాతొడుక్కుని హాల్లోకి వచ్చేసరికి అందరూ గప్‌చిప్ అయిపోయారు.

"మళ్ళీ వస్తాం..!" అంటూ మా ఆవిడతో చెప్పి జారుకున్నారు. డైనింగ్ టేబుల్ మీద నేను 'రిపేరు'చేయించి తెచ్చిన మిక్సీ.

"అంటే?" అయోమయంగా మా ఆవిడ వంక చూశా.

"ఆ మిక్సీ ఎవరిదనా? ఏం వాయ్? పెళ్ళాం ఏ పని ఎన్నిసార్లు చెప్పినా చెయ్యడానికి చచ్చేంత బద్ధకం వొస్తుందిగానీ...పక్కింటి ఆడవాళ్ళు చెబితే మాత్రం ఎక్కడ లేని వుత్సాహం తన్నుకుంటూ వస్తుందా? ఆవిడ 'మిక్సీ' చెడిపోయిందనగానే ఆఘుమేఘాలమీద బాగుచేయించావే..ఇన్నాళ్ళూ నేను మొత్తుకుంటుంటే నీకెందుకు వినపళ్ళా? "సీరియస్‌గా నా వంక చూస్తూ అన్నది.

"ఇంతకీ ఆ మిక్సీ..."

"మనదే ..! పక్కింటి వాళ్ళ పని 'అర్జంటుగా' చేసే పరోపకారి పాపన్నవి కదా? అందుకే మన మిక్సీ ఆవిడకిచ్చి నీచేతికిమ్మన్నా. పాపం నువ్వు జాలిపడి వెంటనే బాగుచేయించి తెచ్చావు. ఇప్పుడు చెప్పు.. నిన్నేం చెయ్యాలో..?" అని మా ఆవిడ అంటుండగానే -

"అన్ని పంపులూ బాగుచేశా మేడమ్...!" అంటూ మెట్లుదిగివస్తూ వినయంగా నవ్వాడు నామాలవాడు.(ఇందాక మా ఆవిడో అతనో పేరు చెప్పారు గానీ మళ్ళీ మర్చిపోయా... అయినా అంతపెద్ద నామాలున్నవాడ్ని నామాలవాడంటేనే బాగుంటుంది.)

"అయితే... " సంశయంగా మా ఆవిడ వంక చూశా.

"మాతృభూతం గారింటికి ఇతన్ని నువ్వు పంపితే ఆవిడమనింటికి పంపించింది. వాళ్ళ పంపులన్నీ బాగానే వున్నాయి. పంపులు చెడిపోయింది. మనింట్లో!" వెటకారంగా నవ్వి ఎలక్ట్రీవాడికి డబ్బులిచ్చి పంపింది మా ఆవిడ.

"నువ్వు నన్ను చూసి అంత వెక్కిరింపుగా నవ్వాఖర్లా...! శివమణి వాళ్ళ బిల్లు నటరాజనూ.. నటరాజన్‌కి కావాల్సిన వాటర్‌పైపు నత్తినాయర్..."అంటుండగానే..

"వేలాయుధం ఇంటిపని నాచ్చియార్ అన్బళగన్ ఇంటిపని మునియాండీ వీర లెవల్లో చేసొచ్చారు..! అంతేగా?" రిటార్టిచ్చింది మా ఆవిడ.

"ఇవన్నీ నీకెలా తెలుసు?" అయోమయంగా అడిగా.

"ఓరి నా మొగుడా..! మీ మొగాళ్ళు ఎంత వెర్రివెంగళప్పలో మా ఆడాళ్ళకి తెలుస్తుందిగాని మీకెలా తెలుస్తుందీ? నువ్వు మనింటి మిక్సీ గోమతీ వాళ్ళదనుకుని బాగు చేయించినట్టుగానే నటరాజన్ పెళ్ళాం అడిగిందని నత్తినాయర్-శివమణి పెళ్ళాం అడిగిందని నటరాజనూ, అన్బళగన్ పెళ్ళాం అడిగిందని మునియాండీ, వేలాయుధం పెళ్ళాం అడిగిందని నాచ్చియారూ పనులు పూర్తిచేశారు. అసలు సంగతేమిటంటే ఎవరూ ఎవరికీ 'సేవ' చెయ్యలా..మీ ఇంటి పనులు మీ చేతే చేయించాం....!పెళ్ళాలు అడిగితే మీరు చెయ్యరుగా! అందుకే పక్కింటివాళ్ళచేత చెప్పించడం జరిగింది" మగాళ్ళ సైకాలజీని నిమ్మకాయని పిండినట్టు పిండింది మా ఆవిడ.

మరుసటిరోజున వాకింగ్‌కి పోతూంటే "కస్తూరీ" కుమరేశన్ 'అణ్ణా' అని పిలిచింది. నేను తిరిగి చూస్తే ఒట్టు.

మా వీధి మలుపు తిరగంగానే తిరువెంగడం గారు ఓ పెద్ద చీపుళ్ళ కట్ట మోసుకొస్తూ నన్నుచూసి..

"చూశారా బీసీసారూ వాడూ...! ఆ మరుద వినాయగం లేడూ.. ఒరి బడుద్దాయ్... చెవలాయ్... ఎండ్ గుడ్‌ఫర్ నథింగ్ ఫెలో...! నెలనుంచీ వాళ్ళవిడ చీపుళ్ళు తెమ్మని మొత్తుకుంటున్నా వినిపించుకోలేదట....! పాపం ఆవిడ నన్ను జాలిగా అడిగేసరికి .." తిరువెంగడం చెప్తూనే వున్నాడు. నాకు మహాసంతోషంగా చంకలు గుద్దుకుంటూ నవ్వాలనిపించినా 'ఏమీ' తెలీనట్టూ మొహం పెట్టా...!

ఆయన వెళ్ళిపోయాక చూడండీ... అక్కడిక్కడే... ఆ రోడ్డుమీదే...!

50 సంవత్సరాల నట జీవితాన్ని పూర్తి చేసుకున్న స్వర్ణోత్సవ నటీ జమున 'హాసం' పాఠకుల కోసం ప్రత్యేకంగా అందిస్తున్న జ్ఞాపకాల ధారావాహిక

5

# నేనూ నా పాటలు



- శ్రీమతి జమునా రమణారావు

'నయా ఆద్మీ' సినిమాని జూపిటర్ వాళ్లు నిర్మించారు. అదే తెలుగులో 'సంతోషం'. తెలుగు, హిందీ రెండూ సైమల్‌టేనియస్‌గా తీసారు. నేనూ, రామారావుగారు, అంజలీదేవి, రామశర్మ, అన్వర్ హుస్సేన్, హెలెన్, గోప్...! ఆ సినిమాలో బొంబై నుండి వచ్చిన వారు నలుగురో అయిదుగురో ఉన్నారు. మిగతా వారంతా సౌత్ ఇండియన్సే. అరవ పిక్చర్ 'వేలక్కారి'ని బేస్ చేసుకుని తీశారు. తెలుగు పిక్చర్ అంత బాగా ఆడలేదు. కానీ హిందీలో మాత్రం సూపర్‌హిట్.

'నయాఆద్మీ' నాకు ఫస్ట్ హిందీ పిక్చర్. ఆ సినిమాలో నాకే కాదు అంజలీదేవి గారికి, రామారావుగారికీ డబ్బింగ్ ఎవరిచేతనో చెప్పించారు. అందులో నా పాటలన్నీ సూపర్‌హిట్టే. మ్యూజికల్ హిట్ ఫిల్మ్. 25 వారాలు ఎంటైర్ కంట్రీ బాగా ఆడింది. నా ఫస్ట్ పిక్చరే హిస్టరీ క్రియేట్ చేసింది.

అందులో లతా మంగేష్కర్ నాకు పాడిన 'దిల్ బేతాబ్ ఠహర్ వో దిల్ బేతాబ్ ఠహర్ ఆనే వాలే హై ఇధర్ ఆజ్ కోయీ జానే జిగర్' చాలా పాప్యులర్ సాంగ్. అంజలీదేవి, రామశర్మలకు 'లౌట్ గయా...' అని ఓ మంచి డ్యూయెట్ ఉంది. లతా, రఫీ పాడారు. అదీ బావుంటుంది.

'నయాఆద్మీ' టైంలో జరిగిన చిన్న సంఘటన ఏమిటంటే - రామారావు గారు యాక్ట్ చేసేటప్పుడు మూడ్‌లోకి వెళ్లిపోతారు. ఆ సినిమాలో ఓ సన్నివేశం ఉంది. హీరోయిన్‌ని కొట్టి, చేయి వెనక్కి మెలితిప్పి ముందుకు తోసెయ్యాలన్న మాట. హీరోయిన్ ఫాదర్ బాగా రిచ్ మాన్. హీరో కష్టజీవి. హీరో హీరోయిన్స్ ప్రేమించుకోవటం, పెళ్లి చేసుకోవటం జరుగుతుంది. ఆమె తండ్రి మీద తనకున్న వగని ఈ అమ్మాయి ద్వారా తీర్చుకోవాలని ఆ ఫాదర్‌ని ఏడిపిస్తూ ఈ అమ్మాయిని టార్చర్ చేస్తాడు హీరో.

అందులో భాగంగా హీరోయిన్ చెయ్యి మెలితిప్పి వెనక్కి తిప్పి అవుట్ ఆఫ్ ఫ్రేమ్ తోసేయాలి. ఇక అంతే... చేయి తీసుకుని మెలిపెట్టి గట్టిగా తిప్పేశారు. తిప్పి కెమెరా అవుట్ ఫీల్డ్‌కి తోసేశారు. చేయి అలా ఉండిపోయింది. కదిలించలేక పోయా! ఆయన పెద్ద హీరో. ఏడుపు వచ్చి పక్కకెళ్లి కళ్లవెంట నీళ్లు వస్తూంటే, చేయి కదుపుతుంటే కలుక్కుమంటుంది కుడిచేయి. అప్పుడు ఏం చేయాలా అనుకుని- అసిస్టెంట్ ఉంటే చాటుకెళ్లి ఆమెతో నెమ్మదిగా రుద్దించుకున్నాక కొంచెం కంట్రోల్‌లోకి వచ్చింది. ఆ తర్వాత రెండు రోజులు చేతి నొప్పితో నానా అవస్థ పడ్డాను. అప్పటి నుంచి రామారావు గారు పట్టుకుంటే భయమేసేది. అదొక తమాషా సంఘటన.

'ముద్దుబిడ్డ'లో ఇంకో సంఘటన. చాలా యంగ్ ఏజ్‌లో వన్ ఆఫ్ ది బెస్ట్ పెర్ఫార్మెన్స్ క్యారెక్టర్ ఆ సినిమాలో చేశాను. జగ్గయ్య గారు హీరో. తిలక్ నిర్మాత, దర్శకుడు. శరత్ నవల ఆధారంగా తీసిన సినిమా! ఆ క్యారెక్టర్ ఒక క్షణంలో చాలా బాగుంటుంది. మరుక్షణంలో మూడ్ మారిపోతుంది. కోపంగా ఉంటుంది ఇంకొక క్షణంలో సంతోషంగా ఉంటుంది, మరుక్షణంలో ఏడున్నంటుంది. చాలా ఎక్సెంట్రిక్ క్యారెక్టర్..

ఆ సినిమాలో ఓ పాట ఏంటంటే ..... బొమ్మలుపెట్టుకుని పాడే పాట. 'చిట్టీ పొట్టీ వరాల మూట'. ఫస్ట్ ఆ క్యారెక్టర్‌లో చైల్డిష్ మెంటాలిటీ కూడా ఉంటుంది. అయితే చిన్నప్పటి నుండి ఆ బొమ్మతోటి మదర్లీ ఎఫెక్షన్.

పాట చివరికి మేనత్త వచ్చి ఆ బొమ్మ లాక్కుంటుంది. వెంటనే ఈ అమ్మాయికి ఫిట్స్




'ముద్దుబిడ్డ' పాటల పుస్తకం కవర్‌పేజీ

'నయాఆద్మీ' చిత్రంలో తనకు నచ్చిన రెండు పాటల సాహిత్యాన్ని హిందీ లిపిలో రాసుకున్న శ్రీమతి జమున స్వదస్తూరి ఇది.



## ఆ పాటలు తెలుగు లిపిలో...

లౌట్ గయా గమ్ కా జమానా
ఆయీ ఖుషీ లెహర్ ఆతీ -
దూర్ గగన్ మే దేఖో చమ్‌కే
ఆశా వోంకే తారే
క్షిల్ మిల్ తారే ప్యారే
బద్‌లీ మే చుప్‌కర్ - తారో ఝుకే సంగ్
చందా కరే యిశారే - యిస్‌కీ లగన్ మే
ఆజ్ పవన్ హై బాగోం మే యిక్‌లాతీ

రాత్ నయీ హర్‌బాత్ నయీ హై
నయా నయా హై జమానా
కైసా సమా సుహానా
గాయీ చమనియాం ధీరే - ధీరే
ప్రీత్ భరా అఫ్‌సానా
ఆజ్ మేరే ఛోటే సే మన్ మే
ఆశా హై ముస్కాతీ ॥లౌట్॥

---

దిలే బేతాబ్ ఠహర్... వో దిలే బేతాబ్ ఠహర్
ఆనేవాలా హై ఇధర్ ఆజ్ కోయీ జానే జిగర్
ఆజ్ కోయీ జానే జిగర్

రాహ్ మే ఉన్‌కీ బిఛా రఖ్‌తీ హై
మైనే పల్‌కే - ఆజ్ ఆంఖో మే తమన్నావోంకే
సాగర్ ఛల్‌కే దిల్‌కో క్యా చాహియే
బస్ ప్యార్ భరీ ఏక్ నజర్ దిల్ కో క్యా
చాహియే బస్ ప్యార్ భరీ ఏక్ నజర్
ఏక్ ముద్దత్ సే సదా మన్‌మేరా దిల్ కా
ఖాలీ - ఆగయీ ఆగయీ అబ్ రాత్
మురాదోంవాలీ - లేకే ఆయీ హై ఉన్సే దర్ద్ ...
ముహబ్బత్ అమర్ - లేకే ఆయీ హై ఉన్సే దర్ద్..
ముహబ్బత్ అసర్ -



'నయాఆద్మీ' చిత్రంలో...



వస్తాయి. అలా రాగానే చేతిలో తాళాలు పెడతారు. పూర్వం రషెస్ వెంటవెంటనే చూసుకునే వాళ్లం. సరే... వాహినీ స్టూడియోకెళ్లి అమ్మా నాన్న తమ్ముడు అందరం చూస్తున్నాం. ఫిట్స్ సీన్ వచ్చింది. మా అమ్మ అది చూసి పోలోమని ఒకటే ఏడుపు . 'ఏంటి ఏంటి' అని ప్రొజెక్షన్ ఆపేసి 'ఎందుకమ్మా ఏడుస్తున్నావు?' అని అడిగితే 'నీకు చిన్నప్పుడు ఫిట్స్ వచ్చేవి. అది నాకు గుర్తొచ్చింది. ఎందుకు నువ్వు ఇలాంటి సీన్స్ చేస్తావు' అని ఆవిడ ఏడుపు. తల్లి హృదయం అలా ఉంటుంది. అదో మరపురాని సంఘటన.

ఆ సినిమాలో 'ఎవరు కన్నారు ఎవరు పెంచారు' పాట సాహిత్యపరంగానూ, ట్యూన్ పరంగానూ చాలా మంచి పాట. ఇద్దరు తల్లులు ప్రేమ ఎలా పంచుకుంటారనేది ఆరుద్రగారు చాలా గొప్పగా రాశారు. ఇంకోటి 'చూడాలని వుంది...' పాట. శరత్ సాహిత్యం మొత్తం నా దగ్గర ఉంది. చక్రపాణి గారు చాలా బాగా అనువాదం చేశారు.

ముద్దుబిడ్డ, తర్వాత భాగ్యరేఖ గురించి చెప్పుకోవాలి. నాకు ఫస్ట్ నేషనల్ అవార్డు తెచ్చిపెట్టిన చిత్రమది. బి.ఎన్.రెడ్డి గారితో మొదట 'బంగారు పాప' చేసినా అది గెస్ట్ వేషమే. దానిలో కృష్ణకుమారి గారు హీరోయిన్. నాది మరీ చిన్నవేషం. మా నాన్నగారికి, నాకు కూడా అంత చిన్న వేషం అంటే ఇష్టం లేకపోయింది. ఎందుకంటే ఓసారి చిన్న వేషం వేశామంటే ఇక దానికే మనల్ని ఫిక్స్ చేసేస్తారని. అయితే బి.ఎన్.రెడ్డి గారు పర్సనల్‌గా మా నాన్నగారితో 'ఆ వేషానికి అమ్మాయిని ఎందుకు అడుగుతున్నానంటే - అమ్మాయికి ఆ మహారాష్ట్రియన్స్ లా లాంగ్ ఫేస్ ఉంది.(ఈ చిత్రంలో జగ్గయ్య మహారాష్ట్రియన్ అమ్మాయిని పెళ్లి చేసుకుంటాడు) అమ్మాయికి ఆ కట్టుకడితే ఆ లుక్ వస్తుంది. వేషం చిన్నదైనా అమ్మాయి కనిపించినంతసేపు చాలా చక్కటి గుర్తింపు వస్తుంది. కాబట్టి మీరు చేయండి" అని ఒప్పించారు. బి.ఎన్.రెడ్డిగారి దర్శకత్వంలో ఫుల్ లెంగ్త్ క్యారెక్టర్ చేసిన చిత్రం - భాగ్యరేఖ. అది సూపర్‌హిట్. భాగ్యరేఖ అంటేనే జమున, పక్కన 'ఏడుకొండల వెంకటరమణ స్వామి, నీ వుండేదా కొండపై' అనే పాట, అలాగే కన్నీటి కడలిలోనా పాట అందరికీ గుర్తొస్తాయి.

బి.ఎన్.రెడ్డి గారు యాక్ట్ చేసి చూపించలేరు కానీ, తనకు కావలసినది

నేనూ నా పాటలు



చిత్రం : ముద్దుబిడ్డ　రచన : ఆరుద్ర　సంగీతం : పెండ్యాల

గానం : పి.సుశీల

చిట్టీ పొట్టీ వరాల మూటా
గుమ్మడి పండు గోగు పువ్వు
నీకూ నాకూ ఏ వేళైనా ఎడబాటే లేదమ్మా
ఏమంటావే బొమ్మా　ఓ.ఓ.ఓ.
ఎవరూ లేరే నీ సాటి
పోటీ ఎవరే నీతోటి
ఆటా పాటా అల్లన మెల్లన
ఆడుకుందామమ్మా
ఏమంటావే బొమ్మా　ఓ.ఓ.ఓ.
కాళ్ళాగజ్జా కంకాళమ్మా
వేగు చుక్కా వెలగా మొగ్గా
నీకూ నాకూ ఏ వేళైనా ఎడబాటే లేదమ్మా
ఏమంటావే బొమ్మా
ముందుగ యిప్పుడు ముస్తాబు
అవుదామయ్యా నా బాబు　॥ముద్దుగ॥
మేఘాలందున తేలీ సోలీ పోవాలమ్మ షికారు
రారూ - బొమ్మగారూ　॥చిట్టీ॥
ఊసులన్నీ నీతోనే ఆశలన్నీ నీమీదే　॥2॥
నీవే దగ్గర లేకపోతే ఏమౌతానోనమ్మా
నేనేమౌతానే బొమ్మా　ఓ.ఓ.ఓ.　॥చిట్టీ॥







గానం : పి.లీల

ఎవరు కన్నారెవరు పెంచారు
నవనీత చోరుని గోపాలబాలుని
ఎవరు కన్నారెవరు పెంచారు
నోము నోచి నెలలు మోసి
నీలమేఘశ్యాము కన్నది దేవకి
లాల పోసి పాలు పట్టె
జోల పాడే కలిమి కలిగె యశోదకి　॥ఎవరు॥
తడవ తడవకు కడుపు శోకము
తాళజాలక పెంచనిచ్చెను దేవకి
తాను కనకయె తల్లి అయ్యెను
తనయుడాయెను దేవుడే యశోదకి　॥ఎవరు॥
ఎవరు కనినా ఎవరు పెంచిన
చివరికతడానందమిచ్చిన దెవరికి
అవనిలో తనపైన ఎన్నో
ఆశలుంచిన వారికి
తననాశ్రయించిన వారికి　॥ఎవరు॥











ఆర్టిస్ట్ దగ్గర్నుంచి బాగా తీసుకుంటారు. ఆయనలో ఉన్న గొప్పతనమే అది. ఆయనకు ఒక థియరీ ఉండేది. సాధారణంగా హీరోయిన్స్ ఏడ్చేటప్పుడు ముఖం అంతా అష్టవంకరలు పోతూ ఉంటుంది. ఏడ్చేటవ్పుడు కూడా అందంగా ఉండాలనేది బి.ఎన్.రెడ్డి గారి థియరీ. అలా అందంగా ఏడవడం అనేది ఆయన బాగా నేర్పించారు.

బి.ఎన్.రెడ్డి గారి 'పూజాఫలం' లో నేను సెకండ్ హీరోయిన్. అప్పటికే నేను టాప్ హీరోయిన్. అయినా కూడా ఆ సినిమాలో ఆ క్యారెక్టర్ చేశానంటే -బి.ఎన్.రెడ్డి గారి గొప్పతనం, ఆయన మీదున్న గౌరవం, వారి సినిమాలో చిన్న క్యారెక్టర్ అయినా చాలా ప్రాధాన్యత ఉండి రాణించే విధంగా ఆయన తీర్చిదిద్దుతారని మనకు తెలుసు. అందుకని ఆ క్యారెక్టర్ చేశాను. ఆ సినిమాలో సావిత్రి హీరోయిన్. నాగేశ్వరరావు గారు హీరో.

బి.ఎన్.రెడ్డి గారు చెప్పటం కూడా నాన్నగారికి అలానే చెప్పారు. 'అమ్మాయి క్యారెక్టర్



చిత్రం : భాగ్యరేఖ | రచన : దేవులపల్లి వెంకటకృష్ణశాస్త్రి | సంగీతం : పెండ్యాల

గానం : పి.సుశీల

నీవుండే దా కొండపై!
నా స్వామి ! నే నుండే దీ నేలపై
ఏ లీల సేవింతునో !
ఏ పూల పూజింతునో !
శ్రీ పారిజాత సుమా లెన్నో పూచె
ఈ పేదరాలి మనస్సెంతో వేచె
నీ పాదసేవా మహాభాగ్య మీవా
నా పైని దయజూపవా నా స్వామి ॥నీ వుండే॥
దూరాన నైన కనే భాగ్య మీవా
నీ రూపునాలో సదా నిల్వనీవా
ఏడు కొండలపైనా వీడైన స్వామి
నా పైని దయజూపవా నా స్వామి ॥నీ వుండే॥




'భాగ్యరేఖ' పాటల పుస్తకం కవర్‌పేజీ

గానం : ఎ.ఎం.రాజా, పి.సుశీల

ఆ: కన్నీటి కదలిలోన- చుక్కాని లేని నావ
దిక్కైన లేని నావ!
ఏ తీరమైన చేరునో -ఏరాల పాల బడునో
ఏగాలి వాతబడునో ॥కన్నీటి॥
అ: నా పాలి భాగ్య దీపము- నన్నేలు దివ్వతార
పోయేన జీవన తార!
కన్నీటి కదలిలోన -కానరాక దాటిపోయే
నను వీడి మాయ మాయె!
ఆ: నా ఆసలే ఆడియాసలై మాసేన, జీవనగాథ?
ఈ నా విషాద గాథ!
కన్నీటి కదలిలోన- నడిదారి, రాత్రి మూసె
నవచంద్రకాంతి మాసె
అ: ఏ నాటికి వసంతము ఈ తోట కింక రాదా?
నా వీట వెలుగిక లేదా?
కన్నీటి కదలి లోన- కనరాక దాటిపోయే
నను వీడి మాయ మాయె !





అస్తమానం మనకు కనిపిస్తూనే ఉంటుంది. మనం అసలు మరచిపోలేము. చాలా చిలిపిది. అల్లరిపిల్లగా ఉండాలి. అమ్మాయి తప్పించి అల్లరి చేసే హీరోయిన్స్ ఇప్పుడు లేరు. చాలా మంచి క్యారెక్టర్ అన్నారు. ఆ సినిమాలో నా వేషం చిన్నదే అయినా ప్రజల హృదయాలలో చెరగని ముద్ర వేసింది.

ఇప్పటికి కూడా ఎక్కడైనా పూజాఫలం ప్రస్తావన వస్తే 'మీ మిక్కి బావుందా..?(కుక్కతో వస్తుంది కదా) అది మీ కుక్కేనా అండీ' అని అడుగుతుంటారు. అందులో కుక్క మాదే. తమాషా ఏమిటంటే - ఆ పాత్ర కుక్క పిల్లని పెట్టుకుని తిరుగుతుంటుంది. మా ఇంటిలో 25, 30 కుక్కలు పమెరియన్సే! అందులో మిక్కీ అని బ్లాక్ డాగ్. దాన్ని పెట్టాం. అది సెట్‌లో కొచ్చేటప్పటికి - ముందు నా ఒళ్లో కూర్చోవటం అదీ బాగానే చేసింది. అది ట్రెయిన్డ్ డాగ్ కాదు కదా..... పెట్ డాగ్...! గొలుసు తీయటంతోటే ఎక్కడెక్కడికో వెళ్లి పోవటం. టేబుల్ కింద చేరిపోవటం, భయపడిపోవడం, ఎవరన్నా పట్టుకోబోతే నేవెళా కు(యెవ్వామని ఏడవడం. బి.ఎన్.రెడ్డి గారు 'పాపం దాన్ని కంగారు పెట్టకండి. అమ్మా మీరే హేండిల్ చేయండి' అన్నారు. మా పనివాడ్ని తీసుకొచ్చి అతనొక వైపు పైన మెట్ల మీద నేను కూర్చొని 'మిక్కీ మిక్కీ దా దా' అని అరుస్తూ వుంటే పైకి పరుగెత్తికొచ్చేది. ఇక ఎవరైనా పట్టుకోబోతే టేబుల్ కిందైనా, దేనికిందైనా దూరటం ..... ఇంట్లో అలాగే చేస్తూ ఉంటాయి కదా కుక్కలు.

మనుషుల్ని హేండిల్ చేయటం ఈజీనే కానీ, జంతువులన్ని హేండిల్ చేయటం కష్టం. దానికి చాలా పేషన్స్ ఉండాలి. ఆ సీన్ చేయటానికి ఒకరోజు పట్టేసింది. పొద్దున్న 9 నుంచి రాత్రి 9.30 వరకూ చేయవలసి వచ్చింది. ఆ సినిమాలో నాకు ఒకటే పాట. అది సూపర్ హిట్.

(ఆ పాట గురించి, మరికొన్ని పాటల గురించి వచ్చేసంచికలో.... )



శ్రీమతి జమున తెలిపిన సన్నివేశాలివే. ('పూజాఫలం' చిత్రం నుండి)



ప్రముఖ దర్శకుడు
శ్రీ సింగీతం శ్రీనివాసరావు
'హాసం' పాఠకుల కోసం
ప్రత్యేకంగా రాస్తున్న

## కరాజు కథలు 13

# 'వంద'నాలు




కరాజు రాజ్యంలో అసాధారణ ప్రతిభావంతులను గుర్తించి, వారిని తగురీతిన సన్మానించి 'రాజ్యరత్న' బిరుదును ప్రసాదించడం ఎన్నో దశాబ్దాలుగా జరుగుతున్న ఒక మహత్కార్యం. ఇంతవరకు సన్మానం పొందిన వాళ్ళంతా వారి వారి వృత్తుల్లో ఉన్నత శిఖరాలని ఆరోహించిన వయోవృద్ధులు. జీవన సంధ్యలో వుండేవారికి ఇది కాస్త తృప్తినిచ్చేది. కాని ప్రజాబాహుళ్యంలో మాత్రం వారిని గురించి పెద్దగా పట్టించుకొన్న వాళ్ళెవరూ లేరు.

కానీ ఈ మధ్యన ఎందుకో కొందరికి చిన్న వయస్సులోనే అలాంటి కీర్తి వస్తే బాగుంటుందనే కొత్త కోరిక చిగురించింది. పంచభక్ష్య పరమాన్నాలు పడుచువాని ముందు పెట్టడంలో అర్థముంది కాని ఆరిగించుకోలేని అరవై దాటిన వాళ్ళకిస్తే వ్యర్థం కదా? ఈ ఆలోచన కొద్దిమందిలో బాగా నాటుకుంది. తమకంటే గొప్పవారెవ్వరూ లేరనుకునే వీరు వాళ్ళకు తెలిసిన ప్రభుత్వాధికార్లని వెంటాడి ఏదో విధంగా తమకు 'రాజ్యరత్న' బిరుదును సంపాదించి పెట్టమని సతాయించారు. ఈ బాధలోంచి ఉద్యోగులు తప్పించుకోలేక ఎట్టకేలకు మంత్రిగారిని కలిసి ఈ గొప్పవారి కోర్కెలను తెలియపర్చారు.

అంతకు ముందే మంత్రిగారు ఈ సంవత్సరవు రాజ్యరత్న బిరుదుని ఎవరికిద్దామని ఆలోచించి చివరకు దీనికి విష్ణుశర్మే అర్హుడని నిశ్చయించుకున్నారు. విష్ణుశర్మ కిపుడు డెబ్భై ఎనిమిది సంవత్సరాలు. గత అరవై సంవత్సరాలుగా చతుర్వేదాలను తెలుగులోకి కావ్యరూపంలో అనువదించి అర్థతాత్పర్యాలను సమకూర్చి తెలుగువారికి గర్వకారణంగా ఉండదగిన ఉత్తమ కృతిని అందించాలని కృషి చేసినవాడు. ఇంతకంటే అర్హుడు ఉండబోడని నిశ్చయించుకొని తన అభిప్రాయాన్ని కరాజుగారికి చెప్పాలనుకున్న తరుణంలో 'రాజ్యంలో గొప్పవాళ్ళు చాలామంది ఉన్నారు, వారి పేర్లను కూడా పరిశీలించవలసినది' అని ఉన్నతాధికారులు గుంపులు గుంపులుగా పెద్ద మనుష్యులను వెంట బెట్టుకొని మంత్రిమీద ఒత్తిడి తేవడం మొదలెట్టారు. మంత్రి సందిగ్ధంలో పడ్డాడు.

"కాదు విష్ణుశర్మకే బిరుదునిస్తాం' అని పట్టుబడ్తే "వేదాన్ని తెలుగులోకి అనువదించకపోతే ఏం? అవేమన్నా కూడుపెడ్తాయా?" అని ఎద్దేవా చేస్తారు. ఇంకా రకరకాల వాదనలతో మంత్రి సరైన నిర్ణయం తీస్కోలేని అసమర్థుడుగా చిత్రీకరిస్తారు. ఇంతమందిని కాదనే దమ్ము మంత్రికి లేక "వి

ప్రతిపాదనలను కూడా ఆలోచిస్తాను'' అని అందరికి నచ్చచెప్పి తన గోడును కరాజుకు చెప్పుకోడానికి బయల్దేరాడు.

కాని దారిలో ఒక ఆలోచన వచ్చింది. తనగోడు విన్న కరాజుకు కూడా తనను ఒక నిర్ణయం తీస్కోలేని అసమర్థుడనుకుంటే? ఇక అప్పుడు తన అపకీర్తికి రాజముద్ర పడినట్టే. ఈ ఆలోచన రాగానే తక్షణం వెనక్కు తిరిగి ఇల్లు చేరుకున్నాడు.

రాత్రి డాబామీద వెన్నెట్లో అటూ యిటూ తిరుగుతూ ఆలోచిస్తే తళుక్కుమని ఒక ఉపాయం తట్టింది. వెంటనే రాజ్యంలోని పేరున్న వారు అయిదుగురితో ఒక కూటమిని ఏర్పాటు చెయ్యాలి. ఇక నుంచీ రాజ్యరత్న బిరుదుకు అర్హులెవరో నిర్ణయించే బాధ్యత పూర్తిగా ఈ కూటమిదే. వారెలా చెప్తే అది కరాజుకి చెప్పడమే. ఇక తనను చుట్టుముట్టే వాళ్ళెవరూ ఉండరు. పీడ వదుల్తుంది.

మరుసటిరోజే తన పథకాలను అమలు పెట్టాడు మంత్రి. ఊళ్ళో పేరున్న అయిదుగురిని పిలిపించి 'రాజ్యరత్న బిరుదు కూటమి'ని ఏర్పరిచాడు. ఈ పదవులొచ్చిన కొత్తల్లో కూటమిలోని సభ్యులంతా మహానందంలో మునిగిపోయారు. ఇక మెల్లమెల్లగా ఊరివారు వాళ్ళను బిరుదు కోసం ఒత్తిడి చేస్తూంటే ఒక హోదావచ్చిన వారిలా మురిసిపోయారు. మంత్రి గారికైతే ఇదంతా తలనొప్పి వ్యవహారంగా కన్పించింది కాని సభ్యులకు మాత్రం కొంతమంది పెద్దలు వాళ్ళ వెంటబడడం సంతోషంగా వుంది. "సరే అలాగే చూద్దాంలేండి" అంటూ తమ అజమాయిషీ ప్రదర్శించారు. డబ్బుకన్నా పదవి గొప్పదన్న విషయం సభ్యులకిప్పుడే అర్థమైంది. రాజ్యంలోని వారందరి దృష్టి తమమీదే వుందని సభ్యులకు తెలుసు.

అందుకని తామిప్పుడు బిరుదుకు అర్హుణ్ణి ఎంపిక చేసే విధానం కొత్త పద్ధతిలో వుండి జనమంతా శభాష్ అనేటట్టుగా ఉండాలి. అంతకుముందు బిరుదు పొందిన వారంతా బహుకొద్దిమంది విద్యావంతులకు తప్ప ఎవ్వరికీ తెలీదు. అలా కాకుండా ఇప్పుడు తాము ఎంపిక చేసే వ్యక్తి తప్పనిసరి ప్రజలు మెచ్చిన వాడుగా ఉండితీరాలి. అలాంటి వ్యక్తిని పట్టేదెలాగని ఆలోచిస్తే ఆలోచిస్తే వాళ్ళకొక మంచి మార్గం స్ఫురించింది.

'వంద' అనే సంఖ్య ప్రశస్తమైనదని అందరికీ తెలుసు. వందేళ్ళు బతికిన వాడుగొప్ప. అది పూర్తిగా ఆరోగ్యంగా బతికినా గొప్పే. నలభయ్యవ యేట మంచానపడి మిగతా అరవై ఏళ్ళు నడవలేక, చూడలేక, తినలేక అందరిచేతా చాకిరీ చేయించుకుంటూ అలా వందయేళ్ళ వరకు డేకినా అదీ గొప్పే. అంటే ఎవరైనా సరే వందసంఖ్య తగిలేట్టు తన ప్రతిభను కనపరిస్తే అంటే వంద ప్రదర్శనలు, వందకచేరీలు, వంద కావ్యాలు ఇలా ఏదైనా వందకి మించి చేశాడంటే అతడు నిజంగా రాజ్యరత్న బిరుదుకు అర్హుడు. ఈ నిర్ణయానికి అందరూ ఉత్సాహంతో తమ ఆమోద ముద్ర వేశారు. ఇప్పుడు వాళ్ళు చెయ్యాల్సిందెల్లా వంద పూర్తిచేసిన ప్రతిభావంతులెవరో కనిపెట్టడం.

ఈ పద్ధతిలో నాలుగే నాలుగు వేదాల్ని తెలుగులోకి అనువదించిన విష్ణుశర్మకు అవకాశమే లేదు. మిగతా వారు కూడా ఒకే ప్రబంధమో, ఒకే పరిశోధనా గ్రంథమో రాస్తున్నారు. వాళ్ళంతా వంద సంఖ్య చేరుకునేదెన్నడు? ఇక ప్రజ్ఞానిధులైన కర్ణాటక సంగీత విద్వాంసులు కూడా పది కచేరీలు చేస్తే ఎక్కువ. అదికూడా ఉత్సవాల రోజైతేనే కొంత జనం వస్తారు. లేకపోతే అదీ లేదు.

రెండు సంవత్సరాల క్రితం అయితే మదనగోపాలుడనే నాటక కర్తకు ఇచ్చుండేవారు. అతను "రతిరాజు విలాసము" అనే నాటకాన్ని రాసి తనే ముఖ్య భూమికలో నటించి ప్రదర్శించాడు. అది కామదాసుడైన ఒక రాజు కథ. మొదటి నాలుగు అంకాలు అతను వేర్వేరు స్త్రీల మోహంలో పడిన తీరు, శృంగార సన్నివేశాలతో రసవత్తరంగా చెప్తుంది. చివరి అంకంలో అతను భక్తి మార్గంలోకి ఎలా మారిందీ చెప్తుంది. ఈ నాటకం అశేష ప్రజాదరణ పొందింది. వచ్చిన జనం అంతా నాలుగు అంకాలు చూచి, శృంగార దృశ్యాలయిపోగానే ఆలస్యమైపోయిందని చివరి అంకం చూడకుండానే వెళ్ళిపోయేవారు.

ఈ నాటకాన్ని చిన్నపిల్లలు చూడకూడదన్నారు



గనుక వాళ్ళు రహస్యంగా తొంగితొంగి చూసేవారు. ఇది విజయవంతంగా వందసార్లకుపైగా ప్రదర్శించబడింది. కాని దురదృష్టవశాత్తు మదనగోపాలుడు రెండేళ్ళక్రితమే చనిపోయాడు. అతను వుండివుంటే ఈ యేడు అతనికే రాజ్యరత్న బిరుదును ప్రసాదించి వుండేవారు. ఇప్పుడు అలాంటి వారు ఎక్కడున్నారా అని కలియజూస్తే వెంటనే అందరికీ గుర్తొచ్చిన పేరు ప్రముఖ రంగస్థల నటుడు రంగభూషణ్.

రంగభూషణుడు చిన్నప్పుడే తన నటనా పాటవాన్ని ప్రదర్శించాడు. చదువుకునే రోజుల్లో ఒక రోజు "కోడి పెట్ట గుడ్డు ఎలా పెడ్తుంది" అనే దృశ్యాన్ని తనే కోడిపెట్టలా నటిస్తూ కో కో కో అంటూ అటూయిటూ చూస్తూ గుడ్డుపెట్టే వరకు అతి హృద్యంగా వాస్తవికంగా ప్రదర్శించాడు. ఇది చూసిన స్నేహితులంతా ఆనందంతో చప్పట్లు కొట్టడమేగాక మళ్ళీ మళ్ళీ అతని చేత కోడిగుడ్డు కథను నటింపచేసి ఆనందించేవారు. ఈ ప్రోత్సాహంతో రంగ భూషణుడు పెద్దయ్యాక పెద్ద నాటకాలు వెయ్యడానికి పూనుకున్నాడు.

మొట్టమొదటిసారిగా సతీసావిత్రి నాటకంతో మొదలెట్టి తాను యమధర్మరాజు పాత్రను వేశాడు. నాటకం చూసిన వారంతా ఈ యముడు సత్యవంతుడితో పాటు తమ ప్రాణాల్ని కూడా తీసుకున్నాడనుకున్నారు. తర్వాతి ప్రదర్శన కెవ్వరూ రాలేదు. ఈసారి బ్రహ్మవేషం వేశాడు. అది చూసిన జనం అతని అసలు ముఖానికీ తగిలించుకున్న మూడు ముఖాలికీ నటనలో ఎలాంటి తేడా లేదన్నారు. ఇలా ఏ వేషం వేసినా చూసిన వాళ్ళంతా అసంతృప్తితో చప్పరిస్తూనే వున్నారు. రాను రాను రంగ భూషణుడి నాటకం అంటే జనంలో. ఎలాంటి ఉత్సాహమూ కనిపించలేదు. ఇది గమనించిన రంగ భూషణ్ తన నాటకాలకు జనాల్ని ఎలా ఆకర్షించాలా అని ఆలోచించాడు.

మెఱుపులా ఒక ఆలోచన తట్టింది. తాను చిన్నప్పుడు చేసిన కోడిగుడ్డు దృశ్యాన్ని ఒక కొత్త ఆకర్షణగా నాటకం చివరలో జతచేస్తే? వెంటనే ఈసారి వేసే "సత్యహరిశ్చంద్ర నాటకం చివరిలో ఊహించని కొత్త ఆకర్షణ" అని భారీగా ప్రచారం చేశాడు. అదేమిటో చూద్దామని జనం వచ్చారు. నాటకం అంతా చూసి నీరసించిన జనం చివరిఘట్టం పూర్తికాగానే హరిశ్చంద్ర పాత్రధారి ఉన్నట్టుండి కోడిపెట్ట ఎలా గుడ్డుపెట్టింది అనే దృశ్యాన్ని ప్రదర్శించేసరికి అందరికీ ప్రాణం లేచివచ్చినట్లైంది. అందరూ విపరీతంగా స్పందించారు. చప్పట్లుకొట్టి ఈ దృశ్యాన్ని మళ్ళీ మళ్ళీ వేయించుకున్నారు. మొట్టమొదటి సారిగా రంగభూషణుడి నాటకం దిగ్విజయం సాధించింది.




అప్పట్నుంచి రకరకాల పాత్రల నాటకాలు వెయ్యడం, జనం తండోపతండాలుగా వచ్చి కోడిగుడ్డు దృశ్యం కోసం చివరి వరకు కాచుకొని ఉండడం, అది చూడగానే జన్మ ధన్యమైందన్న సంతోషంతో ఇంటికి వెళ్ళడం. ఇలా కొనసాగి ఈ మధ్యనే రంగ భూషణుడు వందపాత్రలను పోషించిన ప్రతిభావంతుడయ్యాడు. అందుకనే కూటమి వారు రాజ్యరత్న బిరుదుకు రంగభూషణ్ణి ఏకగ్రీవంగా ఎంపిక చేసి తమ నిర్ణయాన్ని మంత్రి గారికి తెలియజేశారు.

"మరి నాలుగు వేదాలను తెలుగులోకి అనువదించిన విష్ణుశర్మ" అని అడిగాడు మంత్రి దీనంగా. "వందపాత్రలు చేసిన రంగభూషణు డెక్కడా? కేవలం నాలుగే నాలుగు వేదాలను అనువదించిన విష్ణుశర్మ ఎక్కడ?" అన్నారు సభ్యులు తీక్షణంగా.

గత్యంతరం లేక మంత్రి నేరుగా కరాజును సందర్శించి కూటమి నిర్ణయాన్ని తెలియజేశాడు. ఇదే సమయంలో ఒకతను -స్థూలకాయుడు, నల్లగా బుఱ్ఱమీసాలతో భయంకరంగా కనిపిస్తున్నాడు- రాజుగారి దర్శనార్థం మందిరంలోకి ప్రవేశించి రాజుగారికి పండ్లు, పూలు సమర్పించుకొని సవినయంగా నమస్కరించాడు.

"ఎవరు?" అన్నాడు కరాజు.

"నేను మహారాజా! వీరభద్రుణ్ణి. మన చెఱసాలలో నేరస్థులను ఉరితీసేవాణ్ణి" అన్నాడు ఆ వ్యక్తి వినయంగా.

"ఓహో! ఏమిటిలా వచ్చావ్?" అనడిగాడు కరాజు.

"మహారాజా! ఈ రోజు నాకు పండగ లాంటిరోజు. తమరు నాకిచ్చిన ఈ ఉద్యోగాన్ని ఇన్ని సంవత్సరాలు శ్లాఘనీయంగా నిర్వహిస్తూ ఎంతోమందిని ఉరితీశాను. ఈ రోజునే నూరవ వాణ్ణి ఉరితీశాను. దీంతో వందమందిని ఉరితీసిన ఘనతను సంపాదించాను. ఈ సంతోష సమయంలో మీకు నా వందనాల నర్పించుకోడానికి వచ్చాను" అన్నాడు వీరభద్రుడు మళ్ళీ నమస్కరిస్తూ.

కరాజు మంత్రిని చూసి "చూశారా మంత్రీ! వందసంఖ్యను చేరుకొన్న మరొక ప్రతిభాశాలి మనకిపుడు ప్రత్యక్ష మయ్యాడు. రంగ భూషణుడి లాగే ఇతను కూడా రాజ్యరత్న బిరుదుకు అర్హుడే కదా!" అన్నారు.

వెంటనే మంత్రి .ఈ విషయాన్ని బిరుదు కూటమి సభ్యులకు తెలియజేస్తే వారు కూడా మహదానందంతో ఈ నిర్ణయాన్ని మెచ్చుకొని ఈ సంవత్సరపు రాజ్యరత్న బిరుదులను ప్రకటించారు.

ఉగాదినాడు ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన సభలో వందపాత్రలకు ప్రాణం పోసిన రంగభూషణుడికి, ఉత్తమ రీతిలో వందమందిని ఉరితీసిన వీరభద్రుడికి రాజరత్న బిరుదులను బహూకరించారు. రంగభూషణుడు కూడా బహుమతిని గైకొనగానే జనం అంతా ఒక్కుమ్మడిగా ఈ గౌరవానికి మూలకారణమైన కోడిగుడ్డు ప్రదర్శన చేయవలసిందిగా కోరుతూ నినాదాలు చేశారు.

రంగ భూషణుడు చిఱునవ్వుతో తన ప్రతిభను మరొకమారు చూపి అందరినీ ఆనందపర్చాడు. బహుమతుల అలవాట్లు ఎప్పుడూలేని వీరభద్రుడు ఇది చూసి బహుమతి గైకొనగానే "ఇప్పుడు నా ప్రతిభను కూడా చూపెట్టాలా?" అనడిగాడు అమాయకంగా అలా అనగానే అందరూ ఒక్కసారి తెల్లమొహం వేసి, నిశ్చేష్టులై అలాగే చూస్తుండి పొయ్యారు.

మరుసటిరోజు తనని కలిసిన మంత్రిని చూసి క రాజు "చూశారా మంత్రీ! ఇదే ఈ నాటి కళాధర్మం. ఒక పనిని ఎంత నాసిగా చేసినా సరే దాన్ని వందసార్లు చేస్తే దానికొక నాణ్యత వస్తుంది. నైపుణ్యం లేనప్పుడు ఒకే నృత్యకారుడు నాట్యం చేస్తూంటే ఎవ్వరూ చూడరు. కాని అలాంటివారు వందమంది చేరి నాట్యం చేస్తూంటే దాన్ని ప్రజలు ఎంతగానో మెచ్చుకుంటారు" అన్నాడు.

మనస్సులో వందకు వందనాల ర్పించుకుంటూ ఇంటికి బయల్దేరాడు మంత్రి. ■




**రం**గారావు గారిని రికార్డుల రంగారావు గారని కూడా అంటారు. ఆయన వద్ద 78 ఆర్‌పియమ్ గ్రాంఫోన్ రికార్డులు అన్ని భాషలవీ కలిపి 42 వేలున్నాయి. అన్ని భాషలూ అంటే ముప్ఫై దేశీయభాషలు, అంతర్జాతీయ భాషలు ఓ పదిహేను అన్నమాట! వీటిని వేసుకోవడం వలన, వినడం వలన ఆయనకు సంగీతం గురించి చాలా విషయాలు, తెలిసాయి. వాటిలో కొన్ని అరుదైన సమాచారాలు, పరిశీలనలు, అభిప్రాయాలు 'ఆలాపన' శీర్షిక ద్వారా ఆయన పాఠకులతో పంచుకున్నారు. మచ్చుకి కొన్ని -

W మలయాళ సంగీతదర్శకుడు దేవరాజన్-గేయకర్త వయలార్ రామవర్మ-గాయకుడు జేసుదాస్ కలయిక త్రివేణీ సంగమం లాంటిది. నేనీమాట తెలుగు, తమిళ, కన్నడ, హిందీ, బెంగాలీ, మరాఠీ, పంజాబీ చిత్రాల సంగీతం (ఆనాటిది) పరిశీలించే చెబుతున్నాను.

W 'సంతోషం'(1955)ను హిందీ రీమేక్ 'నయా ఆద్మీ'కు పనిచేస్తూ మదన్‌మోహన్ 'యమునా వాటికి' పాట విని 'ఆ వరస ఏ మాత్రం మార్చవద్దు, తెలుగులో అంతబాగా పాడినతన్ని హిందీలోనూ పాడించకూడదూ' అన్నాడు. ఆ గాయకుడు దరిమిలా సంగీతదర్శకుడిగా ఖ్యాతి గాంచిన జి.కె.వెంకటేష్! ఉచ్చారణా దోషాలుంటాయమోనని చివరకు పాడించలేదనుకోండి.

W ఆశా కంఠానికి విశిష్టమైన వ్యక్తిత్వం మొదటిమారుగా ఇచ్చినది ఎస్.డి.బర్మన్ (1953 నాటి 'అర్మాన్' లో 'చాహే జీత్‌నా') అప్పటిదాకా పౌరాణికాలలో, పేరు తెలియని సాంఘికాలలో పాడిన ఆశాకు కేబరే మార్కు పాటలుపాడే విధానం మప్పినది 'హౌస్ నెం.44'లోని 'దమ్ హై బాకీ' పాటద్వారా బర్మనే! ఒ.పి.నయ్యర్ ఆమెకు మంచిపాటలిచ్చినది వారిద్దరికీ వ్యక్తిగతానుబంధం ఏర్పడిన తరువాతనే!

W 1936 ప్రాంతాలలోనే జనాదరణ పొందిన హిందీ సినిమా పాటల మెట్లు అనుకరించడం మొదలుపెట్టింది తెలుగు సినిమా. ఒకో సినిమాలోనూ యిలాంటివి రెండు మూడింటికి మించి ఉండేవి కావు. ఈ అనుకరణను పెద్దగా పట్టించుకొనే వారు కాదా రోజుల్లో. 1950 తరువాత యిలాంటి సంగీతాన్ని కాపీ సంగీతం అని నిరసించడం ప్రారంభమయ్యింది.

W రావుబాలసరస్వతి పాట వింటూంటే ఒక వ్యక్తావ్యక్తమైన మాధుర్యం మనసులో - వేణునాదానికి వ్రజవనితలలో పెల్లుబికినట్లు - ఉబికేది. రమేశ్‌నాయుడు వరసల్లో గొప్పతనం ఒకటే. ఒక కంఠంలో స్వతస్సిద్ధంగా ఉండే కలిమినే కాదు లేమినీ పెనుబలిమిగా మార్చేలాగా ఆ పోకడలు పేనడం. అందువలన ఆయన పాటవరసలలో బాలసరస్వతి కంఠపు మాధుర్యం యినుమడించింది.

W బాలసరస్వతి ఒక జమీందారుని 1945లో పెళ్లి చేసుకుని నటనకు స్వస్తి పలకలేదు. 'రాధిక' (1947), 'సువర్ణమాల', 'బిల్హణ' (1948-తమిళం) ఆ తరువాత వచ్చినవే.

W పాత దేవదాసు లోని 'కలయిదనీ' 'అంతా భ్రాంతియేనా' పాటలను కలబోయగా కొత్త దేవదాసులోని 'కల చెదిరింది' రూపొందించింది.

W పాత సినిమా వరసల్లో 'జ'గణం (తనాన) తరచుగా ఉండటానికి కారణం అప్పటి తెలుగు సినిమా సంగీతానికి హిందీ సినిమా హిట్లు ప్రేరకాలు కావడం. వరసల్లో 'జ'గణం దొర్లినప్పుడు తెలుగుభాషలో అంత సులభంగా ఒదగని 'జగాన, బిరాన, (కని) కరాన' లాంటి పదా లుపయోగించేవారు. ఇప్పుడవి వింతగా ధ్వనిస్తాయి.

W దేవులపల్లి లాగా భక్తిలో ఆర్తిని కలిపి వ్రాయగల వారెవ్వరూ లేరు. మల్లాది రామకృష్ణశాస్త్రి వ్రాస్తే చిన్ననాటి సఖునితో మేలమాడుతున్నట్లుంటుంది. ఆరుద్ర వ్రాస్తే ఎందరో కాచి వడబోసిన సత్యం అంటుకొనేలా ముట్టుకొనేలా తెలిసినట్లుంటుంది. నారాయణరెడ్డి వ్రాస్తే కావ్యగుణంతో పరిమళిస్తుంది. పింగళి వ్రాస్తే ప్రార్ధనా గీతాలిలా ఉంటే కాదనేవాడు దేవుడెలా అవుతాడనిపిస్తుంది. ముఖే ముఖే సరస్వతి!

W ఆధునిక తెలుగు సంగీతసాహిత్యాలకు బాలాంత్రపు రజనీకాంతరావు సేవ గురించి పునరుక్తి, అతిశయోక్తి లేకుండా పదిపుటలు వ్రాయవచ్చు.

W 'శ్రీ వెంకటేశ్వర మహాత్మ్యం'(1960) సినిమాలో పాటలను శాంతకుమారి ఎలా పాడాలో అలాగే పాడారు. వకుళ వేషం ముసలిది కదా అని వణుకు పెట్టలేదు. యశోద పాట కదా అని ప్రేమ యిటూ అటూ కార్పించలేదు. 'నందగోపాలా'లో వయసుకు తగ్గ ధృతి వుంది. 'చిరుచిరు నగవు'ల్లో అదుపులో వున్న యశోద అతిశయం వుంది.

W 'మరదలుపెళ్లి'(1951)లోని 'పిలిచే గోదావరొడ్డు' పాట తెలుగుసినిమాల్లో కనీ వినిపించిన మొదటి 'రాకెన్ రోల్' (అప్పటికింకా యీ ప్రయోగం అమెరికాలోనే రాలేదు) మాదిరి సంగీతం, మొదటి కేబరే పద్ధతిని సాగిన నాట్యం.





W 'చండీరాణి' (1953) హిందీలో విద్యావతి ధరించిన వాంప్ పాత్రకు ప్లేబాక్ పాడింది భానుమతి! 'రత్నమాల' (1947)లో అంపకాల పాటలో సి.యస్.ఆర్., కె.జమునారాణిలతో కలిసిపాడింది. తెరపై భానుమతి పెదవి కదపదు. కాబట్టి ఇది ప్లేబాక్ పాటే! నాకు తెలిసి ఆ హిందీపాట, యీ తెలుగుదీ రెండే ఆమె పాడిన ప్లేబాక్ పాటలు.

W భానుమతి నటించి, పాడిన దేసింగురాజు కథ (1960) తమిళం నుంచి తెలుగుకు డబ్ అయింది. ఇందులో 'సరసరాణి కల్యాణి' తెలుగువెర్షన్ రికార్డులో ఘంటసాల కంఠం ఒక్కటే ఉంటుంది. భానుమతి కంఠం ఉండవలసిన చోట వెనుక వినబడవలసిన వాద్యానుసరణే ఉంటుంది.

అయితే ఈ సమాచారం ఇంత తేలిగ్గా శీర్షికలో గానీ, ఈ పుస్తకంలోగాని లభించదు. దీనికి ముందు, వెనుకా చాలా విషయాలుంటాయి. పాఠకులకు సంధించిన ప్రశ్నలు, వారి సందేహాలు, వాటి నివృత్తి, వ్యాసం మొదట్లో సందర్భం ఉండీ ఉండని ఫోటోలు (స్పష్టంగా కనబడటలేదెందుకో!), చిత్రోచిత వ్యాఖ్యలు (కొండొకచో విడ్డూరంగా)- ఇలా చాలా సరంజామా ఉంటుంది. శీర్షికవరకూ ఆ పద్ధతి ఫర్వాలేదు కానీ, పుస్తకం రూపంలో తెచ్చినప్పుడు కూడా యథాతథంగా (రంగారావు గారి పొరబాట్లు, తదుపరి వారాలలో వాటిని పాఠకులు సవరించడంతో సహా) ఉంచడం చాలా ఇబ్బంది వచ్చిపడింది. ఉదాహరణకి బాలసరస్వతిగురించి ఈయన రాసినదేమిటాని చూడబోతే పుస్తకం అంతా తిరగేయాల్సిందే! ఇంగ్లీషు పుస్తకాలలోలా చివర్న రిఫరెన్సు ఇండెక్సు పెట్టడం కూడా చాలా కష్టమైన పనే! ఎందుకంటే ఒకదానికి మరొకటి పొంతన కుదరని విషయాలు ప్రతి వ్యాసం (వీటిని ఆ పేరుతోనే పిలిచారు మరి!)లోనూ కనబడతాయి.

రంగారావు భాష ఒక్కోప్పుడు చాలా వింతగా సాగుతుంది. ఉన్నట్టుండి దినపత్రికల పాఠకులకు పరిచయం లేని పదాలు వాడడం ఆయనకో సరదా! హవణింపు, పోహళింపు, అజ చూడటం, తమ్మిసిరి, మొమ్మొదటి తరగతి,..ఇలా ఎన్నో పదాలు వేగంగా చదవడానికి అడ్డుపడుతూ ఉంటాయి. చదివి జ్ఞానాన్ని పెంచుకోవచ్చు కానీ రిఫరెన్సు పుస్తకంగా వాడుకోవడానికి కష్టమైన పుస్తకం 'ఆలాపన'!

(సశేషం)

**- ఎమ్బీయస్ ప్రసాద్**

తెలుగు సినిమా నేపథ్య గాయనీమణుల జీవిత చిత్రాలు తెలిపే

# కొమ్మా కొమ్మా కోకిలమ్మా 5



- ఇంద్రగంటి జానకీబాల

ఆమె గురించి ఎవరనడిగినా "పేరుకు తగ్గవారమ్మా! మహాతల్లి, సాదుస్వభావం, చక్కని చిరునవ్వు, వీణ మీటినట్లుండే మాట. సాటివారి నెంతో గౌరవించే శాంత స్వభావం" అంటారు.

1936లో దర్శకులు పి.వి.దాస్ 'మాయాబజార్' చిత్రం నిర్మించాలని ప్రయత్నాలు మొదలు పెట్టారు. అందులో శశిరేఖ పాత్ర కోసం గాలింపు మొదలైంది.

సినిమాలన్నా వ్యామోహం బాగా వున్నా, అందులో నటించేవారన్నా, పాటలు పాడేవారన్నా సమాజంలో చిన్నచూపు వుండేది.

అలాంటి సమయంలో అన్నివిధాలా తగిన అమ్మాయి శాంతకుమారి దొరికింది. ఆమె అసలు పేరు వెల్లాల సుబ్బమ్మ. సినిమా కోసమే ఆమెకు ఈ అందమైన పేరు ఏరారు. పూలదాస శ్రీనివాసరావు, పెద్ద నర్సమ్మ దంపతులకు ముద్దుల కూతురు మన అందాల శాంతకుమారి.

1920 సంవత్సరంలో మే పదహేడవ తారీఖున పుట్టిన ఆమె సరిగ్గా తన పదహారో ఏట 'మాయాబజార్' సినిమా ద్వారా సినిమా పరిశ్రమ లోకి గాయక నటిగా అడుగుపెట్టారు.

అప్పటికే సంగీతంలో చక్కని శిక్షణ పొంది, ప్రొఫెసర్ సాంబమూర్తి గారి అభిమాన కుమార్తెగా నుంచి ఇంగ్లీషు త్వరగా నేర్చుకొని పరీక్ష పాసయ్యారు. కానీ మినమినలాడే అందచందాలతో అత్యంత మధురమైన కంఠంతో, సంగీత జ్ఞానంతో వున్న శాంతకుమారి ఆనాడు కొత్తగా విస్తరిస్తున్న సినిమా పరిశ్రమకు ఆలవాలమయ్యారు.

పొద్దుటూరు సమీపంలో వున్న వెల్లాల అనే కుగ్రామంలో పుట్టి కడపలో చదువుకొని మద్రాసు సినీపరిశ్రమలో తేలారు శాంతకుమారి.

అప్పట్లో ప్లేబ్యాక్ సౌకర్యం ఇంకా రాలేదు. అంటే పాటలుగానీ, మాటలు గానీ రికార్డు చేసి, ఫిల్మ్ మీదకి ఎక్కించే వసతి లేదు. నటిస్తూ

## నిజమైన శాంత స్వరూపిణి

# పి. శాంతకుమారి



అప్పట్లో ఒక ఆర్టిస్టును ఎంపిక చేసుకోవాలంటే ఎన్నో చూసుకోవాల్సి వచ్చేది. ఆమె అందంగా వుండాలి. పాట పాడగలిగి వుండాలి. వాచకం బాగా వుండాలి. వీటన్నిటితో బాటు బాగా నటించగలిగి వుండాలి. ఇన్ని గుణాలు గల అమ్మాయిలు దొరకడం బహుకష్టంగా వుండేది. సామాన్య కుటుంబాల నుంచి ఆడపిల్లలు రావడానికి, నటించటానికి తల్లిదండ్రులు ఒప్పుకునేవారు కారు. అప్పట్లో నాటకాలన్నా, ఆయన ప్రేమాభిమానాలు పొందారు. ఆయన ట్రూపుతో అప్పటికే శాస్త్రీయ సంగీత కచ్చేరీలు చేస్తూ, అందరికన్నా ఆమెయే మిన్న అనిపించుకున్నారు. డి.కె. పట్టమ్మాళ్ ఈమె సహాధ్యాయని. శాంతకుమారి సంగీతం టీచరవుదామనుకున్నారు. అందుకోనవే హయ్యర్‌గ్రేడ్ చేద్దామంటే, థర్డు ఫారం ప్యాసవ్వాలని అన్నారు. దానికోనం ఆమె థర్డుఫారం చదివారు. దానికోసమే సెకండ్ ఫారమ్‌లో వుండే ఏబిసిడీలు

వరాటాడిన మాటలు, పాడినపాటలు నేరుగా ఫిల్మ్‌లోకి వచ్చేస్తాయి. సంభాషణల వరకు అది సాధ్యమైనా పాటల దగ్గర కొచ్చేసరికి ఎంతో హంగామా చేయాల్సి వచ్చేదట. ఫిల్మ్‌డెవలప్ చేసుకుని చూసేవరకు ఏమొచ్చిందో, ఎలా వచ్చిందో తెలీదు. అందుచేత పాటగానీ, నటన గానీ, సంభాషణలుగానీ క్షుణ్ణంగా వచ్చి వుండాలి.

సన్నివేశం బాగా తెలిసి వుండాలి. తడబడటం గానీ, మర్చిపోవటంగానీ కుదరదు. అందుని చాలాసార్లు రిహార్సలు చేసేవారు. అందరికీ బాగా వచ్చాక 'టేక్'చేసేందుకు వెళ్ళేవారు.

ఆమె నవ్వుతూ ఓ సంఘటన చెప్పారు.

"ఓ సారేం జరిగిందంటే-నేను తోటలో పరుగెడుతూ-నాట్యం చేస్తూ పాటపాడే సన్నివేశం చేస్తున్నాం. బాగా రిహార్సలు అయినాక ఏదమ్మా శాంతమ్మ చెయ్ అన్నారు. నేను మొదలుపెట్టి చక్కగా అభినయం చేస్తూ పాట పాడుతున్నా, కొంతసేపయ్యాక వీళ్ళు మైకులు ఎక్కడా పెట్టలేదు కదా, ఈ పాడిందంతా ఎక్కడ రికార్డవుతుందీ అని నాకనుమానం వచ్చింది. వెంటనే ఆగిపోయి "ఎక్కడా? టేక్ అన్నారు మైకులేవీ"అని అన్నాను. ఒక్కసారి అంతా ఉసూరుమని తలలు పట్టుకున్నారు. డైరెక్టరు గారొచ్చి "అవన్నీ నీకెందుకమ్మా! చక్కగా పాడుతున్నావు. బాగా వస్తోందనుకుంటే మధ్యలో ఆపేశావు" అంటూ కోప్పడ్డారు. అప్పుడు చూశాను. పూల తీగెను చుట్టేసి మైకు కనబడకుండా అమర్చారని.

నేనెంతో చిన్నబోయాను. బాధకలిగింది. మళ్ళీ"నీకెందుకమ్మా అవన్నీ వేం చూసుకుంటాం. నువ్వు నీ పాట నీ నటన, డైలాగులు చూసుకో" అన్నారు నన్ను లాలనగా చూస్తూ.

"నా మొదటి సినిమా సంగీత దర్శకులు (మాయాబజార్) గాలి పెంచల నరసింహా రావు-ఆయన్ని పెంచలయ్యగారనే అంతా అనేవారు. ఆయనంటే నాకెంతో గౌరవం, యిష్టం, ఆయన శాస్త్రీయ సంగీతం బాగా తెలిసిన వారు. ఒక్క పొల్లు పోనిచ్చేవారు కాదు. ఆనాడు వరిశ్రమలో అందరూ కలిసి మెలిసి ప్రేమాభిమానాలతో, అక్కయ్య, అమ్మా, అమ్మమ్మ, బావగారు, చెల్లెమ్మ అంటూ ఒకే కుటుంబం మాదిరి వుండేవారు. 'రామ్మా- రాతల్లీ- ఇలా పాడరా నాన్నా' అంటూ ఎంతో బాగా మసలేవారు. అందుకే ఈ రోజుకీ ఆ మాటలు గుర్తుకొస్తే ఎంతో ఆనందంగా వుంటుంది. నేను సినిమాలు చేస్తున్నప్పుడు కూడా బయట శాస్త్రీయ సంగీత కచ్చేరీల కెళ్తూండేదాన్ని,'చంద్రికా వైభవం బగురా' అనేది నా మొదటి పాట" అంటూ శాంతకుమారి తన జ్ఞాపకాలను ఆనందంగా నెమరు వేసుకుంటూ చెప్తారు.

"సన్నటి గొంతు, వెండితీగలా సాగే గొంతు, వినుకట్టు కట్టి వినువరిని మంత్రముగ్ధని చేసే గొంతు"అంటారు వి.ఏ.కె. రంగారావు (మోహిని-రెండవ భాగం, ఆంధ్రప్రభ ప్రచురణ). 'మాయాబజార్', 'సారంగధర' లాంటి సినిమాలు,ఆ పాటలు యిప్పుడు లభ్యం కావటం లేదు. 'రుక్మిణీ హరణ్'లో పాటలు మరీ అంత గొప్పవేం కావు" అని రంగారావు అంటారు. అయితే 'కృష్ణప్రేమ'లో రెండుపాటలు 'ఇదే ఆనందము' 'ఊదుము కృష్ణా' బాగుంటాయి. కానీ ఇక్కడొక చిక్కు వచ్చిపడింది. సినిమా పరిశ్రమ ఊపిరిపోసుకుని, సినిమా, సంగీతం, నాటక సంగీతంనుండి కాస్త వేరుపడి తనదంటూ ఒక స్వరూపం ఏర్పరచుకొని రూపురేఖలు సంతరించుకునే నాటికి, శాంతకుమారి ప్రౌఢ పాత్రలు వేస్తూండటం, ఆ పాత్రలకి ఎక్కువగా పాటలు లేకపోవడం వల్ల, ఆమె గళ మాధుర్యాన్ని ఆంధ్రులకు మరిన్ని పాటల్లో పదిలపరచే వీలు లేకపోయింది. సినిమా పాటలు వినడం వాటిలోని గొప్పతనం గ్రహించటం చేసే అనేకమంది శ్రోతలకు ఆమె పాటలు అందలేదు. ఆమె 'శ్రీ వేంకటేశ్వర మహత్యం' చిత్రంలో 'ఎన్నాళ్ళని నే కన్నులు కాయగ' అనే వకుళాదేవి పాట ఎంతో ఆదరణ పొందింది. అప్పటికీ ఆమె కంఠం వెన్నెట్లో మెరిసే చిగురాకుల కొసల్లాంటి సౌందర్యమున్న కంఠమే. అటువంటిదే యశోదగా పాడిన 'చిరుచిరు నవ్వుల'.

నాగేశ్వరరావు కథానాయకుడుగా 'మాయలోకం' (1954)లో వేసినప్పుడే శాంతకుమారి ఆయన పక్కన నాయిక వేషంలో ఆయనకి అక్కగారిలా వుందని పెద్దలు ఇప్పటికీ అంటారు. ఆమె ఆ షూటింగ్ విశేషాలు మహా చమత్కారంగా చెప్తారు. నాగేశ్వరరావు బయట ఆమెను అక్కయ్యా అని పిలిచేవారట. పాపం! అలాంటి భావనగల ఆయన ఒక్కసారిగా కొంగులాగి శృంగార చేష్టలు చేసేందుకు ఎంతో బిడియపడ్డారట. అప్పుడామె ధైర్యంగా.

"మరేం ఫరవాలే తమ్ముడూ! ఇదిగో- ఇది నటనేనయ్యా! ఇదిగో ఇలా చెయ్యి పట్టుకుని -నడు-నేనిలా నటిస్తాను"అంటూ ధైర్యం చెప్పార్ట.

ఆ రోజుల్లో, ఆ తరంలో, సినిమాల్లో నటించటం అంటే పాటతో సహా అని అర్థం. అయితే బాగా పాడగలడం, పాడలేకపోవటం అనే తేడాలు వుండేవి. భానుమతి, ఎస్వరలక్ష్మి, శాంతకుమారి లాంటి కొందరు ప్రతిభావంతంగా పాడుతూ నటించగల నటీమణులుగా నిలద్రొక్కుకున్నారు. అంతకంటే ముందు తరంలో కన్నాంబ బాగా పాడినా ఆమె నాటక ఫక్కీలో పాడటమే. అదీ శాస్త్రీయ సంగీతం ఆధారంగా గంభీరంగా పాడటమే.అంతేగానీ ఈ సినిమా పాటకుండే లలిత సంగీత పోకడలు, భావ ప్రకటనలు లేకపోవడం వల్ల ఆమె శక్తి సామర్థ్యాలు కొంతవరకే వెలికి వచ్చాయి.

జి.వరలక్ష్మి చక్కగా పాడితే, మాలతి ఓ మాదిరిగా పాడగలిగేవారు. పుష్పవల్లి అపశ్రుతులే పాడేవారంటారానాటి సహనటి భానుమతి.

ఆనాటి సంగీత దర్శకులు గాయనులు కంఠం స్వభావం తెలుసుకుని, దాని ననుసరించి బాణీకూర్చి ఆమె చక్కగా పాడగలిగేలా శ్రుతి నిర్ణయించి, కంఠంలో పలికే కళలే అందులో పెట్టి, మొత్తానికి పాట బాగుందనిపించేవారు. అందువల్ల గాయని ప్రతిభే కనిపించేది గాని లోట్లు బయటపడేవి కావు. నిజానికి ఈనాటికీ సంగీత దర్శకులు అవలంబించవలసిన విధానం ఇదేనని ఖచ్చితంగా చెప్పవచ్చు.

1949లో 'గుణసుందరికథ'లో శాంతకుమారి, మాలతి కలిసి 'కలకలా ఆ కోకిలలేవో పలుకరించే వింటివా', 'చక్కనని దొరవలే చందమామా' అనే పాటలు పాడారు. ఈ సినిమాకి ఓగిరాల రామచంద్రరావు సంగీతం సమకూర్చారు. ఈ రెండు పాటలూ ఎంతో ప్రజాదరణ పొందాయి. అయితే పాడటంలో, గొంతులలో, ప్రతిభలో శాంతకుమారికీ మాలతీకి ఎంత తేడా వుందో గమనిస్తే అర్థమవుతుంది. శాంతకుమారికి పాడటంలో వున్న ప్రతిభ మాలతికి లేదు. ఇది దృష్టిలో పెట్టుకొనే ఆవిడ చేశారు.

పి. పుల్లయ్య ఆమె భర్త కావడం వల్ల ఆమె సినిమాల్లో తన ప్రతిభను సంపూర్ణంగా చాటుకోగలిగారు. అసలే శాంత స్వభావం గల శాంతకుమారి నిజజీవితంలోనూ, పచ్చని సంసారాన్నీ, శాంతి నిలయమైన ఇంటిని కూర్చుకోగలిగారు. ఇందుకు ఆమె భర్త పుల్లయ్య ఆమెయందు ప్రేమాభిమానాలతో వ్యవహరించారని ఆమె చెప్తారు.

సొంతంగా 'రాగిణి పిక్చర్స్' స్థాపించి ఎన్నో సినిమాలు తెలుగులో, తమిళంలో నిర్మించారు. అయితే అందులో ఎక్కువగా,ఆమె సంగీత పరిజ్ఞానాన్ని ప్రదర్శించే వీలు చిక్కలేదు.

'సారంగధర'లో (1937) దుష్టపాత్ర ఎవరికీ ఎక్కువగా తెలీదు గానీ 'అర్ధాంగి' (1955) లో ఆమె దుష్ట పాత్రను బాగా పోషించారని చెప్పాలి.

ఆమె 'అర్ధాంగి'లో నటించే నాటికి సావిత్రి ఇంకా పైకి వస్తున్న రోజులు. ఆ సినిమా నిర్మాణం సమయంలో సావిత్రికి శాంతకుమారి తన నగలు అలంకరించిన సందర్భం ఆమె చెప్తారు. అందులో సావిత్రి వివాహమయ్యాక ఆమెకు అత్తగారి నగలు యిచ్చి పెట్టుకోమంటారు. అప్పుడామె పెట్టుకున్న నగలన్నీ గిల్టు నగలు కావు. అవి శాంతకుమారి బంగారు నగలు. అవన్నీ పెట్టుకుని షూటింగ్‌కి సిద్ధమతుండగా"అక్కా! నేనెప్పుడైనా ఇలా, ఇన్ని నగలు సంపాదించుకుని, చేయించుకోగలనా" అని సావిత్రి అన్నదిట. అప్పుడు శాంతకుమారి "తప్పకుండా, ఇంతకు మించి సంపద, నగలు నువ్వుపొందగలవు. నువ్వు అదృష్టవంతురాలివి" అని ఆమెను అప్యాయంగా దీవించార్ట.

శాంతకుమారి నోటిమాట నిజమై సావిత్రి కోటీశ్వరురాలైంది. కానీ జీవితంలో శాంతి సౌఖ్యాలు పొందిందా అనేది వేరే ప్రశ్న.

శాంతకుమారికి సంగీతమంటే ప్రాణం. ఎవరికైనా సంగీతం నేర్పడమంటే మరీ యిష్టం. అయిదారేళ్ల క్రిందటవరకు పక్కవీధిలో గృహిణి లీలాకుమారికి భక్తిగీతాలు నేర్పేవారు. ఆమె సంసారాన్ని చూసుకున్నతీరు చెప్తూంటే, ఆమె గురించి మిత్రులు చెప్తుంటే ఆశ్చర్యమేస్తుంది. ఉదయం పదిగంటలకి షూటింగ్‌కి వెళ్ళాలంటే తెల్లవారకుండా లేచి, ఇంట్లో వంటా అదీ చేసి పిల్లలకి అన్నీ టేబుల్ మీద అమర్చి వెళ్ళేవారుట.

''సాధారణంగా సినిమా పరిశ్రమలో అనుకునేట్టు మా అమ్మగారు మమ్మల్నెప్పుడూ నిర్లక్ష్యం చెయ్యలేదు" అంటారామె కూతురు రాధ. సి.ఆర్.సుబ్బురామన్ సంగీతం నిర్వహించిన 'ధర్మతేజ' సినిమాలో ఆమె పాడిన 'మీ వంటిందే నండి' పాట ఒక జోలపాట. అది ఎంతో గొప్ప ట్యూన్, పాడటం కూడా కష్టమే. కానీ ఆ జోలపాట శాంతకుమారి ఎంత బాగా పాడారో చెప్పనలవికాదు విని ఆనందించాల్సిందే. ఆ అనుభూతిని పొందవలసిందే!

తర్వాతి తరం వారు శాంతకుమారి పాటను విని ఆనందించినది శ్రీ వేంకటేశ్వర మహత్యం (1960)లో 'ఎన్నాళ్ళని నా కన్నులు కాయగ-ఎదురు చూతురా గోపాలా' ఈ సినిమాకి సంగీతం పెండ్యాల నాగేశ్వరరావు. ఆయనెంతో ఆర్తితో కట్టిన ఈ పాట అమృతతుల్యంగా శాంత కుమారి పాడారు. తర్వాతామె కథానాయకులు అక్కినేని, ఎన్.టి.ఆర్. మొదలైనవారికి తల్లిగా, వదినగా, అక్కగా ఎన్నో పాత్రలు పోషించారు. అవన్నీ పాత్రల దృష్ట్యా మంచివే అయినా, పాట పాడవలసిన అవకాశం వుండే పాత్రలు కావు.

తల్లా-పెళ్ళామా, చిన్ననాటి స్నేహితులు, రాముడు-భీముడు,జయభేరి, షావుకారు, గుడిగంటలు, సిరిసంపదలు, ప్రాణమిత్రులు లాంటి ఎన్నోసినిమాలామె చక్కని నటనకు నిదర్శనాలు.

ఒకసారి మంగళంపల్లి బాలమురళీకృష్ణ ఆమెను చూడటానికి వెళ్ళార్ట. ఆమె "తమ్ముడూ! నేను రాముడి మీద భక్తి పాటలు నాలుగు కంపోజ్ చేశాను. నువ్వు పాడి రికార్డు చేస్తావా" అని అడిగార్ట.

ఆయన 'పాడండి వింటాను' అన్నార్ట.

ఆ పాటలామె పాడి వినిపించాక, ఆయనెంతో ఆనందపడి, ఆవిడను అభినందించి ఆ పాటలు పాడి ఒక క్యాసెట్ చేశార్ట.

సంగీతం యింత తెలుసుకదా, మీకు పాట కంపోజ్ చేయడం మీద ఇష్టం వుందా అని అడిగినప్పుడు పై మాటలు చెప్పారు శాంతకుమారి

ఆమె తెలుగు, తమిళ చిత్రాలలో మాత్రమే నటించారు. తమిళంలో శివాజీ గణేశన్, జెమినీ గణేశన్ సరసన ఎన్నో సినిమాలు చేశారు. 'భగవాన్ బాలాజీ' అని వెంకటేశ్వర మహత్యంను డబ్బింగ్ సినిమాగా రూపొందించినప్పుడు,హిందీ పాటలు ఆమే పాడారు.

"తోడి, శంకరాభరణం, భాగేశ్వరి రాగాలంటే నాకు చాలా యిష్టం. అవి నేను బాగాపాడతానని, కచ్చేరీలకు వెళ్ళినప్పుడు వాళ్ళే అడిగి పాడించుకునేవారు" అంటారామె శాస్త్రీయ సంగీతం పట్ల ఆమెకున్న ప్రేమను చాటిచెప్తు.

"ఇన్నాళ్ళు కాపురం చేసి, ఇప్పుడాయన పోయాక నేనెలా వుండగలనమ్మా, ఆయన లేకుండా వుంటానని నేననుకోలేదు" అంటారామె భర్త పి.పుల్లయ్య గార్ని తల్చుకుని.

"నాకు ఆరోగ్యం బాగాలేదు. షుగరుంది. బి.పి. సరేసరి, ఎక్కడికీ పోలేను. నాకు దేవుడు భక్తి ఎక్కువ. కానీ.... ఇప్పుడు ఒక గుడి లేదు. పూజ లేదు- నడవలేను. మేడ మెట్లు ఎక్కలేను, దిగలేను '' అంటారు ఎనభై మూడేళ్ళ శాంతకుమారి.

"ఎన్ని సినిమాలు చేశానో గుర్తే లేదు. ఈమధ్య బాగా మరుపు వచ్చేసింది. ఏదో గుర్తుకొచ్చింది చెప్పంటే - ఏమిటో అబద్ధాలు చెప్తున్నావమ్మా అంటూ మా పిల్లలు నవ్వుతూ వుంటారు.

"కాలం నడిపించే బొమ్మలం. దాన్ని మాత్రం కాదనలేం" అంటారు తత్త్వ చింతనతో...

---

**చిత్రం : ప్రాణమిత్రులు**

రచన: ఆత్రేయ సంగీతం : కె.వి. మహాదేవన్

వయసు పెరిగినా మనిషి ఎదిగినా
మనసు ముదరనంతవరకు
మాసిపోదు పసితనం మాసిపోదు పసితనం
చిన్ననాడు జోలపాడి ముద్దు తీర్చలేదని
ఇన్నేళ్ళూ నా కోసం ఉన్నావా పాపడుగా
ఆశగా మనుమడికై దాచుకున్న పాటను
అమ్మగా పాడుతాను నానమ్మను చేయరా
నన్ను నానమ్మను చేయరా ॥వయ॥
కన్నవాడు ఒక్కడూ కన్నువంటి వాడొకడూ
కలిమికన్న మీ చెలిమే కరగిపోని కలిమిరా
మనసునింత మంచిగా మలినమేమి సోకకా
నిలుపుకోగలవు నీవు నిజముగా దేవుడవు! ॥వయ॥

---

# హాసం క్లబ్ కార్యక్రమాలకు ఆహ్వానం...




ఈ ఉగాది నుండి వివిధ ప్రాంతాలలో ఏర్పాటైన 'హాసం క్లబ్'ల మే నెల కార్యక్రమ వివరాలివిగో! ఈ కార్యక్రమాలలో పాల్గొనటానికి మీరు 'హాసం' పాఠకులు కానవసరం లేదు. క్లబ్‌కు చందా కట్టనవసరం లేదు. హాస్య, సంగీత ప్రియులై ఉండి, సకుటుంబంగా రెండు గంటలపాటు ఆహ్లాదకర వాతావరణంలో కాలక్షేపం చేయటానికి రెడీగా ఉంటే చాలు. వచ్చి హాయిగా జోకులు, పాటలూ వినవచ్చు, మీరూ చెప్పవచ్చు/పాడవచ్చు. పాడలేకపోయినా పాటల గురించి మీ పరిశీలనలు పదిమందితో పంచుకోవచ్చు.

**తేదీ, సమయం : 16.05.04 మూడవ ఆదివారం సాయంత్రం గం॥ 6.35 నుండి 8.35 వరకు**

| ఊరు | స్థలం | వివరాలకు సంప్రదించవలసినవారు |
|---|---|---|
| రాజమండ్రి (0883) | 16-4-2, శ్రీరామనగర్, పేపర్‌మిల్లు వద్ద, రాజమండ్రి-5 | శ్రీ అప్పారావు, 2438085, 98852 15155<br>శ్రీ డి.వి.హనుమంతరావు, ☎ 2430945 |
| వైజాగ్ (0891) | విశాఖ జిల్లా కేంద్ర గ్రంథాలయం మహారాణిపేట, విశాఖపట్టణం-2 | శ్రీ టి.ఎల్.ప్రసాద్ ☎ 9885056449<br>శ్రీ మస్తాన్‌రెడ్డి ☎ 2720219/2713554 |
| ఏలూరు (08812) | శ్రీ డి.రామకృష్ణారావు గారి ఇల్లు డా॥ ప్రసాద్ కంటి ఆసుపత్రి వద్ద రామచంద్రరావు పేట, ఏలూరు | శ్రీ మోతే నారాయణరావు ☎ 221989<br>శ్రీ డి.రామకృష్ణారావు ☎ 222318 |

**తేదీ, సమయం : 29.05.04 ఆఖరి శనివారం సాయంత్రం గం॥ 6.35 నుండి 8.35 వరకు**

| ఊరు | స్థలం | వివరాలకు సంప్రదించవలసినవారు |
|---|---|---|
| హైదరాబాదు (040) | 'హాసం' ఆఫీసు, శ్రీ బాలాజీ నిలయం, రాజీవ్‌నగర్ బస్టాప్, ఎ.జి.కాలనీ దగ్గర్లో, హైదరాబాదు-18 | శ్రీ గిరి ☎ 55570215<br>శ్రీ ఎస్.వి.రామారావు<br>☎ 24160279/9849139030 |
| పలాస (08945) | శ్రీ డా॥ వై.రామినాయుడు నర్సింగ్‌హోమ్, వివేకానందకాలనీ, పలాస (శ్రీకాకుళం జిల్లా) | శ్రీ డా॥ వై.రామినాయుడు<br>☎ 241268, 9848651615 |

ఇతర ప్రాంతాలలో 'హాసం క్లబ్బు'లు ప్రారంభించ దలచినవారు సంప్రదించవలసిన చిరునామా -

శ్రీ ఎస్.వి.రామారావు, కన్వీనర్, హాసం క్లబ్స్,
జి3, ఉమా అపార్ట్‌మెంట్, లలితానగర్, దిల్‌సుఖ్‌నగర్,
హైదరాబాద్ -500 060 ఫోన్ - 040-2416 0279/98491 39030

# సరిగపదమని

కూర్పు : టి.నవీన్, హైదరాబాద్

**19**




**అడ్డం:-**

1. '............ కొండ సీతమ్మ వారి అండ' చిరంజీవి అభినయించిన గీతం (4)
3. '............ పిందె తడిసే కోకమాటు పిల్ల తడిసే' వేటగాడు చిత్రంలోని గీతం (4)
5. 'మంటలు రేపే .....రాజా ఈ తుంటరితనము నీకేలా' (2)
6. '...దివిలో విరిసిన పారిజాతమో' (1)
8. 'తమ్ముడూ అరె తమ్ముడూ ఈ ......మక తెగులే ప్రేమంటే' చిరంజీవి పాడిన పాట (2)
11. 'సరదా సరదా సిగరెట్టు ఇది ........ల్ తాగు బల్ సిగరెట్టు' (2)
12. '.......వరా ఓ కురువరా' నర్తనశాల చిత్రంలోని గీతం (2)
13. '....... ........ వెల్లువాయే కొండ కోనా తుళ్ళిపోయే' గ్యాంగ్ లీడర్ చిత్రంలోని గీతం (2)
16. 'కల్లాకపటం కాననివాడా .......పోకడ తెలియనివాడా ఏరువాకా సాగారోరన్నో చిన్నన్నా (2)
17. '........ చేశాడే ముద్దుగుమ్మ నిను ఆ బ్రహ్మ' స్టూడెంట్ నెం.1 పాడిన పాట (3)
19. '...... శ్వాసలో చేరితే గాలి గాంధర్వమౌతున్నదో' నేనున్నాను చిత్రం కోసం చిత్ర పాడిన గీతం (1)
21. 'అది ఒక........ అతనికె తగులే' (3)
25. '........నా కిష్టం నీ నవ్వంటే నా కిష్టం' (3)
26. 'వానా వానా వెన్నెల వానా' అంటూ చిరంజీవి అభినయించిన పాట ఈ చిత్రంలోనిదే... (ఈ చిత్రం పేరు శ్రీనివాస్ అనే ఓ గీత రచయితకి ఇంటి పేరై కూర్చుంది) (2)

**నిలువు:-**

1. '....... ........ ....... ...... దేవా బాగున్నదయా నీమాయ' (2)
2. '.......చంపుతున్న చెమక్‌లో చెలిచెంత కొచ్చింది' క్షణక్షణం చిత్రంలోని గీతం (2)
3 '...........వెలసిన ఆ దేవుని రీతి ఇల్లాలే ఈ జగతికి జీవనజ్యోతి' (4)
4. 'బంతి ........... ముద్దాడుకున్నాయిలే' అభిలాష చిత్రంలోని పాట (3)
7. '........ కింకిణులు ఘల్లుఘల్లుమన కర కంకణములు గలగలలాడగా' (3)
9. 'బంగారు ........బుచ్చెమ్మో' మురారి చిత్రంలోని గీతం (2)
10 'ఓ అందమైన బావా ఆవు పాల.....'(2)
14. '...... ఉన్న ప్రేమ నీతో చెప్పనా' వెంకటేష్ అభినయించిన గీతం (2)
15. '.......మీద కూడు ఉప్పుచాప తోడు' ఒకేఒక్కడు చిత్రంలోని గీతం (2)
17. '.......ని పాడెదనో ఈవేళ' భార్యాభర్తలు చిత్రంలోని పాట(2)
18. 'నా జన్మభూమి ఎంత అందమైన దేశము ........ అందులోన కమ్మని ప్రదేశము' (3)
20. 'నచ్చావే ........పోరి నువ్వేనా రాజాకుమారి' అద్నాన్‌శామీ పాడిన తెలుగు పాట(2)
22. 'నిను చూడక నేనుండ....' సినారే గీతం (2)
23. '.......రాని చిన్నదాని కళ్ళు పలికే ఊసులు' బాలు గుక్కతిప్పకోకుండ పాడిన పాట(2)
24. '...... ...... ఆంధ్రా...... గోలీ...... జిల్‌జిల్ ......' పద్మనాభం అభినయించిన గీతం (2)

పంపినవారి పేరు :........................................................

వయసు :........... వృత్తి :................................................

చిరునామా :..............................................................

...............................................................................

...............................................ఫోన్ :.................................

**పజిల్, కూపన్ 31-05-2004 లోగా చేరాలి**

**పంపవలసిన అడ్రసు**

'హాసం- హాస్య సంగీత పత్రిక'
502, శ్రీ బాలాజీ నిలయం, 13-1-212,
మోతీనగర్, హైదరాబాద్-500 018.

**నిబంధనలు:**

ఎ) పోటీలో పాల్గొనగోరేవారు పైన ప్రచురించిన కూపన్‌తో పజిల్‌ను నింపి కవరులో పంపాలి. మరే విధంగా పంపినా ఆ ఎంట్రీ స్వీకరించబడదు.

బి) కవరుపై 'సరిగపదమని' అంటూ నంబర్‌తోసహా పేర్కొనటం మరచిపోకూడదు.

సి) ఏ బహుమతి కైనా ఒకరు కన్నా ఎక్కువగా విజేతలుంటే డ్రా తీయటం జరుగుతుంది.

విజేతల ఎంపిక ప్రతిసారి ఓ సినీ ప్రముఖునిచే...



మొదటి బహుమతి (ఆల్ కరెక్ట్)




రెండవ బహుమతి (ఒక తప్పుతో)




మూడవ బహుమతి (రెండు తప్పులతో)




కన్సొలేషన్ బహుమతి (మూడు తప్పులతో)






"ఏమోయ్ రామనాథం మీ ఆవిడ వంటలకి ప్రభుత్వం వారు అవార్డిచ్చి సన్మానించారట కదా!"

"అవార్డా పాడా! నిన్నరాత్రి మా వీధిలో దొంగలు దాడి చేస్తే ఆ చీకట్లో రాయి అనుకొని మా ఆవిడ చేసిన సున్నుండ వాడి మీదకి విసిరా! దాంతో వాడు అక్కడికక్కడే తలపగిలి చచ్చాడు. అందుకిచ్చిన అవార్డు అది."




ఒక పల్లెటూరి ఆసామి నిండు చూలాలైన తన భార్యను ఆసుపత్రికి తీసుకొచ్చి ఇలా బ్రతిమాలుతున్నాడు.

"డాక్టర్ బాబూ! మా ఆవిడ సిజేరియను ఆపరేషనుకి అయ్యే ఖర్చు 20 వేలు ముందే ఇచ్చేస్తాగాని, డెలివరీ నార్మల్‌గా అయిపోనివ్వండి సారూ! మీకు పుణ్యం ఉంటాది."



"రాధా మనం మూడేళ్లనుంచి గాఢంగా ప్రేమించుకుంటున్నాం. మీ వాళ్ళు కట్నం ఇచ్చుకోలేరంటున్నావు. కట్నం లేకుండా మావాళ్ళు మన పెళ్ళికి ఒప్పుకోకపోతే ఏం చేస్తావు?"

"అయ్యో నా పిచ్చి రాముా! అందుకే కదా మూడేళ్లనుంచి నీకు తెలీకుండా గోపిని, గోపికి తెలియకుండా నిన్ను ప్రేమిస్తున్నాను -మీలో ఎవడో ఒకడు చేసుకోకపోతాడా అని"

**ఈ జోకులను పంపిన వారు: వై.చందు, కానుకుర్తి వారివీధి, శ్రీకాకుళం.**




"స్కూల్ దాటి కాలేజి కొచ్చినా మా నాన్న నా ఖర్చులకు పాకెట్ మని ఇవ్వడం లేదే" బాధగా అంది రాణి.

"ఏడ్చినట్టేవుంది, కాలేజి లెవల్‌కి వచ్చిన తర్వాత కూడా ఇంకా ఖర్చులకోసం తల్లిదండ్రులను కష్టపెట్టకూడదే... భగవంతుడు బాయ్‌ఫ్రెండ్స్‌ని సృష్టించింది ఎందుకు!?" నలహో



"మనసుని వీలైనంత ప్రశాంతంగా ఉంచుకోండి. ఎక్కువగా ఆలోచించకండి. ఎందుకైనా మంచిది. ఓ రెండు బి.పి. టాబ్లెట్లు వేస్కోండి" అంది భార్య.

"ఇవ్వడీ జాగ్రత్తలన్నీ ఎందుకు చెవుతున్నావే?" అడిగాడు భర్త అయోమయంగా.

"ఏమీ లేదు, నేను అలా షాపింగ్‌కి వెళ్తొస్తా"



"ఏంటి దిగులుగా ఉన్నావ్?" అడిగాడు వేణు మిత్రుడు శ్రీకాంత్‌ని.

"తన తదనంతరం తన యావదాస్తిని నా పేర విల్లు రాశాడు మా నాన్న" చెప్పాడు శ్రీకాంత్.

"వ్వావ్! మరయితే ఆనందంగా ఉండాలి కాని దిగులు దేనికి?"

"ఆయన గుండుపిక్కలా ఉంటాడు. మరో పాతిక ముప్పయి ఏళ్లయినా కనీసం జ్వరం కూడా వచ్చే ఛాన్సులేదు" అంటూ నిట్టూర్చాడు శ్రీకాంత్.

**ఈ జోకులను పంపించిన వారు: కె. జ్యోతి, మనోవికాస్‌నగర్, సికింద్రాబాద్.**

"దేశం మొత్తం మ్మీద మీకు వచ్చినన్ని మహిళా ఓట్లు ఎవరికీ రాలేదు ఇది వరల్డ్ రికార్డ్‌గా గిన్నిస్ బుక్ వారు కూడా ప్రకటించ బోతున్నారట దీని రహస్యం ఏమిటంటారు?" అంటూ అడిగాడు జర్నలిస్టులు.



"పెద్ద సీక్రెట్టేం లేదు ఓట్లు వేసేటప్పడు సీరియల్స్ మిస్ కాకుండా అన్ని పోలింగ్ కేంద్రాల్లోనూ జెయింట్‌సైజ్ స్క్రీన్ ఉన్న టీవీలు ఏర్పాటు చేశానంతే" అన్నాడా రాజకీయ నాయకుడు కులాసాగా నవ్వుకుంటూ.



"అవునూ బాబాయ్ గార్ని మెంటల్ ఆసుపత్రిలో జాయిన్ చేసారటకదా! ఇప్పడు ఎలా ఉంది పిన్నిగారూ..?" అని అడిగింది పక్కంటి సుశీల.

"కాస్త నయం తల్లీ మొదట్లో ప్రధానమంత్రిని అనే వారు ఇవ్వడు ముఖ్యమంత్రిని అంటున్నారు"అన్నారు పిన్నిగారు.

**ఈ జోకులను పంపించిన వారు రాయప్రోలు హనుమత్‌ప్రసాద్, ములగపూడి,**



"నాన్నగారూ.... నాన్నగారూ... తమ్ముడు కాగితాలతో బొమ్మలు చేసి ఆడుకుంటున్నాడు"

"వాడి చేతిలో మంచి ఆర్టుంది. నీలా తల్లి పోలికలు రాలా... అన్నీ నా పోలికలే " అన్నాడు తండ్రి పొంగిపోతూ .

"ఆ కాగితాలు మీరు ఆఫీసునుండి తెచ్చుకొన్న ఫైల్స్ లోవండీ...."






ఓ ఇంటర్వ్యూలో....
"మూడు ఆపిల్ పండ్లను ఓ ఐదుగురికి ఎలా సమానంగా పంచగలరు?"
"జ్యూస్ చేసి"
"మనదేశంలో పెట్రోల్ ఎక్కడెక్కడ దొరుకుతుంది?"
"ఇదేం ప్రశ్నండీ, అన్నీ పెట్రోల్ బంక్‌ల్లోనూ దొరుకుతుంది."
"భయంకరమైన అడవి మృగాలు ఓ 10 చెప్పండి"
"5 సింహాలు 5 పులులు".

**ఈ జోకును పంపినవారు: మదనపల్లి సుజాత, చిత్తూరు.**



"ఏమయ్యా డాక్టరూ నాకివ్వాల్సిన బాకీ సంగతి ఏం చేశావు? మర్యాదగా ఇప్పుడిస్తావా లేదా?"
"అలాగే , కాసేపలా కూర్చో. నిన్ననే ఒకతను కాలినొప్పి అని వస్తే గుండె నొప్పి వచ్చే మాత్ర ఒకటి ఇచ్చా. అతను రాగానే స్కానింగ్ తీసేసీ నీ బాకీ తీర్చేస్తా" చెప్పాడా డాక్టర్.



"ఒరే రవీ! ఆ గోపిగాణ్ణి చూడు. వాడికేమో అన్ని సబ్జక్టులలోనూ మంచిమార్కులు. నీకెమో సున్నాలు... వాడిలాగే నీక్కూడా మంచి మార్కులు రావాలంటే ఏం చేయాలో తెలుసా?" అడిగాడు మాష్టారు.
"తెలుసుసార్.. నేను కూడా వాడిలాగానే రోజూ మీ ఇంటిపనులు చేసిపెడుతుండాలి".

**ఈ జోకులను పంపించిన వారు: జి. సాయికుమార్, నవాబుపేట, నెల్లూరు.**



"ఇంతకాలం ఇప్పట్లో పెళ్లి చేసుకోను అనేవాడివి ఇంత సడెన్‌గా పెళ్లి ప్రయత్నాలు ప్రారంభించావ్ ఏంటి సంగతి?"
"ఆహా.... ఏం లేదు. అమెరికాలో జాబ్ వచ్చే అవకాశాలు వున్నాయ్‌లే అందుకనీ....."
"అయితే కన్ఫర్మ్‌డ్ డేట్ వచ్చిన తర్వాత పెళ్లిచేసుకుంటే దర్జాగా వైఫ్‌తో సహా వెళ్లొచ్చుగా..!?"
"అది కాదురా ఈ లోగా వీసా ఖర్చులకి, ఫ్లైట్ చార్జీలకీ, డబ్బులు అవసరం కదా! అందుకని!!"



తేలు కుట్టిన బాధతో లబోదిబోమంటున్న భర్తను పరామర్శిస్తూ అడిగింది భార్య
"మిమ్మల్ని కుట్టిన తేలు ఎర్రదా, నల్లదా?
"ఎర్రదే"
"చిన్నదా, పెద్దదా?"
"పెద్దదే"
"మెల్లిగా కుట్టిందా గట్టిగాకుట్టిందా?"
"ఇంతకన్నా ఆ తేలు కుట్టిన బాధే నయం" అని అన్నాడా భర్త తపీతపీమని నెత్తి బాదుకుంటూ.



"ఏవండీ మనింటికో వాషింగ్ మిషను, సీడీ ప్లేయర్ అవీ తీసుకొందామా"
"ఓ అలాగే..."
"మీరెంత మంచి వారండీ, రోజూ బస్సుల్లో ఎంత అవస్తపడుతున్నారో ఏమో మీకో మోటార్‌బైక్ ప్లాన్ చెయ్యండీ - బాగా డబ్బువున్నప్పడే కొనుక్కుందాం వాషింగ్‌మిషనూ, సీడీ ప్లేయరూ"
"అన్నీ ఒకేసారి కొంటానే.. డోన్ట్‌వర్రీ"
"అబ్బ... మీ లాంటి భర్త దొరకడం ఎంత అదృష్టమో... ఇంతకీ ఎప్పడు కొనుక్కుందామండీ ఇవన్నీ"
"వచ్చేనెల్లో పండక్కి మీ నాన్న మనల్ని పిలవాలిగా....అక్కణ్ణించి రాగానే కావలసినవన్నీ వరసపెట్టి కొనేసుకుందాం..ఓకేనా!?"

**ఈ జోకులను పంపించిన వారు: జి. యామిని ఈశ్వర్ కార్తీక్ సాగర్, వనపర్తి**



"ఏయ్ ఆటో....చార్మినార్‌కి ఎంత తీసుకుంటావో చెప్పు?"
"క్షమించండి మేడమ్ ప్రస్తుతం చార్మినార్ అమ్మే ఉద్దేశం లేదు నాకు."

ఈ సంచికలోని హ్యూమర్‌బాక్స్‌కి జోకులను పంపిన
**వై.చందు-కానుకర్తివారివీధి(శ్రీకాకుళం), కె.జ్యోతి - సికింద్రాబాద్, రాయప్రోలు హనుమత్ ప్రసాద్-ములగపూడి, మదనపల్లి సుజాత- చిత్తూరు, జి.సాయికుమార్, నెల్లూరు, జి.యామినీ ఈశ్వర్ కార్తిక్ సాగర్ - వనపర్తి గార్లకు సోహన్ మ్యూజిక్ వారు 'వన్స్‌మోర్ ఎన్.టి.ఆర్.' సినిమా పాటల ఆడియో సి.డి.నిబహుమతిగా ప్రకటించారు. అతి త్వరలో ఈ సి.డి.ని పోస్ట్ ద్వారా పంపించడం జరుగుతుంది.**

SOHAN
MUSIC






# పెళ్ళిపుస్తకం

**దర్శకత్వం : బాపు**

వెండితెర నవల
7

స్క్రీన్‌ప్లే-మాటలు-నిర్మాత
**ముళ్ళపూడి వెంకటరమణ**

**నవలీకరణ**
ఇలపావులూరి మురళీమోహనరావు

**జరిగిన కథ**

మధ్యతరగతికి చెందిన కృష్ణమూర్తి, సత్యభామలకు పెళ్ళవుతుంది. ఒకే ఊరిలో ఉండాలని శ్రీధరం కంపెనీలో ఉద్యోగాలలో చేరతారు. చేరడానికి తామిద్దరం భార్యాభర్తలు కాదని చెప్పవలసి వస్తుంది. కృష్ణమూర్తి బ్రహ్మచారి అనుకుని శ్రీధరరావు కూతురు వసుంధర అతన్ని అభిమానిస్తూ ఉంటుంది. భామకు ఇది కంటగింపుగా ఉంటుంది. శ్రీధరం బావమరిది గిరి సత్యభామపై కన్నేస్తాడు. -(ఇక చదవండి)

తరువాత అందరూ డాన్సు చేస్తూ పాట మొదలెట్టారు.

**పప్పు....పప్పు.... పప్పుదప్పళం**
**అన్నం - నెయ్యి -వేడి అన్నం - కాచిన నెయ్యి**
**వేడివేడి అన్నం మీద**
**కమ్మని పప్పు - కాచిన నెయ్యి**
**వేడివేడి అన్నం మీద**
**కమ్మని పప్పు - కాచిన నెయ్యి**
**పప్పు -దప్పళం కలిపి కొట్టడం**
**భోజనం - వనభోజనం**
**వనభోజనం- జనరంజనం**
**తల్లితోడూ - పిల్లా మేకా**
**లాలాలాలాలాలల తల్లితోడూ - పిల్లా మేకా**
**ఆలూ మగలూ - అత్తాకోడలూ**
**బాసూ - బంటూ - ఒకటేనంటూ కలవడం**
**భోజనం - వనభోజనం భోజనం.... వన భోజనం**





పాటపాడుతూ డాన్సు చేస్తున్న కృష్ణమూర్తిని చూడగానే వసుంధరకు కూడా హుషారెక్కింది. తాను కూడా అతనితో కలిసి డాన్సు చేస్తూ పాడడం మొదలెట్టింది.

**మన వయసుకు నచ్చినట్టి ఆటలు**
**మన మనసుకు వచ్చినట్టి పాటలు ॥మన వయసుకు॥**
**పసనిస - పని దని మద పద**
**మపసగ - మమా దప మగరి**
**పాడితే -**
**రంజనం - జన రంజనం ॥2॥**
**మీరు స సస మీరు రి రిరి**



**తమరు గ గగ మ మమ పపప వేరీగుడ్**
**ద దద శభాష్ ని నిని మరలా సా**

అంటూ ఆనందంతో కేరింతలు కొడుతూ చిందులేశారు. పాట, డాన్సు ఆపమని సైగ చేశాడు కృష్ణమూర్తి. అతని చొరవ, హుషారు శ్రీధరం దంపతులను కూడా ఆకర్షించింది. నవ్వుతూ చూస్తున్నారు, కన్నబిడ్డలే ఆడుతున్నట్లుగా అనిపిస్తున్నది వారికి.

"వెరీగుడ్..బాగుంది. బాగుంది. ఇప్పుడు నేను ఎవరిని చూపిస్తే వాళ్ళు ఆ స్వరం పాడాలి. రెడీయా?" హుషారెక్కించాడు కృష్ణమూర్తి అందరికీ.

అందరూ అంగీకార సూచకంగా తల ఊపారు.

**సరిగ సారిగ మామ**
**మామ - మామ**
**రిగమ రిగమ పాప - పాప - పాప**
**తకిట తకిట ధిమి తరికిట తక - తరికిట తక**
**మసాలా గారెలో మామా**
**జిలేబి బాదుషా - పపా**



వీళ్ళను చూసి గిరి కూడా లేచి డాన్సు చేయసాగాడు.

**సమోసా తీసుకో ....దద**
**పొటాటో చిప్స్ తోనా......నీ**
**మిఠాయి ఖావురే.....సా**
**పకోడి తిందువా......పప**
**మలాయి పెరుగిది......మమ**
**టొమాటో చట్నీతో......గగ**
**పసందు పూర్ణము......బూరి - నంజుకో కారప్పూసా**



ఈ విధంగా అందరూ తరతమబేధాల్లేకుండా ఆడుతూ పాడుతున్నారు పాపం...కొండల్రావుకు ఈ సందడంతా గోలగా ఉందేమో 'సైలెన్స్ - సైలెన్స్' అని అరిచాడు.

"బాబాయ్..." అంటూ ఆగమన్నట్టు చూసిన శ్రీధరం "చూడండి... ఇందులో నేను సరదాగా కొన్ని ఐటమ్స్ రికార్డు చేసుకొచ్చాను. ఎవళ్ళు ఏది నొక్కితే వాళ్ళు ఆ పని చెయ్యాలి. ఓకే. ..?" అన్నాడు.

"ఓకే. ..ఓకే.." అరిచారు అందరూ.

"కమాన్.." కృష్ణమూర్తిని ఆహ్వానించాడు శ్రీధరం.

"పెద్దవారు, ముందు మీరే ప్రారంభించండి" వినయంగా అన్నాడు కృష్ణమూర్తి.

"ఓకె...ఆల్‌రైట్ .."టేప్‌రికార్డర్ నొక్కాడు శ్రీధరం. "మొగ్గవెయ్యాలి" అనుంది దాన్లో.

"ఆహా...మొగ్గ వెయ్యాలి" చప్పట్లు కొట్టారు అందరూ. యజమాని తమందరి ముందు పిల్లి మొగ్గవేస్తాడని భావించి అందరూ పక్కకు తప్పుకున్నారు.



శ్రీధరం సామాన్యుడా?! 'అలాగే' అని భార్య వద్దకెళ్ళి ఆమె సిగలోంచి ఓ పూమొగ్గను తీసి 'మొగ్గవేస్తున్నా' అని విసిరివేశాడు. ఆయన సమయ స్ఫూర్తికి అందరూ హర్షధ్వానాలు చేశారు.

"బావగారు ..యూ ఆర్ జీనియస్..." అభినందించి భామ ముందు టేప్ రికార్డరుంచాడు గిరి. ఆన్ చేసింది భామ.



'డాన్స్ చెయ్యాలి' అని పలికింది కాసెట్.

"డాన్స్ చెయ్యాలి" ఒకేసారి అరిచాడు శ్రీధరం, గిరి.

భామ సిగ్గుపడుతుండగా ప్రోత్సహిస్తూ స్వరం అందు కున్నాడు కృష్ణమూర్తి.

**జిమ్ - తన తన జిమ్**

**జిమ్ జిమ్ - తన తన తన**

భామ మెల్లగా నడుమూపుతూ నృత్యం ఆరంభించింది.



**అరిసెలు బూరెలు - వడలు**

**ఆవడ బోండలు - కజ్జికాయలు**

**కరకరలాడు జంతికలు**

**కమ్మని ఘుమ్మను నేతి చిప్పలూ**

**సరిగమ పదనిస సస్స స్సస్స...సా**

**॥అరిసెలు॥**

**కరమగు నోరు - ఊరగల**

**కక్కలు ముక్కలు**

**ఫిష్ కబా బులూ**

**ష్....అమ్మమ్మ**



**కరమగు నోరు ఊరగల కారపు పచ్చడి**

**తీపి జాంగిరి**

**త్వర త్వర సర్వు చేయవలె**

**తైత క్కులాడగ పిక్కు నిక్కులో**

భామ డాన్సు ఊపందుకుంది. అందరూ ఆనందగా చూస్తున్నారు. గిరి సంగతి ప్రత్యేకంగా చెప్పనవసరంలేదు. కృష్ణమూర్తి పాడుతున్నాడు.



**తై తక్క తైతక్క - త్త తక్క - త్త తక్క**

**తై...తై.....తై.....తై**

**తక్కధిన ధిన తరికిట ధిన్న**

**తాంగిట తరికిట దిగి దిగి దిగి దిగి**

**తక తకిట తక తకిట**

**తక తకిట తధిగిణతోం**

**తధిగిణతోం తధిగిణతోం**

భామలో ఆవేశం పూర్తి స్థాయికి చేరింది. తాదాత్మ్యంతో పక్కా వృత్తి కళాకారిణిలా - మయూరిలా ఆడుతున్నది.

**ఆ..ఆ...ఊ....**

**తాంగిట తరికిట తధిమి తాంగిట తరికిట తధిమి**

**తాంగిట తరికిట తధిమి తతత**

**ధిం తనకధిన ధిం తనకధిన ధిం**

**ధిం తనకధిన ధిం తనకధిన తకధిమి తకధిమి**

**తకధిమి తకధిమి తకధిమి తకధిమి తకధిమి తకధిమి**

**ఆహా ఓహో ఆహా**

**తరికిట తరికిట తరికిట**

**ధి ధి ధినక ధిన ధిధి ధినక ధిన ధి ధి ధినక ధిన**

**ధి ధి ధినక ధిన ధి ధి ధినక ధిన**

**ధి ధి ధినక ధిన తరికిట తరికిట ధిం తరికిట తరికిట ధిం తాంగు తరికిట తా**

శ్రీధరం -మంగళ ఆమె దివ్య నృత్యం చూసి పులకించి పోయారు. నృత్యం ఆపి వినయంగా ఒదిగి నిలుచుంది భామ.

"నేనూ....ఓ ..వెరీ హ్యాపీడే. చాలా బాగా జరిగిందయ్యా" అన్నాడు శ్రీధరం.



"యస్సార్ ..వెరీ హ్యాపీ గా....." అన్నాడు కృష్ణమూర్తి.

"నీకిన్ని విద్యలు వచ్చని తెలియదయ్యా. ఉట్టి బొమ్మలే అనుకున్నాను" తాను ఆశ్చర్యం ప్రకటించాడు కొండల్రావు.

"బాబాయ్...కళ్ళూ చేతులూ కాసేపు కట్టెయ్." కొండల్రావుతో అని కృష్ణమూర్తి వైపు చూశాడు శ్రీధరం . "ఆ ..డాన్స్ కూడా బాగా ఆడావయ్యా నువ్వూనూ, నీతో ఆడిన.." అన్నాడు .

"మన స్టైనో గారండీ" చెప్పాడు కృష్ణమూర్తి.

"పేరేదో అన్నావే"

"నాకు గుర్తులేదండీ"

"భామ - సత్యభామ " చెప్పాడు కొండల్రావు.

" నీకు డాన్సేనా ఇంకేమైనా ఆటలొచ్చా?"

"చదరంగం - క్యారంబోర్డ్...." చెప్పసాగాడు కొండల్రావు,

"ఇష్.." అతన్ని చెప్పనీ అన్నట్లు వారించాడు శ్రీధరం.

"నేను కాలేజీ రోజుల్లో టెన్నిస్, బ్యాడ్‌మింటన్, షటిల్, పింగ్ పాంగ్, ఒకటివస్తే అన్నీ వచ్చినట్లేనండీ. ఫిడేలు వాడికి గిటారు వచ్చినట్లు" చెప్పాడు కృష్ణమూర్తి.

"ఆ హాహ...బైదిబై ,నాకు షటిల్ అంటే చాలా సరదానయ్యా. సరదాయే కాదు. ఎక్సర్‌సైజుకు అవసరం కూడానూ" అన్నాడు.

"ఆ....హా....హా....రాదు రాదు అంటూనే నేటి వరకు ఒక్కగేమ్ ఓడితే ఒట్టు " వంత పాడాడు కొండల్రావు.

"ఇష్.."మందలింపుగా వారించాడు శ్రీధరం.

"పొగడనులే. ఆయుః క్షీణం"చెంపలేసుకున్నాడు కొండల్రావు.

"రేపట్నుంచీ సాయంకాలం ఒక అరగంట రావాలయ్యా" ఆదరంగా అన్నాడు శ్రీధరం.

" నేను ..మీతోనా" ఆశ్చర్యంగా అన్నాడు కృష్ణమూర్తి.



"నాకు రాదయ్యా మగడా అంటుంటే..." అన్నాడు శ్రీధరం

"వారు అలా అంటూ వుంటూంటే.." ఏదో చెప్పబోయాడు కొండల్రావు

"నేను ఇలా అంటున్నాను కదండీ" అంటూ కృష్ణమూర్తి నమస్కారం పెట్టేసాడు.

**(ఇంకావుంది)**

# హైదరాబాదులో 'హాసం క్లబ్' ద్వితీయ

మహా సహస్రావధాని డా॥ గరికపాటి నరసింహారావు ఓ అవధానంలో చెప్పిన కంప్యూటర్ దండకాన్ని పదేళ్ల బాలుడు వంశీకృష్ణ ఎక్కడా తడబడకుండా, చూసి చదవకుండా వల్లించడం; శిల్ప, దీపిక అనే సోదరీమణులు శంకర్ మహదేవన్ బ్రెత్‌లెస్ పాట పాడడం, ఆలిండియా రేడియో ఆర్టిస్టు వల్లినాయకి తన కోడలితో కలిసి ఆలపించిన పాట, నాగమణి 'హోయి హోయిగా ఆమని సాగె' పాట ఆధారంగా పాడిన ప్యారడీసాంగ్ - ఇలా ఎన్నో హైలెట్స్‌తో సాగింది, 25-04-04 నాటి హైదరాబాద్ 'హాసం క్లబ్' రెండవ కార్యక్రమం! ప్రతినెలా ఆఖరి శనివారం జరిగే ఈ కార్యక్రమంలో 26 మంది పాల్గొని రకరకాల హాస్య, సంగీత ఐటమ్స్‌తో ప్రేక్షకులను ఆకట్టుకున్నారు.

కె.ఎల్.కామేశ్వరరావు, అరుణ్‌తేజ్, బి.శ్రీనివాసాచారి, వి.లక్ష్మి, రచయిత్రి వాలి హిరణ్మయి దేవి, లక్ష్మీపతిశర్మ, తదితరులు జోక్స్ చెప్పగా, ఎన్.సి.ధర్మాచార్యులు ఎన్నికల్లో అభ్యర్థులు పడే పాట్లను ఉత్తరాంధ్ర యాసలో హాస్యస్ఫోరకంగా చెప్పారు. మిమిక్రీ చేసిన బేబీ మౌనిక, శ్రీ మోహనకృష్ణలలో ఈసారి మోహనకృష్ణ నేరెళ్ల వేణుమాధవ్ ఆత్మకథ పుస్తకాన్ని 'హాసం' నుండి బహుమతిగా గెల్చుకున్నారు. అమృత, రాధిక, మల్లి, మాధురి, లహరి, ఎ.కమలశ్రీ, బి.హైందవి, దాలయ్య పాటలు పాడి శ్రోతలను రంజింపజేశారు.

పి.వి.ఎస్.ఎస్.శర్మ 'హాసం'లో ప్రచురించబడిన 'ప్రేమించిచూడు'లో పాట తమిళ వెర్షన్, తెలుగు వెర్షన్ పోలికలను పాడి వినిపించారు. ఎస్.శ్రీకృష్ణ 'గర్ల్‌ఫ్రెండ్'లోని 'ఆజ్ ముఝే కుఛ్ కహ్‌నా హై' పాటలో అందాలను వివరించారు. 'హాసం' సంపాదకుడు రాజా గాయనీ గాయకులు పాడే రీతులపై సమయోచిత వ్యాఖ్యలు చేయడంతో బాటు క్లిష్టమైన ఉచ్చారణ గల ఓ తమిళ గీతాన్ని టేపు ద్వారా వినిపించి, ఆ లిరిక్‌ను సంగీత దర్శకులు కీరవాణి ద్వారా సంపాదించానని తెలిపారు. రచయిత ఖదీర్‌బాబు కార్యక్రమానికి హాజరు కావడంతో బాటు కంప్యూటర్ దండకం చదివిన వంశీకృష్ణకు తన 'పోలేరమ్మ బండ కతలు' పుస్తకాన్ని బహుమతిగా ఇచ్చారు. బ్రెత్‌లెస్ సాంగ్ పాడిన సోదరీమణులకు బహుమతిగా 'అతడే ఒక సైన్యం' సినిమా ఆడియో సిడిలను శ్రీయుతులు అచ్చిరెడ్డి, కృష్ణారెడ్డిల తరఫున 'హాసం' అందచేసింది.

## పలాసలో 'హాసం క్లబ్' ప్రారంభం

వివేకానంద కాలనీలో గల శ్రీ కిరణ్ నర్సింగ్‌హోమ్ మేడపైన 24-04-04 శనివారం సాయంత్రం ఆరున్నర గంటలకు శ్రీమతి గౌరి జ్యోతి ప్రజ్వలనంతో, మాజీ ఎంపిటిసి దుర్గాప్రసాద్ పాత్రో ప్రార్థనా గీతంతో 'హాసం క్లబ్' ప్రారంభోత్సవం జరిగింది. కన్వీనరు డా॥ వై.రామినాయుడు క్లబ్ గురించి వివరించిన తర్వాత ప్రొఫెసరు టి.ఆనందరావు మనిషి నరాల్లో హాస్యం స్వరాలు ఉండాలన్నారు. కాష్యూ మేన్యుఫేక్చరర్స్ అసోసియేషన్ అధ్యక్షులు మల్లా నూకరాజు మాట్లాడుతూ జీవితంలో వినోదానికి, ఉల్లాసానికి దూరమౌతున్న తరుణంలో ఇటువంటి క్లబ్‌ల అవసరం ఉందన్నారు.

సభకు విచ్చేసిన డా॥ ఎస్.కె.వి.శాస్త్రి, కొట్ని రమేష్, హనుమంతు, మురళి, కుమారి శోభారాణి, కొండల విశ్వేశ్వరరావు, కొండల శ్రీధరరావు, బి.కాళిదాసు, సదాశివుని ప్రసాదరావు, ఉమాపతి బెహర, కొత్తకోట పులశెట్టి, గంగాధర, కృష్ణారావు, శేఖరబాబు, పైల కృష్ణప్రసాద్, ఆంజనేయులు, ఎవి.కె.శాస్త్రి, బంకువల్లి రామప్రసాద్, రామారావు, తంగుడు వైకుంఠరావు, పెంట ఓంప్రకాశరావు ప్రభృతులు రెండున్నర గంటలపాటు జోకులతో, పాటలతో గ్రీష్మ తాపాన్ని చల్లార్చి వాతావరణాన్ని ఆహ్లాదమయం చేశారు. బుర్జి కోటేశ్వరరావు గారు సంగీతం గురించి వివరించారు. **తదుపరి కార్యక్రమం మే 29 సాయంత్రం** అక్కడే జరుగుతుందని కన్వీనరు డా॥రామినాయుడు (ఫోన్ : 241268) ప్రకటించారు.




పలాసలో 'హాసం క్లబ్'లో జ్యోతి ప్రజ్వలనం చేస్తున్న శ్రీమతి గౌరి, (ఎడమ నుండి కుడికి) ప్రొఫెసర్ ఆనందరావు, నూకరాజు, కన్వీనరు డా॥వై.రామినాయుడు.



'కంప్యూటర్ దండకము' వల్లించి ఆహూతులను ఆహ్లాదపరచిన చి॥వంశీకృష్ణ

## కంప్యూటర్ దండకము

శ్రీమన్మహాయంత్ర రాజ్ఞీ! త్రిలోకైక పూజ్యా!
త్రినేత్రావిభాజ్యా! మహేజ్యా!నిరాజ్యా! మహాశాస్త్ర వేద్యా!
మహాతంత్ర విద్యా! మహాబుద్ధి సాధ్యా! అసాధ్యా! అభేద్యా!
భవత్సృష్టి ఈ సృష్టి రూపమ్మమార్చెన్ స్వరూపమ్ము
తీర్చెన్ భవద్రూపముంజూడ నాకేలనోఆదిదైవంబు
విఘ్నేశ భావంబు తోచున్ మనంబందు-శుక్లాంబరంబీవు
పైపైన కప్పించుకోవే? జగంబందు నీ ప్రజ్ఞ వీరంగ
మాడంగ లేనట్టి రంగంబు కానంగరాదే! జగద్వ్యాప్త
మైనట్టి తేజంబు విష్ణుత్వముందెల్ప బోదే! శశిన్
బోలు వర్ణంబునన్ చుట్టునుం దెల్లనై మధ్యలో భస్మమున్
బోలువర్ణంబుతో మేత్తెరన్ దాల్చవే?నాల్గు ప్రక్కల్
చతుర్బాహు రూపంబునం దోపవే? ఎప్పుడైనన్ ప్రసన్నంబు
నీమోము కాదందుమే? ఎన్నడేనైన ఒక్కింత పాడైనచో
నాడు మామోము మేమైన చూడంగ కీడౌగదా! మేము
నీముందు కూర్చుండినం జాలు మా మోములంజూడ బాలార్క
బింబద్యుతుల్ సోకు పద్మంబులం బోలి విప్పారి
కన్పింపవే?చూడ నీయుత్తమాంగంబదే మత్తమాతంగ
మై తోచు నిర్వంకలన్ పెట్టెలే చేటలంబోలు శ్రోత్రం
బులై తోచుగా ! తుండమా సన్నమైపోయె నన్నన్
సరే దానికేమీ, అనంతంబు కాలంబులో దాని రూపంబు
చిక్కెంగదా! ఏకదంతంబునుంబోలె నీముందు కీ బోర్డు
వెల్గొందుచుండెన్, పరిజ్ఞానదంతంబు మా కయ్యదేగా,
అదే మూషికంబిప్పుడే మౌసు రూపంబు దాల్చెన్
గజాస్యంబు నీయందు నిక్కంబుగా తోచుచుండెన్ గదా!
తల్లి! విఘ్నేశ్వరీ దేవి! నీ సేవలో మే మహస్సుల్ నిశా
మధ్యముల్ మున్గుచున్ దేలుచున్ గూడ రవ్వంతయున్
నొవ్వబోమన్నచో నీదు స్నేహంబునన్ నీదు ప్రేమంబునన్
నీదు రూపంబునన్ గల్గు మాధుర్యమే దానికిన్ గారణంబౌను
గా; మాకు నేవిఘ్నముల్ లేక ఆటంకముల్ రాక కాపాడి
మా తప్పుసైరింప మాముద్దు చెల్లింప నుద్యోగముల్ కూర్ప

# కార్యక్రమ సంరంభం

ఏలూరు 'హాసం క్లబ్' కన్వీనరు డి.రామకృష్ణారావు కార్యక్రమానికి హాజరయి 'మంచి మనసులు' సినిమాలో హాస్య దృశ్యాలను గుర్తుకు తెచ్చారు. 'సినీ విజ్ఞాన విశారద' యస్.వి.రామారావు ఆద్యంతం రసవత్తరంగా కార్యక్రమాన్ని నిర్వహించి **తదుపరి కార్యక్రమం మే 29 ఆఖరి శనివారం సాయంత్రం రాజీవ్‌నగర్‌లోని 'హాసం' ఆఫీసు ఆవరణలోనే** జరుగుతుందని, హాస్య - సంగీతాభిమానులందరూ సకుటుంబంగా ఆహ్వానితులేనని తెలిపారు.

మా యోగముల్ మార్చ నీ కన్న నీ కాలమందున్ సమర్థుల్
గనన్ రారు లేరింకలేరే! జగన్మాత! పూతా!సుజాతా!
భవత్ప్రాభవంబున్ భవద్వైభవంబున్ భవల్లీలలన్ వర్ణ
నల్ చేయ నేనెంత? నాద్దైన భాషా పరిజ్ఞానమే సుంత,
విశ్వంబునన్ గల్గు వేవేలభాషల్
లిపుల్‌లేని భాషల్, విశేషాల భాషల్, వినూత్నంపు భాషల్,
మనోజ్ఞంపు భాషల్ మహా శక్తిఘోషల్ గదా నీవి.... పాస్కల్లు లోటస్సు డీబేసు
బేసిక్కు కోబాల్ వరాకిల్లు సీప్లస్సు ప్లస్‌ప్లస్సు లిత్యాది
భాషా ప్రపంచంబు స్వాధీనమా నీకు స్వారాజ్యమా నీకు
భాషామతల్లీ! ప్రయోగాల తల్లీ! ప్రభావాలవల్లీ!స్వరూ
పానబుల్లీ ! స్వభావాన మల్లీ! భవద్వ్యాప్తి నూహింప
శక్యంబె? పెండ్లిండ్లలో నీవె పేరంటముల్ నీవె కాలేజిలన్
నీవె కాటేజిలన్ నీవెలే పెద్దహోటళ్లలో పూటకూటిళ్లలో
రైలుటిక్కెట్లలో బస్సు ఇక్కట్లలో ఓడనైనన్ విమా
నంబునందైన అణ్వాయుధంబందు ఆఫీసుఫైల్లందు
నన్ రోదసీయాత్రలో ద్వాదశీ పూజలో ఏ కిరణాందుకా
ణంబులోనైన ఏజాతకాల్ చెప్పు చోటైన ఏరోగి
దేహంబుపైనైన ఎవ్వాని హస్తంబులో నైన ఏచిన్నదో
పెద్దదో లావుదో సన్నదో యైన నీ రూపమే కానరాదా
చెలీ! నీవులేకుండ మే ముండుటన్నన్ పరీహాసమే
కాదొకో!నిన్ననో మొన్ననో కాదె నీకింత వైరస్యమే
సోకి వైటూకెగా ప్రాకి లోకంబులన్ భీకరంబైన
శోకంబు వ్యాపింప జేయన్ ప్రపంచంబు పంచత్వమున్
పొందునంచున్ మహాశాస్త్ర వేత్తల్ మహాజ్ఞాన వీరుల్
భయంబొంద జేయంగ సర్వప్రపంచంబు తానీ సహస్రాబ్ది
ప్రారంభపుణ్యాహమున్ జూచునో? చూడదో ? ఆ
ప్రభాతంబు భూతంబొకో సుప్రభాతంబొకో యంచు నీ
నేలపై గల్గు జీవాళి యెల్లన్ వినూత్న జ్వరంబందునన్
మున్గి యుండంగ నీ దివ్య కారుణ్య వర్షంబునన్ క్రొత్త
వేయేడులన్ క్రొత్తగా మెత్తగా చిత్తముల్ హత్తుకో గల్గె
గాదా? నవీనంబుగా నీకు హాకర్ల ధీచాక చక్యంబు
శృంగార సందేశ రూపంబునన్ కీడు కావింప 'ఈ మేలు'
లో కీడు ఏ వేళనో చీడగా దూరి నష్టంబు కావించినన్
నీదు సామర్థ్యముల్ నీదుసంపన్నతల్ నీదు మేధామహాశక్తి
పారీణతల్ మాకు తెల్లంబుగా నల్లముప్పొంగి పోదే?
భవద్దివ్య గాథావళిన్ చెప్పుకోసాగినన్ వత్సరంబుల్
శతాబ్దుల్ సహస్రాబ్దులైనన్ సమర్థంబు లోనే మహాదేవి!
కంప్యూటరన్ పేర ఆవిర్భవంబందినానీవు ఆరైనవేదంబవే
నీవు ఏడైన శాస్త్రంబవే నీవు అణ్వాది బ్రహ్మాండ యంత్రం
బనన్ నీ జగజ్జంత్రమేకాదె సర్వం సహామండలంబందు
సర్వంబు నీయందు నిక్షిప్తమై యుండెగా
ధారుణీ గర్భిణీ చారిణీ దుర్భిణీ కావుమమ్మా
మహాదేవి శ్రీదేవి కంప్యూటరమ్మా
నమస్తే నమస్తే నమస్తే నమః

-గరికపాటి నరసింహారావు

జావేద్ అఖ్తర్
రచించగా
శంకర్ మహదేవన్
ఆలపించిన
బ్రెత్‌లెస్ సాంగ్‌ని
గానం చేసి ప్రేక్షకులను
రంజింప చేసిన
శిల్ప, దీపిక.



కోయిజో మిలాతో ముఝే ఐసా లగతా థా జైసే
మేరి సారి దునియామే గీతోంకి రుత్ ఔర్ రంగోంకి బర్‌ఖాహై
ఖుషబుకి ఆంధిహై మెహకి హుయిసి అబ్ సారి ఫిజాయెహై
బెహకి హుయిసి అబ్ సారి హవాయెహై
ఖోయి హుయి సి అబ్‌సారి దిశాయెహై
బదలి హుయిసి అబ్ సారి అదాయెహై
జాగీ ఉమంగెహై ధడక్ రహాహై దిల్ సాసోంమే తూఫాహై
హోంఠోం పె నగ్‌మేహై అంఖోమే సప్‌నేహై
సప్‌నోంమే జీతే హువె సారేవో లమ్హేహై
జబ్ కోయీ ఆయాథా నజరోంపే ఛాయా థా
దిల్ మే సమయా థా కైసే మై బతావు తుమ్హేకైసా ఉసె పాయాథా
ప్యార్‌సె చెహరేపే బిఖిరీజో జుల్ఫేతో ఐసా లగ్‌తా థా జైసే
కొహరేకె పీఛే ఇక్ ఓస్ మే ధులా హువా
ఫూల్ ఖిలాహై జైసె బాదల్ మే ఇక్ చాంద్ ఛుపాహై
ఔర్ ఝూంక్ రహాహై జైసె రాత్ కె పర్‌దేమే ఏక్ సవేరా హై
రోషన్ రోషన్ అంఖోంమె సపనోంకా
సాగర్ జిస్‌మే ప్రేమ్ సితారోంకి
చాదర్ జైసే ఝులక్ రహీ హై
లహరోం లహరోం బాత్ కరేతో జైసె
మోతీ బర్‌సే జైసె కహి చాందికి పాయల్ గూంజే
జైసె కహి షీషెకి జామ్ గిరే ఔర్ ఛన్‌సే
టూటే జైసెకొయి ఛుప్‌కె సితార్ బజాయే
జైసెకోయి చాంద్‌ని రాత్ మె గాయే
జైసెకోయి హవులెసె పాస్ బులాయే
కైసే మిలి బాతే థి వో కైసే ములాకాతే థీ వో
జబ్ మైనె జానా థా నజరోంసె కైసె
పిఘుల్ తే హైదిల్ అవుర్ ఆరుజూ పాతేహై కైసె మంజిల్
అవుర్ కైసే ఉతర్ తా హై
చాంద్ జమీపర్
కైసెకభీ లగతాహై స్వర్గ్ అగర్ హైతో బస్ హై యహీపర్
ఉస్‌నే బతాయా ముఝే అవుర్ సమ్‌ఝాయా ముఝే
హమ్ జోమిలే హై హమే ఐసెహి మిల్‌నా థా
గుల్ జో ఖిలేహై ఉన్హె ఐసెహి ఖిల్ నాథా
జన్మోంకె బంధన్ జన్మోంకె రిష్తే హై
జబ్ భీ హమ్ జనమే తో హమ్ యుహి మిల్‌తేహై
కానోం మే మేరే జైసె షహద్ సే ఘుల్ నే లగే
ఖ్వాబోం కె దర్ జైసె అంఖోం మే ఖుల్ నేలగే
ఖ్వాబోంకి దునియా జో కహనె కోథీ పర్
కహీ భీనహీ థీ
ఖ్వాబ్‌జో టూటే మేరీ అంఖ్ జో ఖులీ మేరీ హోష్‌జో ఆయా ముఝే
మైనా దేఖా మైనే జానా వో జో కభీ ఆయాథా
నజరోంపె ఛాయాథా
దిల్ మే సమాయాథా
జా ఛీచుకాహై అవుర్ దిల్ మేరా హై అబ్
తన్హాతన్హానతో కోయి అర్‌మాహై
న కోయీ తమన్నా హై అవుర్ నా కోయీ సపనా హై
అబ్ జోమేరే దిన్ అవుర్ అబ్‌జోమేరీ రాతేహై
ఉన్మే సిర్ఫ్ ఆసూహై ఉన్మే సిర్ఫ్ దర్ద్‌కి రంజ్‌కి బాత్‌హై
అవుర్ ఫర్ యాదేహై మేరా అబ్ కోయి నహీ మైహు
అవుర్ ఖోయే హువే ప్యార్‌కీ యాదేహై

'హాసం క్లబ్' ప్రారంభించదలచిన వారు సంప్రదించవలసినది
శ్రీ ఎస్.వి.రామారావు, 040-2416 0279,
98491 39030

మే 24 మజ్రూహ్ సుల్తాన్‌పురి వర్ధంతి సందర్భంగా....

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

చిత్రం : ఆర్‌పార్
రచన : మజ్రూహ్ సుల్తాన్‌పురి
సంగీతం : ఒ.పి.నయ్యర్
గానం : గీతాదత్



బాబుజీ ధీరే చల్‌నా ప్యార్ మేఁ జరా సంభల్‌నా
హాఁ బడే ధోఖేహై, బడే ధోఖే హైఁ ఇస్ రాహ్ మే ॥బాబూజీ॥
క్యోం హో ఖోయే హువే సర్ ఝుకాయే
జైసే జాతే హో సబ్ కుఛ్ లుటాయే
యే తో బాబూజీ పెహలా కదమ్ హై
నజర్ ఆతే హై అప్‌నే పరాయే
హా... బడే ధోఖే హై బడే ధోఖేహై ఇస్ రాహ్‌మే ॥బాబూజీ॥
యే మొహబ్బత్ హై ఓ భోలే భాలే, కర్ న దిల్ కో గమోఁ కే హవాలే
కామ్ ఉల్‌ఫత్ కా, నాజుక్ బహుత్ హై
ఆకే హోంఠోం పె టూటేంగే ప్యాలే
ఆ... బడే ధోఖే హై ॥బాబూజీ॥
హోగయీ హై కిసీసే జో అన్‌బన్, థామ్‌లే దూస్‌రా కోయీ దామన్
జిందగానీ కీ రాహే అజబ్ హై హో అకేలా తో లాఖోం హైఁ దుష్మన్
హాఁ బడే ధోఖేహై, బడే ధోఖే హైఁ ఇస్ రాహ్ మే ॥బాబూజీ॥

కె.ఎల్. సైగల్ నుంచి బాబీదేవల్ వరకు ఆరేడు తరాల హీరోలకు పాటలు రాసి తన తుది శ్వాస వరకు చిత్రరంగానికి సేవలందించిన మజ్రూహ్ సుల్తాన్‌పురి దాదా సాహెబ్ ఫాల్కే అవార్డు అందుకున్న తొలిగీత రచయితగా చరిత్రలో నిలిచిపోయారు. 1946లో వచ్చిన 'షాజహాన్' నుంచి 2000లో వచ్చిన 'హమ్‌తో మొహబ్బత్ కరేగా' వరకు ఆయన వాసి తగ్గని పాటలు రాశారు.**'షాజహాన్' లో నౌషద్ స్వరపరచగా కె.ఎల్. సైగల్ పాడిన 'జబ్ దిల్ హీ టూట్ గయా' పాట సైగల్ పై ఎంత ప్రభావం చూపిందంటే తన అంతిమయాత్రలో అదేపాట ట్యూన్ వాయించాలని ఆయన కోరారు.**

దిలీప్‌కుమార్‌కు ట్రాజెడీ ఇమేజ్, దేవ్ ఆనంద్‌కు రొమాంటిక్ ఇమేజ్, షమ్మీ కపూర్‌కు'యాహూ' ఇమేజ్, అమీర్ ఖాన్‌కు లవర్ బాయ్ ఇమేజ్ రావటంలో మజ్రూహ్ సాబ్ పాటల పాత్ర ఎంతోఉంది. దిలీప్‌కుమార్‌కు 'అందాజ్'లో 'హమ్ ఆజ్ కహీఁ దిల్ ఖో బైఠే', 'తూ కహే అగర్ జీవన్ భర్,' 'టూటే న దిల్ టూటే న' పాటలతో భగ్నప్రేమికుడి ఇమేజ్ ఇచ్చారు. ఇక దేవ్ ఆనంద్‌కు పట్టువదలని ప్రేమికుడి ఇమేజ్ తెచ్చిన పాటలు 'మానా జనాబ్ నే పుకారా నహీఁ(పేయింగ్ గెస్ట్), 'హమ్ హైఁ రాహీ ప్యార్ కే' (నౌదో గ్యారా), 'యే దిల్ న హోతా బేచారా' (జ్యూయెల్ థీఫ్) ఆయన రాసినవే. షమ్మీకపూర్ చిత్రం 'తుమ్‌సా నహీఁ దేఖా'లో 'జవానియాఁ యే మస్త్ మస్త్ బిన్ పియే', 'సర్ పే టోపీ లాల్', 'దేఖో కసమ్ సే,' పాటలతో అల్లరి ప్రేమికుడికి ప్రాణం పోశారు. అమీర్ ఖాన్ చిత్రం 'కయామత్ సే కయామత్ తక్'లో 'అయ్ మేరే హమ్‌సఫర్', 'జో జీతా వహీ సికందర్'లో 'పెహలా నషా','అందాజ్ అప్నా అప్నా'లో 'యెల్లో యెల్లో, యెల్లో జీ సనమ్' పాటలు గడిచిన కాలాన్ని గుర్తుచేశాయి.

నాసిర్ హుసేన్ చిత్రాలలో మజ్రూహ్ సాబ్ పాటలే ఉండేవి. ఇతర నిర్మాతలందరూ ఏదో ఒక సమయంలో మజ్రూహ్ సాబ్ చేత పాటలు రాయించుకున్నవారే. మెహబూబ్, బి.ఆర్. చోప్రా, తారాచంద్ బర్జాత్యా, బిమల్ రాయ్, ఎస్.ముఖర్జీ,రాజ్‌ఖోస్లా-వీరందరూ ఆయన పాటలు కోరుకున్న వారే. ఆర్.కె. సంస్థలో కూడా 'ధరమ్ కరమ్' చిత్రంలో ఆయన 'ఎక్ దిన్ బిక్ జాయేగా మాటీ కే మోల్' పాట రాశారు. చిన్న నిర్మాతలైనా పాటల నాణ్యతలో తేడా చూపలేదాయన, రాజిందర్ సింగ్ బేదీ తీసిన 'దస్తక్'లో ఆయన రాసిన 'బయ్యా నా ధరో', 'హమ్ హైఁ మతా-ఎ-కూచా బాజార్ కీ తరహ్' పాటలు క్లాసిక్‌గా నిలిచిపోయాయి. మదన్ మోహన్‌కి జాతీయస్థాయిలో ఉత్తమ సంగీత దర్శకుడి అవార్డు తెచ్చిపెట్టాయి.

గురుదత్ 'ప్యాసా','కాగజ్ కే ఫూల్','సాహిబ్ బీబీ ఔర్ గులామ్,' వంటి సీరియస్ చిత్రాలు తీసినా మొదట్లో 'జాల్','బాజీ', 'ఆర్‌పార్' వంటి స్టయిలిష్ చిత్రాలు తీశారు. 'ఆర్‌పార్' చిత్రంలో ఆ చిత్ర వాతావరణానికి తగినట్టు స్టయిలిష్ పాటలు రాశారు మజ్రూహ్ సాబ్. ఒ.పి. నయ్యర్ సంగీతం గురించి కొత్తగా చెప్పేదేముంది?

**'ఆర్‌పార్'లోని 'సున్ సున్ సున్ సున్ జాలిమా' పాటలో రెండోలైన్ 'హమ్‌కో తుఝ్‌సే ప్యార్ హో గయా' అని రాశారు మజ్రూహ్ సాబ్. దాన్ని 'హమ్‌కో తుమ్‌సే ప్యార్ హోగయా'అని మార్చారట గురుదత్. మజ్రూహ్‌సాబ్ 'సున్ వచ్చినప్పుడు తుఝ్ అనే ఉండాలి. సునో అంటే తుమ్ వస్తుంది' అన్నారట. అందుకు గురుదత్ 'హమ్, తుమ్ శబ్దాలు బాగా కలుస్తాయి. మెలోడీ బావుంటుందీ. పాట పాడే పాత్ర చదువుకోనివాడు కాబట్టి వ్యాకరణం పాటించకపోయినా ఫర్వాలేదు' అన్నారట. మజ్రూహ్ సాబ్ వెంటనే ఒప్పుకున్నారట. ఇది ఆయన వినమ్ర స్వభావానికి ప్రతీక.**

'బాబూజీ ధీరే చల్‌నా' పాట క్లబ్‌సాంగ్. గీతాదత్ గళంలో క్లబ్‌సాంగ్ కూడా ఎంతో మెత్తగాపలికింది. ఇక మత్తుమాట సరేసరి. ప్రేమ మనిషిని నాశనం చేస్తుందని ఇప్పుడు ఎన్నో పాటలు వస్తున్నా యాభై ఏళ్ళ క్రితమే ప్రేమ గురించి హెచ్చరించిన పాట ఇది.

'ధీరే' అంటే నెమ్మదిగా, సంభల్‌నా అంటే జాగ్రత్తపడటం. ధోఖే అంటే మోసాలు. రాహ్ అంటే దారి.

**'ఓ బాబూ నెమ్మదిగా నడు, ప్రేమలో కొంచెం జాగ్రత్తపడు**

**ఎన్నో మోసాలున్నాయి ఈ దారిలో'**

ప్రేమలో ఆచితూచి అడుగేయాలని, ఎన్నోమోసాలు జరుగుతాయి కాబట్టి జాగ్రత్త పడాలని భావం. ప్రేమను దారితో పోల్చి జాగ్రత్తగా నడవమని చెప్పటంలో చక్కని సృజనాత్మకత కనిపిస్తుంది.

'ఖోయే హువే' అంటే పరధ్యానం. లుటానా అంటే పోగొట్టుకోవటం. 'పెహలాకదమ్' అంటే తొలి అడుగు. అప్‌నే అంటే తనవారు.

**'అన్నీ పోగొట్టుకున్నట్టు**
**అప్పుడే తలవాల్చేశావే**
**ఇది తొలి అడుగే కద బాబూ**
**పోను పోను సొంతవారే దూరమవుతారులే**

ప్రేమలో పడినప్పుడు పరధ్యానంగా ఉంటారు. అన్నీ మరచి తమదైన లోకంలో ఉంటారు. అది మొదటి లక్షణమట. ఆ తర్వాత తనవారు కూడా పరాయివాళ్ళలా అనిపిస్తారు. 'ముందుంది ముసళ్ళ పండగ' అనే హెచ్చరిక ధ్వనిస్తుంది ఇక్కడ.

'భోలా భాలా' అంటే బోళా మనిషి. గమ్ అంటే బాధలు. హవాలే అంటే అధీనం. ఉల్ఫత్ అంటే ప్రేమ. హోఁ అంటే పెదాలు. ప్యాలా అంటే మధుపాత్ర. టూట్‌నా అంటే పగలటం.

**'ఓ బోళాబాబూ, ఇది ప్రేమలే**
**మదిని బాధలపాలు చేయొద్దులే**
**ప్రేమంటే నాజూకు వ్యవహారం లే**
**పెదాల దాకా వచ్చి ఒలికిపోతుంది లే**

ప్రేమ అంటేనే బాధల పుట్ట. అందులోకి దిగి బాధలను కొని తెచ్చుకోవటం అవివేకం. పెదవులదాకా వచ్చి ఒలికిపోయే మధువు లాంటిది ప్రేమ.

అన్‌బన్ అంటే మాటా మాటా పెరగటం. దామన్ అంటే పైట. అజబ్ అంటే వింత. ఆకేలా అంటే ఒంటరి. దుష్మన్ అంటే శత్రువు.

**జోడు వీడిపోతే**
**మరోతోడు చూసుకో వెంటనే**
**జీవితపు బాటలు బలే వింత వింత లే**
**ఒంటరిగా వుంటే పగబట్టే వారికి లోటు లేదులే**

ప్రేమకు దూరంగా ఉండాలని చెబుతూనే ఒక తోడు ఉండాలని అంటోంది ఆమె. ఒంటరిగా ఉంటే లోకులు మోసం చేయాలని చూస్తారు. క్లబ్‌లో డాన్స్ చేసే యువతి కాబట్టి ఆమెకు ఎదురయ్యే అనుభవాల సారంగా ఈ మాటలు చెప్పారు. ఆమె ప్రేమలో మోసపోయి ఇలా బతుకు సాగిస్తున్న యువతి ఉండవచ్చు. గురుదత్ చిత్రాలలో ఇలా చెప్పకనే చెప్పే విషయాలెన్నో ఉంటాయి. పాటల ద్వారా క్యారెక్టర్ గురించి చెప్పటం అతని ప్రత్యేకత.

**యేలో మైఁ హారీ పియా, తేరీ హుయీ జీత్ రే**
**కాహే కా ఝుగ్‌డా బాలమ్, నయీ నయీ ప్రీత్ రే ॥యేలో మే॥**
**నయే నయే దో నైన్ మిలే హైఁ (2)**
**నయీ ములాకత్ హై**
**మిల్ తే హీ తుమ్ రూఠ్‌గయే జీ**
**యే భీ కోయీ బాత్ హై ॥నయే నయే॥**
**జావో జీ మాఫ్‌కియా**
**తూ హీ మెరా మీత్ రే ॥కాహే కా॥**
**హుయీ తిహారే సంగ్ చలోజీ (2)**
**బయ్యాఁ మేరీ థామ్‌కే**
**బంధే బలమ్ కిస్మత్ కీ డోరీ**
**సంగ్ తేరే నామ్ కే ॥హుయీ తిహారే॥**
**లడ్‌తే హీ లడ్‌తే మౌసమ్**
**జాయే కహీఁ బీత్ రే ॥కాహే కా॥**
**చలే కిధర్ కో బోలో బాబూ (2)**
**సప్నోఁ కో లూట్‌కే**

**హాయ్ రామ్‌జీ రెహ్ నహీఁ జాయే**
**దిల్ మేరా టూట్ కే ॥చలే కిధర్ కో॥**
**దేఖో మైఁ గాలీ దూంగీ**
**ఛోడ్ దో యే రీత్ రే ॥కాహే కా॥**



'యేలో మైఁ హారీ పియా' పాట అలిగిన ప్రియుడిని ఒప్పించటానికి ప్రేయసి పాడేపాట. టాక్సీ డ్రైవర్ అయిన నాయకుడు, అతని ప్రేయసి టాక్సీలో వెళుతుండగా వచ్చే పాట ఇది. తనను అపార్థం చేసుకున్న నాయికకు తన మంచితనాన్ని నిరూపించిన నాయకుడు ముభావంగా ఉంటే నాయిక అతన్ని మన్నించమని అడుగుతోంది.

'యేలో' అంటే 'ఇదిగో'అని. 'అందాజ్ అప్నా అప్నా 'లోని 'యెల్లో యెల్లో' పాటలో మళ్ళీ ఈ మాటను పల్లవిలో వాడారు. మజ్రూహ్ సాబ్. హారీ అంటే ఓడిపోయాను అని. జీత్ అంటే గెలుపు. ఝుగ్‌డా అంటే గొడవ. బాలమ్ అంటే ప్రియుడు.

**'ఇదిగో నేనోడిపోయా,నువ్వే గెలిచావులే**
**ఎందుకీ గొడవ ప్రియా, కొంగొత్త ప్రేమలే'**

తన తప్పు ఒప్పుకుంటూ ఆమె 'నేనోడిపోయాను, నువ్వే గెలిచావు' అంటూ అతన్ని ప్రసన్నం చేసుకోవాలని ప్రయత్నిస్తోంది. 'మనది కొత్త కొత్త ప్రేమ కదా, గొడవలెందుకు' అని బతిమాలుతోంది.

ములాకాత్ అంటే కలయిక. రూఠ్‌నా అంటే అలగటం. మాఫ్ కరనా అంటే క్షమించటం. మీత్ అంటే నేస్తం.

**'కనులిప్పుడే కలిసాయి**
**కలవగానే అలిగావు మర్యాదా?**
**పోనీలే మన్నించేశా, నువ్వే నా నేస్తంలే'**

కనులు కనులు కలిసి ప్రేమ పుట్టగానే అతను అలిగాడు. 'ఇదేమన్నా బావుందా?' అని ఆమె అడుగుతోంది. వెంటనే గడుసుగా 'పోనీలే, నువ్వు

అలిగినా నేనేమీ అనుకోను' అంటోంది. ఇలాగన్నా అతడు అలక మానుతాడేమోనని ఆమె ఆశ.

'తిహారే', 'తుమ్హారే' కు మరో రూపం. సంగ్ అంటే తోడు. బయ్యాఁ అంటే చేతులు. 'కిస్మత్ కీ డోరీ' అంటే భాగ్యరేఖ. మౌసమ్ అంటే వేళ.

**'నీకు తోడుగా నేనున్నాను**
**నా చెయ్యి పట్టుకు నడు**
**నా భాగ్యరేఖ ముడిపడింది**
**నీ పేరుతోనే ప్రియా**
**మన గిల్లికజ్జాలలో**
**వేళంతా గడిచిపోతుందేమో'**

'నీతోనే వస్తాను. నా చేయి పట్టుకుని నడిపించు, నా భాగ్యం నీతోనే ముడిపడింది' అంటోంది. గిల్లికజ్జాలలోనే సమయమంతా గడిచిపోతుందేమోనని బాధపడుతోంది. 'గొడవ పడకుండా ప్రేమించుకుందాం' అంటే అతను లొంగుతాడేమో అనుకుంది. అతను లొంగలేదు.

కిధర్ అంటే ఎక్కడికి. లూట్‌నా అంటే దోచుకోవటం. టూట్‌నా అంటే విరగటం.

**'ఎటు వెళుతున్నావో బాబూ**
**నా కలలను దోచి**
**అయ్యో రామా, విరిగిపోతుందేమో నా మది**
**చూడింక చీవాట్లేస్తా**
**వదిలెయ్ ఈ పోకడ'**

'నా కలలన్నీ దోచుకుని వెళ్ళిపోతున్నావు. నా మనసు విరిగిపోతుందేమో' అంటోంది. ఎంతకీ మాట వినక పోయేసరికి 'ఇక చీవాట్లేస్తాను. ఈ పోకడ వదిలెయ్' అని మందలిస్తోంది. 'దేఖోమైఁ గాలీ దూంగీ, ఛోడ్ దో యే రీత్ రే' అనే లైను ఎందుచేతనో ఏమో ఇపుడొస్తున్న క్యాసెట్లలో తొలగించారు.

**- పి.వి.సత్యనారాయణ రాజు**

# హిందీ సినీ సంగీతంలో మలుపులు-మజిలీలు

## 1963

నాజిర్ హుస్సేన్ నిర్దేశకత్వంలో నిర్మితమైన 'ఫిర్ వొహి దిల్ లాయా హూఁ' మ్యూజికల్‌గా హిట్ అయి ఓ.పి.నయ్యర్‌కు మంచి పేరు తీసుకువచ్చింది. ఈ చిత్రానికి సంగీత దర్శకునిగా మొదట ఎస్.డి.బర్మన్‌ను అనుకున్నారు.

ఈ చిత్రంలో ఉషా-ఆషా కలిసిపాడిన 'దేఖో బిజలి ఢోలే బిన్ బాదల్ కే' క్లాసిక్ గా నిలవటమే కాదు అప్పటికి శాస్త్రీయ సంగీతంతో ఏ మాత్రం పరిచయంలేని నయ్యర్ అంత గొప్ప ట్యూన్ ఇవ్వటం సంచలనమే! రఫీ పాడిన 'ఆంచల్ మే సజా లేనా కలియాఁ, జుల్ఫోం మేఁ సితారే భర్ లేనా', 'లాఖోఁ హై నిగాహ్ మేఁ, జిందగీ కీ రాహ్ మేఁ', 'బందాపర్‌వర్ థామ్ లో జిగర్', పాటలతో పాటు ఆశా సోలో 'ఆంఖోఁ సే జో ఉతరీ హై దిల్ మేఁ' కూడా హిట్ గా నిలిచాయి.

నవకేతన్ సంస్థ నిర్మించిన 'తేరే ఘర్ కే సామ్నే' చిత్రం కోసం ఎస్.డి.బర్మన్ అందించిన సంగీతం ఆ చిత్రాన్ని మ్యూజికల్ హిట్‌గా నిలిపింది. 'ఏక్ ఘర్ బనావూంగా తేరే ఘర్ కే సామ్‌నే'(లతా-రఫీ), 'తూ కహాఁ, యే బతా, ఇస్ నశీలీ రాత్ మేఁ'(రఫీ), 'దిల్ కా భఁవర్ కరే పుకార్'(రఫీ), 'యే తన్హాయి హాయ్ రే హాయ్ జానే ఫిర్ ఆయే'(లతా), 'దేఖో రూఠా న కరో, బాత్ నజరోఁ కి సునోఁ'(లతా,రఫీ), 'సున్ లే తూ దిల్ కి సదా, ప్యార్ సే ప్యార్ సజా'(రఫీ) పాటలు ఈ చిత్రంలోనివే!

'మేరీ సూరత్ తేరి ఆంఖేఁ' చిత్రం కోసం బర్మన్ స్వరపరిచిన 'నాచే మన్ మోరా మగన్ '(రఫీ), 'యే కిస్‌నే గీత్ ఛేఢా, దిల్ మేరా నాచే'(సుమన్, ముఖేష్), 'తేరే బిన్ సూనే నయన్ హమారే'(లతా-రఫీ), 'పూఛోఁ న కైసే మైఁనే రైన్ బితాయీ'(మన్నాడే) పాటలు హిట్ అయ్యాయి.


'బందినీ' చిత్రంలో నూతన్

'బందినీ'చిత్రం కోసం ఎస్.డి.బర్మన్ స్వయంగా పాడిన 'ఓ రే మాఝీ, ఓ మేరే మాఝీ, మేరే సాజన్ హై ఉస్ పార్' హిట్ కావటమే కాదు ఆ చిత్రంలోని 'ఓ పంఛీ ప్యారే'(ఆశా భోంస్లే), 'మోరా గోరా అంగ్ లయ్ లే'(లతా), 'అబ్ కే బరస్ భేజ్ భయియా కో బాబుల్'(ఆశా), 'ఓ జానేవాలే హో సకే తో లౌట్ కే ఆనా'(ముఖేష్) పాటలు ఎవరు మరచిపోగలరు!? ఈ చిత్రంలోని పాటలన్నింటినీ శైలేంద్ర రాసినప్పటికీ లతా పాడిన 'మోరా గోరా అంగ లెయ్‌లేయీ' గీతాన్ని మాత్రం గుల్జార్ రాశారు.

కె.ఏ.అబ్బాస్ దర్శకత్వంలో నిర్మిత మైన 'షహర్ ఔర్ సప్నా' అనే ఆఫ్‌బీట్ చిత్రం (1963 లో డా॥సర్వేపల్లి రాధాకృష్ణన్ గోల్డ్‌మెడల్ పురస్కారం పొందింది) ద్వారా జె.పి. కౌశిక్ సంగీత దర్శకునిగా హిందీ సినీ సీమలో ప్రవేశం. ఈ చిత్రంలో ఉన్న ఒకే ఒక్క గీతాన్ని అలీ సర్దార్ జాఫ్రి రాయగా క్యారెక్టర్ నటుడు మన్‌మోహన్ కృష్ణ గానం చేశారు.

'షికారీ' చిత్రం కోసం జి.ఎస్.కొహ్లి స్వర పరిచిన 'తుమ్‌కో పియా దిల్ దియా '(లతా, ఉషామంగేష్కర్), 'అగర్ మైఁ పూఛూ జవాబ్ దేగే'(లతా-రఫీ) పాటలు ఎవర్‌గ్రీన్ హిట్స్‌గా నిలిచి, ఫారూఖ్ కైసర్‌కు గీత రచయితగా చక్కటి గుర్తింపును తీసుకువచ్చాయి.


'షహర్ ఔర్ సప్నా' చిత్రంలో దిలీప్‌రాజ్

వి.శాంతారాం స్వీయ దర్శకత్వంలో నిర్మితమైన 'సెహ్‌రా' చిత్రానికి రామ్‌లాల్ సంగీతాన్ని అందించారు. 'తుమ్ తో ప్యార్ హో సజనా'(లతా-రఫీ), 'ఓ...పంఖ్ హోతే తో ఉడ్ ఆతీ రే...'(లతా), 'తక్‌దీర్ కా ఫఁసానా జా కర్ కిసే' పాటలు సూపర్‌హిట్‌గా నిలిచాయి.

'తాజ్‌మహల్' చిత్రం కోసం రోషన్ అందించిన సంగీతం చక్కటి గుర్తింపు తెచ్చుకుంది. 'జో వాదా కియా వో నిభానా పఢేగా'(లతా-రఫీ), 'పాఁవ్ ఛూ లేనే దో ఫూలోఁ కో ఇనాయత్ హోగీ'(లతా-రఫీ), 'జో బాత్ తుఝ్ మేఁ హై తేరీ తస్వీర్ మేఁ నహీఁ '(రఫీ) గీతాలను అసలు మరచిపోగలమా!?


'తాజ్‌మహల్' చిత్రంలో ప్రదీప్‌కుమార్, బీనారాయ్

అంతకుముందు ఎన్ని చిత్రాలకు సంగీతాన్నిచ్చినప్పటికీ 'దిల్ హి తో హై' చిత్రంతో రోషన్ తన రికార్డును తానే అధిగమించాడు. 'తుమ్హారి మస్త్ నజర్ గర్ ఇదర్ నహీ హోతీ... పరదా ఉఠే సలామ్ హో జాయే...'(ఆశా, మన్నాడే), 'దిల్ జో భి కహేగా మానేంగే దునియా మే హమారా దిల్ హీ తో హై(ముకేష్), 'లగా చునరీ మేఁ దాగ్ ఛుపావూఁ కైసే'(మన్నాడే), 'తుమ్ అగర్ ముఝ్‌కో నా చాహో తో కోయీ బాత్'(ముకేష్), 'తుమ్హారి మస్త్ నజర్ గర్ ఇదర్ నహీ హోతీ..(లతా, ముకేష్), 'భూలే సే మొహబ్బత్ కర్ బైఠా'(ముకేష్), 'రాజ్ కీ బాత్ హై మహఫిల్ మే కహేఁ....నిగాహేఁ మిలనే కో జీ చాహతా హై '(ఆశా), 'చురా లే న తుమ్‌కో యే మౌసమ్' (సుమన్, ముకేష్) గీతాలు సూపర్ హిట్స్‌గా నిలిచిపోయాయి. సాహిర్ లుధియాన్వి రాసిన 'చురా లే న తుమ్ కో యే మౌసమ్..' మరో గీత రచయిత మజ్రూహ్ సుల్తాన్‌పురిని ఎంతో ఇన్‌స్పైర్ చేసింది. ఆ ఇన్‌స్పిరేషన్‌తోటే కొన్ని సంవత్సరాల తర్వాత 'మమతా' చిత్రం కోసం 'ఇన్ బహారోఁ మేఁ అకేలా న ఫిరో' అనే అద్భుతమైన గీతాన్ని రాశారు.

-(వచ్చే సంచికలో మరికొంత)

# ఎలుక వచ్చె ఇల్లు భద్రం

ఇలపావులూరి మురళీమోహనరావు



30

### హెచ్చరిక

విరగబడి నవ్వితే గుండె చిక్కబట్టి ఊపిరాడక అవస్థపడేవారు కామెడీ యాక్ట్ 2003 ప్రకారం ఈ సీరియల్ చదవడం నిషేధం.

ఒకవేళ మీ పొట్ట చెక్కలైతే పత్రిక నుంచి ఎలాంటి పరిహారం రాదు. ఈ హెచ్చరిక ఈ సీరియల్ పూర్తయ్యేంత వరకు అమలులో ఉంటుంది.

### జరిగిన కథ

వెంకట్రావు, సుందరిల ఇంట్లో ఓ ఎలుక చేరి నానా రభసా చేస్తుంది. దాన్ని చంపడానికి పెట్టిన ఎలుక మందును వాళ్ల పావ రుచిచూడడంతో ఉత్తుత్తి పరీక్షల పేరిట డాక్టర్లు వేలాది రూపాయలు ఖర్చు పెట్టిస్తారు. ఎలుకను చంపడానికి పిల్లిని తెస్తే పిల్లికూనలు పెడుతుంది. వాటిలో ఒకటి చస్తుంది. ప్రాయశ్చిత్తం అంటూ తూతూమంత్రాలతో పురోహితుడు దోచుకుంటాడు. ఈ కష్టాలన్నిటికీ వాస్తు సరిగ్గా లేకపోవడం కారణమంటూ వాస్తుపండితులు భయపెడతారు. పేకాట వ్యసనపరుడైన సుందరి దూరపు బంధువు వక్రతుండం కోర్టుపనిమీద వీరింటికి వస్తాడు.

**(ఇక చదవండి)**



"మీరో విషయం గమనించండి. పదిమంది ఆడుతుంటే ఒక్కొక్కడికి రెండు వైపులా ఇద్దరు కూర్చుని చూస్తుంటారు. ఆడేవాళ్ళకంటే వీళ్ళ టెన్షన్ మరీ ఎక్కువగా ఉంటుంది. ఏ ముక్కతీసుకోవాలో, ఏ ముక్కవెయ్యాలో ఆడేవాడికంటే ముందు వీళ్ళు గ్రహిస్తారు. తామనుకున్న ముక్క తీసుకుంటాడా... వేస్తాడా... అని ఎంతో ఉద్వేగంగా ఎదురుచూస్తుంటారు. ఆటగాడు తామనుకున్న ముక్కవెయ్యకపోతే వాడినో శుంఠగా భావిస్తుంటారు. పురాణాల కాలం నుంచీ ఉన్న ఇటువంటి క్రీడలను అపహాస్యం చెయ్యరాదు. భారతంలో కూడా ద్యూత 'క్రీడ' అనే అన్నారు".

"బాబాయ్....ఇక ఆ పేకాటగోల ఆవు. లేకపోతే ఆ పిచ్చి ఆయనకు కూడా అంటుకుంటుంది" విసుక్కుంది సుందరి.

"రామ రామ రామాయణమంతా విని

రాముడికి సీతేమౌతుంది అని అడిగినట్లుంది. ఇంత చెప్పినా మళ్ళా పేకాటను పిచ్చే అంటుంది. అమ్మాయి" నవ్వాడు వక్రతుండం.

"పేకాట గురించి మీరో థీసిస్ రాయచ్చు. అయితే మామయ్యగారూ. ప్రస్తుతం మీకేదైనా ఆస్తి మిగిలిందా?" నవ్వుతూ అడిగాడు వెంకట్రావు.

"ఇవిగో..నిమ్మకాయను నిలబెట్టగల ఈ మీసాలే ప్రస్తుతం నా ఆస్తి. ఏదో నాలుగూళ్ళలో వాస్తు చెప్పుకుంటూ బండీడుస్తున్నాను. చిన్నప్పుడే వాస్తు శాస్త్రాన్ని క్షుణంగా అధ్యయనం చెయ్యడం ఇపుడు నా పాలిట వరప్రసాదమైంది" మీసాలను మెలిబెడుతూ అన్నాడు వక్రతుండం.

"మరి ఇంటి నంగతేం చేద్దామంటారు?" అడిగాడు వెంకట్రావు.

"అమ్మేసేద్దాం. ఇన్ని వాస్తులోపాల ఇంట్లో ఉండి నరకబాధలనుభవించేకన్నా నాలుగైదు వేలు పోసి అయినా అద్దెఇంట్లో ఉండటం ఉత్తమం. ఆ నంగతి నాకొదిలెయ్యండి" అన్నాడు వక్రతుండం.

ఇంతలో "సుందరీ..సుందరీ.." అని పిలిచింది అండాళమ్మ.

"ఏమిటండీ..." పెరట్లోకి వెళ్ళి అడిగింది సుందరి.

"ఇల్లు అమ్మకానికి పెట్టారా? అమ్మేట్లయితే మాకు చెప్పండి. మా తమ్ముడికి ఒక ఇల్లు కావాలట. మీ ఇల్లయితే మరీ హాయి. మాకు దగ్గర్లో తోడునీడగా ఉంటాడు" అన్నది అండాళమ్మ.

సుందరి ముఖం ఎర్రబడింది.

"ఇల్లు అమ్ముతున్నామా ? ఎవరు చెప్పారు మీకు?" కోపాన్ని నిగ్రహించుకుని అడిగింది.

"అదే....మీరు చెప్పుకుంటున్నారుగా...."

"అంటే ..ఇందాకట్నుంచీ గోడ దగ్గర నిలబడి మా మాటలన్నీ వింటున్నారా?"

"అబ్బెబ్బె...అదేం లేదు సుందరీ..ఈ దువ్వెన నిండా మట్టిచేరింది. పిన్నీసుతో శుభ్రం చేస్తూంటే ఏదో...ఇల్లు అమ్ముతున్నట్లుగా అర్థమైంది. మీరీ మధ్య చాలామంది వాస్తు పండితులకు ఇల్లు చూపిస్తున్నారుగా. అందువల్ల వాస్తు బాగాలేదని అమ్ముతున్నా రనుకున్నాను".

"ఇల్లమ్ముకోవలసిన ఖర్మ మాకేం పట్ట లేదు. కావాలనుకుంటే మరో ఇల్లు కొనుక్కోగలం" కోపంగా అన్నది సుందరి.

"కోప్పడకు సుందరీ. ఇరుగుపొరుగు వాళ్ళం ఆ మాత్రం ఒకరికొకరం సాయం చేసుకోకపోతే ఎలా? మీరు మళ్ళా వాళ్ళను వీళ్ళను అడగడం, పేపర్లో ప్రకటనలివ్వడం, దేనికి శ్రమ? మేమైతే డైరెక్టు హ్యాండ్ క్యాష్ ఇచ్చి రిజిస్ట్రీ చేయించుకుంటాం" అన్నది అండాళమ్మ.

వెంకట్రావుకు రగిలిపోయింది.

"ఎంతకు కొంటారు?" అడిగాడు ఆవేశాన్ని అణుచుకుంటూ .

"మూడు లక్షలకైతే మావాడు సిద్ధంగా ఉన్నాడు"

"మేము ఆరు లక్షలు పోసి కట్టించాం".

"నిజమే అనుకోండి, కానీ వాస్తులోపాలు చాలా ఉన్నాయి కదా! వాటన్నిటినీ మేం బాగుచేయించుకుంటే అంత అవుతుంది".

"సర్లెండి. మేము ఎవరికీ అమ్మదల్చు కోలేదు".

"దాన్దేముంది తమ్ముడూ. కానీ అమ్మేటపుడు మాత్రం మాకే చెప్పండి". లోపలకు వెళ్ళింది అండాళ్ళమ్మ.

"పొరుగువాళ్ళు ఏదైనా అమ్ముకుంటు న్నారంటే ఎంత సంతోషమో చూడండి దీనికి. వ్యవహారం మాట్లాడుకునేటప్పుడు చిన్నగా మాట్లాడుకోవాలి. అందుకే గోడకు చెవులుంటాయి అంటారు పెద్దలు" అక్కసుగా అన్నది సుందరి.

"గోడకు చెవుల సంగతేమో కానీ దీని రెండు చెవులు మన గోడలోనే ఉంటాయి. దీని చెవుల్లోని కర్ణభేరులు మహా సునిశితమైనవి. పోలీసుకుక్కలు ఆమడ దూరంలోని వాసనను సైతం పసిగట్టినట్లు మనం మనసులో ఆలోచించుకుంటున్నా దాని చెవులకు వినపడుతుంది" కోపంగా అన్నాడు వెంకట్రావు.

"మీరు మాత్రం భలేగా నమాధానం చెప్పారు" మెచ్చుకుంది సుందరి.

"మరి! నాకు కోపం వస్తే అంతే! ఎటువంటి వారినైనా లెక్క చెయ్యను. నాకు ఆఫీసుకు టైమవుతున్నది. ఏమైతే అదౌతుంది. అంతగా ఏదన్నా అయితే మరో ఇంట్లోకెళ్ళి అద్దెకుందాం. ఇల్లమ్మే ప్రసక్తి లేదు" అన్నాడు వెంకట్రావు.

* * * *

వాకిట్లో నిలుచుని పేకముక్కల్ని కలుపుతున్నాడు వక్రతుండం.

"సిటీ అంతా భ్రష్టుపట్టిపోతున్నది. నేనువచ్చి మూడుగంటలు దాటినా పేకాడటానికి ఒక్కవెధవా దొరకడం లేదు. ఏం చేస్తుంటారో ఏంటో అంట్ల వెధవలు" అనుకుంటున్నాడు.

దూరంగా విజిల్ సౌండు వినిపించింది. అటువైపు చూశాడు. ఎదురింటి ఆనందరావు సైగలు చేస్తూ రమ్మంటున్నాడు.

'ఏమిటీ' అన్నట్లు చూశాడు వక్రతుండం.

"ఒక్క ముక్క వినిపోండి" అన్నాడు ఆనందరావు. వక్రతుండం చెవుల్లో అమృతం పోసినట్లుయింది.

"ఓ యస్.... ఒక్కముక్కేం ఖర్మ. మూడు ముక్కలు, పదమూడు ముక్కలు..ఏదైనా సరే...చేతులు ఒకటే దురదపుడుతున్నాయి. మూడుగంటల పాటు పేకాడకుండా నా జీవితంలో ఎన్నడూ గడపలేదు" వెళ్ళి అన్నాడు వక్రతుండం.

నవ్వాడు ఆనందరావు.

"నేను చెప్పేది ఆ ముక్కల సంగతి కాదండీ... నా ఉద్దేశ్యంలో ఒక్క చిన్నమాట అని అర్థం" అన్నాడు.

" చెప్పండి" అన్నాడు వక్రతుండం.

"వెంకట్రావుగారికి మీరేమౌతారు?"






"ఏమౌతానా? సాక్షాత్తు మామగారిని"

"అలాగా....మీ అల్లుడుగారు ఇల్లమ్మే ప్రపోజల్ ఏదో పెడుతున్నారని తెలిసింది. దేనికండీ"?

"ఏం చేస్తాం? అంతా ప్రారబ్ధం. ఇంటినిండా పుట్టెడు వాస్తులోపాలు. నానా ఇబ్బందులు పడుతున్నాడు. మనిషికి బోలెడంత అభిమానం. సాక్షాత్తు సుయోధనుడే. 'మామయ్యగారూ... ఆర్థిక ఇబ్బందులు తట్టుకోలేకపోతున్నాను. కొంచెం దగ్గరుండి అమ్మిపెట్టండీ' అని పిలిపించాడు. అప్పటికీ నేను చెబుతూనే ఉన్నాను-అల్లుడూ కావాలంటే నేనో పది లక్షలిస్తాను. ఇల్లు బాగుచెయించుకోవయ్యా అని. వింటేగా. .ఏదీ ఒక సిండికేట్ వేద్దామా?" ముక్కలు కలిపాడు వక్రతుండం.

"లేదండీ...నాకలవాటులేదు. ఎన్నాళ్ళ నుంచో సొంతిల్లు ఏర్పరచుకోవాలని కోరిక. ఒకవేళ ఇల్లు అమ్మేట్లయితే..."గొణిగాడు ఆనందరావు.

"మీకు వాస్తుల మీద నమ్మకం లేదా? మనం ఆడుకుంటూ మాట్లాడుకోగూడదూ.."

"ఇదివరకోసారి ఈ వ్యవహారంలో సొంతిల్లు అమ్ముకున్నానండీ... జన్మలో ముక్కపట్టుకోగూడదని మా అమ్మగారి మీద ప్రమాణం చేశాను. ఇంతకూ మీ అల్లుడుగారిల్లు...ఇక వాస్తుదేముంది?ఎలా రాసి పెడితే అలా జరుగుతుంది".

"హి..హి..హి..అదీ నిజమేననుకోండి. మీ అమ్మగారేరీ... కనిపించరేం?"

"ఆమె కనిపించరండీ"

"అదేం పాపం? వృద్ధాశ్రమంలో చేర్చారా? లేక తప్పిపోయారా?"

"అదేం కాదండీ.. చచ్చిపోయారు".

"అయితే ఇంకేం! మీ ఒట్టు కూడా చచ్చిపోయినట్లే. రండి ముక్కలు పంచుకుని మాట్లాడుకుందాం. పాయింటుకు పది రూపాయలే!"

"అంటే కౌంటుకు వెయ్యిరూపాయలు! నా వల్లకాదు. పాయింటుకు అరపైసా పెట్టుకుందాం".

"అరపైసానా? ..ఛీ....ఛ...అంటే ఫుల్ కౌంటుకు అర్ధరూపాయా! ఈ జన్మంతా అవిశ్రాంతిగా ఆడినా ఎవరికీ రూపాయి రాదు. కనీసం కాలక్షేపం కోసం ఆడినా రూపాయి పెట్టుకుందాం."




"మరి ఇల్లు..."

"డోన్ట్‌వర్రీ...ఇల్లు మీకే ఇప్పిస్తా.... సరేనా... ఇక పదండి ఆగలేను" చాపమీద కూర్చున్నాడు వక్రతుండం.

మధ్యాహ్నం దాకా ఆడారు. వక్రతుండం ఒక్క ఆటకూడా గెలవలేదు. ఐదువేల రూపాయలు ఓడిపోయాడు.

"ఇక మీరు డబ్బులిస్తే ఆట కంటిన్యూచేద్దాం. నేను గతంలో కూడా ఇలా గెలిచుంటే ఇంటి మీద మరో అంతస్తు వేసుండేవాడిని. చూస్తూంటే నాకు శుక్ర మహర్దశ వచ్చినట్లు కనిపిస్తున్నది" ఉత్సాహంగా అన్నాడు ఆనందరావు.

"డబ్బుదేముందండీ వెధవడబ్బు. ఇంతకూ మీకు ఇల్లు చవగ్గా కావాలి. అంతే కదా!" ముక్కలను డబ్బాలో పెడుతూ అన్నాడు వక్రతుండం.

"అంతేనండీ... జేబులో చిల్లర కూడాలేదు. మీరా డబ్బిస్తే అలా రైతు బజారు కెళ్ళి కూరలు తెచ్చుకుంటాను".

"మా ఊరు వెళ్ళగానే డిమాండ్ డ్రాఫ్ట్ పంపుతాను".

"అంటే డబ్బుల్లేకుండా ఆడారా? వస్తే దొబ్బుదామని" కోపం వస్తున్నది ఆనందరావుకు.

"రోజుకు పాతికవేలు ఖర్చుపెట్టే స్థోమతనాది. అయిదువేలు అనేది హోటల్లో నేనిచ్చే టిప్పులాంటిది. రైల్లో వచ్చాను కదా. దొంగల భయంతో తీసుకురాలేదు. వెళ్ళగానే పంపిస్తాలెండి కొరియర్లో".

ఆనందరావు కళ్ళు ఎర్రబడ్డాయి." జీవితంలో మొదటిసారిగెలిచాను. డబ్బు కక్కకపోతే కీళ్ళు విరుస్తాను" అన్నాడు కోపంగా.

"అపుడు పోలీస్ కంప్లెయింటిస్తాను. పేకాటలో గెలిచిన డబ్బులిప్పించమని ధైర్యముంటే పోలీసులకు చెప్పండి. మీరు కొట్టిన దెబ్బలు స్పష్టంగా కనిపిస్తాయి కాబట్టి పొరుగూరి వ్యక్తి మీద హత్యాప్రయత్నం చేసినందుకు కనీసం మూడేళ్ళు పడుతుంది కఠిన కారాగారం- కొట్టండి.." ధీమాగా అన్నాడు వక్రతుండం.

నీరుగారిపోయాడు ఆనందరావు. అది గమనించి నవ్వాడు వక్రతుండం.

"చూడండి...ఆరులక్షలు ఖరీదు చేసే ఇల్లు. నాలుగుకిప్పిస్తాను. కనీసం రెండు లక్షలు అడ్వాన్సు ఇవ్వండి. మిగిలింది రిజిస్ట్రారు ఆఫీసులో ఇద్దురుగాని. నాకు నీతినిజాయితీలే ప్రాణం. మీకివ్వాల్సిన ఐదువేలు దాన్లో జమ వేసుకోండి. ఏవంటారు?" అన్నాడు.

"అంత డబ్బులేదు. లక్షైతే ఇవ్వగలను. బ్యాలెన్సంతా లోన్ రాగానే ముద్దర శుద్ధిగా ఇస్తాను. ఒక్కసారి మీ అల్లుడు గారితో కూడా చెప్పి.."

"భలేవారే, మామగారు చెబితే ఒకటి అల్లుడు చెబితే ఒకటీనా? మా అల్లుడికి అభిమానం ఎక్కువ. దాన్లో అతనితో పోల్చదగినవాడు కలియుగంలో లేడు. ద్వాపరయుగంలో సుయోధనుడొక్కడే అతనికి సాటి. ఇల్లు అమ్ముకుంటున్నామని చాలా సిగ్గుపడుతున్నాడు".

"అలా అయితే సరే... రేపు సాయంత్రంలోగా అడ్వాన్సు ఇస్తాను. వారం రోజుల్లో రిజిస్టర్ చేయించాలి" లేచాడు ఆనందరావు.

-(ఇంకావుంది)

మే 20 సిరివెన్నెల సీతారామశాస్త్రి గారి జన్మదినాన్ని పురస్కరించుకుని......



# సిరివెన్నెల గురించి చిరు చంద్రుడు



నాకు తెలీకుండానే నా తొలి సినీగీతం 'మంచుకొండల్లోని చంద్రమా'ని ముప్పలనేని శివగారు సీతారామ శాస్త్రి గారికి వినిపించారు.

నేనెవరో తెలీకుండానే నా పాట విని అందులో నా పదబంధాలని, భావ వ్యక్తీకరణ శైలిని ఆయన ప్రశంసించారు.

యిది శాస్త్రిగారికి, నా (పాట)కు జరిగిన మొట్టమొదటి పరిచయం.

అంతకుముందే "మనీ" సినిమాలోని 'చక్రవర్తికి వీధి బిచ్చగత్తెకి', 'వారెవ్వా ఏమి ఫేసు', 'అనగనగా', 'ఆరుకోట్ల ఆంధ్రులు' .... పాటలన్నీ విన్నాను. వాటిల్లోని లాలిత్యం, నిరాడంబరత, ముక్కుసూటితనం, హాస్యం... యివన్నీ నాకు స్ఫూర్తినిచ్చాయి. పాటలు రాయడానికి నన్ను పురికొల్పాయి. తీరా రాయడానికి పూనుకుంటే అప్పుడు తెలిసింది వాటిలోని తాత్విక చింతన ఏంటో.

సున్నితంగా కనిపిస్తూనే గాఢమైన - తీవ్రమైన - లోతైన భావాలను పలికించడమెలాగో నేర్చుకునేందుకు అది నాకు అప్పుడు తొలి పాఠమైంది... యిప్పటికీ !!

వ్యక్తి తనలోని 'అంతర్వాణి'ని గ్రహించగలిగినప్పుడు మాత్రమే 'కళ' సాక్షాత్కరిస్తుంది. 'అంతర్వాణి' సత్య స్వరూపిణి. ఈ సత్యంలోని ఏకత్వం మనుషులందరినీ ఒక్కటి చేస్తుంది. కవి రాసే కవిత్వంతో ప్రజలు (ప్రేక్షకులు + శ్రోతలు) ఏకీభవించి వాళ్ల వాళ్ల అనుభవాలను వాటిల్లో వెదుక్కోడానికి, వెదుక్కొని సంబర పడ్డానికి కారణం అదే.

శాస్త్రి గారిలో ఈ అంతర్వాణి-అంతర్వాహినిగా ప్రవహిస్తూ వుంటుంది. ఆ ప్రవాహంలోని ఏ మూల నుంచైనా , ఏ పార్శ్వం నుంచైనా ఏ ఒడ్డు నుంచైనా సరే ఆ గీతా స్రవంతిలోని స్వచ్ఛతను, చల్లదనాన్ని, సత్యాన్ని చవి చూడవచ్చు.

ప్రస్తుతం వున్న కవులందరిలో ఎక్కువ నిర్మొహమాటం,ఎక్కువ ఆత్మవిశ్వాసం, ఎక్కువ నిక్కచ్చితనం ఉన్నది ఒక్క శాస్త్రి గారిలోనే !

ఎవరికీ భయపడరు, ఎప్పుడూ తలవంచరు, ఏ పరిస్థితికీ జడవరు.

వున్నది రాస్తారు. అనుకున్నది చెప్తారు, మనసైనది చేస్తారు.

మంచి పాటలను బహిరంగంగానే మెచ్చుకుంటారు.

ఆయనకు మంచి అనిపించని దాన్ని గురించి రహస్యంగా చీవాట్లేస్తారు.

అష్టనందులిచ్చిన అధికారంతో కాదు, అంతకు మించిన అభిమానంతో.

కవి నిరంకుశుడు- అన్నది శాస్త్రిగారి విషయంలోనే 'నిజం'!!

చేసే పనిలో నిరుత్సాహం, రాసే పనిలో భయాందోళనలు కలిగినప్పుడు శాస్త్రిగారి నీడన సేద తీర్చుకుని అనవసరమైన గాలి ధూళులను వదలగొట్టుకుని ఉరకలేసిన సందర్భాలు ఓ ఐదూ, ఆరూ....

కవి- మాంత్రికుడు కూడా !!!

'ఎన్నో రంగుల తెల్లకిరణం' చదివాను.

కవి కవే కాదు. రచయిత కూడా !!!!

బ్రతుకు, భయం, కోరిక, ఆశ, ఓటమి,సంపద, ఏకాంతం, అన్నిటిగూర్చి, ఆర్ష ధర్మాల గూర్చి వ్యాసాలు రాయడం పూర్తైతే శాస్త్రిగారిలోని సంపూర్ణ తాత్వికుడిని దర్శించి తరించే తరుణం ఆసన్నమైనట్టే.

బెత్తం పట్టుకుని కూర్చుంటారు శాస్త్రులవారు-తప్పులు చేయకుండా!!

శాస్త్రి గారూ ! మీరలా వెయ్యేళ్లూ కూర్చోవాలని ముక్కోటి దేవుళ్లకు మొక్కుకుంటూ...

మీ శిష్యపరమాణువుల్లో
పాదరసం
**చంద్రబోస్**

# సిరివెన్నెల సీతారామశాస్త్రి హిట్స్

## చిత్రం : నువ్వేనువ్వే

సంగీతం:కోటి గానం:కె.కె.

ప: అయామ్ వెరీ సారీ అన్నాగా వందోసారి
సరదాగా నవ్వేసెయ్ ఒకసారి
అయామ్ వెరీ సారీ అన్నాగా వందోసారి
సరదాగా నవ్వేసెయ్ ఒకసారి
హాయో హాయో హాయో పెదాలలా బిగించి శపించకే మరీ
మంత్రాలవీ జపించి వదిలెయ్ క్షమించి
అరె పాపం - చిరుకోపం - నిజమేనా - మేకప్పా
అరె పాపా సారీ చెప్పా ఓ మై గోల్డెన్ చేపా
ఫారెక్స్ బేబీ ట్రైపా లౌలీ లాలి పాప్పా ॥అయామ్ వెరీ॥
చ: తరిమి తరిమి తరిమి నిను ఏడిపించడం
ఎందుకా అని అడిగావనుకో చెబుతా వింటావామరి (2)
సమ్మర్ గిమ్మర్ వింటర్ అంటూ
ప్రతీ ఋతువుకో డిఫరెన్సూ
ఉన్నప్పుడే కద బావుంటుంది
చిరునవ్వు తప్ప నీ ఫేసుకెప్పుడూ మరో కలర్ రాదా
అని డౌటుపుట్టి అదె తీర్చుకుందుకే
తమాషాగా ట్రైలేసి చూసానే బేబీ...
అయామ్ వెరీ సారీ అన్నాగా వెయ్యోసారి
సరదాగా నవ్వేసెయ్ ఒకసారి...
చ: లిప్‌స్టిక్ అవసరమైనా లేనంత
ఎర్రగా పెదవివుందిగా
కందే వరకూ కొరికి తెగ హింసించకే (2)
టొమేటో పళ్ళకి డూపుల్లా
సుమారు సిమ్లా యాపిల్లా
వున్నావే పిల్లా నువు నిలువెల్లా
నీ బుంగమూతిలో పొంగనీయకే బుగ్గలు బర్గర్లా
నన్నుండనీక ఊరించిటే అవి
నిజం చెప్పు నీ తప్పు కాదా అది... ॥అయామ్ వెరీ॥

## చిత్రం : అడవిరాముడు (ప్రభాస్ హీరో)

సంగీతం: మణిశర్మ గానం: మల్లికార్జునరావు

ప:నగరంలో ఈ పూట వినిపించే నా పాట
నట్టడవి తల్లి ఒడిలో పుట్టింది పసిడి కలతో
ఎన్నెన్నో ఆశలను తెచ్చింది తనతో
అట్టడుగు మట్టి బడిలో - మొదలైన చదువు మీతో
చేయూతనిచ్చి నడిపించండీ దయతో
మొక్కై మిగిలిపోకు అంది - దిక్కులు దాటి ఎగరమంది
రెక్కలు గట్టి అడవి నన్నే పంపిందీ
ఎంతో పెద్ద లోకముంది - ఏదో విద్య నేర్పుతుంది
ఎన్నో అనుభవాలు పొంది రమ్మందీ ॥నగరంలో॥
పాలనవ్వుల పసితనం - వదిలేసి ఎదిగిన యవ్వనం
పల్లేరు ముళ్లకు పరిచిన బాటవదా
జాలి తెలియని భుజబలం
చేలన్ని ముంచే నదిజలం
కన్నీటి జల్లులు కురిసే వానవదా
మనసుని పెంచలేని జ్ఞానం
మనిషిగ ఉంచలేని ప్రాణం
బ్రతుకును నడపలేని పయనం అయిపోదా ॥మనసుని॥నగరంలో॥
ఆదికవిగా నిలిచిన
ఆ బోయ వాడిని మలచిన
విద్యాలయం ఓ కారడవే కాదా
సేతువును నిర్మించిన
ఆ కోతిజాతికి తెలిసిన
విజ్ఞానమంత నగరం నేర్పిందా
మెదడుకు చెదలు పట్టకుంటే
హృదయం అద్దమల్లె ఉంటే
చాలని తెలుసుకొన్న తెలివే చదువంటే ॥మెదడుకు॥

## చిత్రం : నాని

సంగీతం: ఏ. ఆర్. రెహమాన్ గానం: యస్.పి.బాలు,సుజాత,బృందం

ఆ: పుస్తకమంటు లేని తొలి చదువిది
బృ: వెచ్చగ నేర్చుకుంటావా
ఆ: ముద్దుగ నేర్పుతాను కద మరి నువు
బృ: వెచ్చగ నేర్చుకుంటావా
ఆ: నిద్దరమాని కష్టపడదామిక
బృ: రావా ॥పుస్తక॥
ఆ: చక్కెర ఎక్కడ నక్కిన కనిపెట్టవ చీమలు రక్కున॥చక్కెర॥
ఏం చెప్పినా ఏం చూపినా ॥2॥
నువు చుట్టు ముట్టవేమి గభుక్కున ॥చక్కెర॥
అ: ఇంతకు ముందర నాకెవరూ చెప్పలేదు ఈ సంగతులు
కొద్దిగ నేర్పితె చాలసలు చూపుతాను కద చక చక నా జోరూ
బృ: వెచ్చగ నేర్చుకుంటావా
అ: చక్కెర ఎక్కడ నక్కిన
బృ: వెచ్చగ నేర్చుకుంటావా
అ: కనిపెట్టివ చీమలు రక్కున
బృ: వెచ్చగ నేర్చుకుంటావా
అ: చక్కెర ఎక్కడ నక్కిన కనిపెట్టవ చీమలు రక్కున
ఏం చెప్పినా ఏం చూపినా ॥2॥
వచ్చి పట్టుకో మనకే చటుక్కున
ఆ: గట్టు దిగను అంటూంటే ఈతంటూ వస్తుందా
లోతెంతో నది చెబుతుందా
చెట్టు ఎక్కలేనంటే పండుకు జాలేస్తుందా
నీ ఒళ్ళో తను పడుతుందా
అ: ఇక్కడ చల్లని నీళ్ళుంటే ఏ నదిలో నే దూకాలి
పళ్ళెం నిండుగ పళ్ళుంటే చెట్టెందుకు నే ఎక్కాలి
ఆ: నీళ్లకు ఆర్పలేని నిప్పందని
బృ: వెచ్చగ నేర్చుకుంటావా
ఆ: కళ్లకు తీర్చలేని ఆకలి కద
బృ: వెచ్చగ నేర్చుకుంటావా
ఆ: నిద్దరమాని కష్టపడదామిక
బృ: రావా ॥చక్కెర॥
ఆ: ఒకటి ఒకటి కలిపేస్తే ఒకటే అవుతుందంటా
ఆ లెక్కిపుడే మొదలంటా
పెదవి పెదవి కాటేస్తే పెదవులకేం కాదంటా
ఎదలోనే పెరుగును మంటా
అ: ఇప్పటికిపుడే పాడుపుకథ విప్పాలనిపిస్తుందీ
ఇక్కడిక్కడ ఆ సరదా చూడాలనిపిస్తుందీ
ఆ: అందుకు మంచి దారి వున్నది కద
అ: వెచ్చగ నేర్చుకుందాం రా
ఆ: మన్మథమంత్ర మొకటి తెలియాలట
అ: వెచ్చగ నేర్చుకుందాం రా
ఆ: కౌగిలి లోనే నేర్పగల చదువిది
అ: రావా
బృ: చక్కెర ఎక్కడ నక్కిన కనిపెట్టవ చీమలు రక్కున



# ఆయన పాటలు పారిజాత పల్లవాలు

**ఏ కలములో చేరితే స్వరము సాహిత్యమౌతున్నదో**
**ఏ కవితలో చేరితే పదము పాండిత్యమౌతున్నదో....**
అంటే టక్కున అందరికీ స్ఫురించే మూర్తి....
సిరివెన్నెల సీతారామశాస్త్రి..
మా గురువుగారు...
**'కవనార్థంబుదయించితిన్, సుకవితా కార్యంబె నా వృత్తి..'**
అని చెళ్లపిళ్ల వేంకట శాస్త్రిగారన్నట్లు...
మా గురువుగారు కూడా కవిత్వం కోసమే పుట్టేరనిపిస్తుంది.
తెలుగు సినిమా పాటలో కవిత్వాన్ని బతికించడానికే
పుట్టేరనిపిస్తుంది.
అదే మాటకి కట్టుబడి'**పాట**'యాత్ర సాగిస్తున్నారు.
తెలుగు సినిమా పాటలో తెలుగు
'**పెనుచీకటికవ్వలి వెలుగు**'లాగ అనిపిస్తున్న రోజుల్లో
తెలుగు నుడికారపు మెరుపుల్ని, కవిత్వపు జిలుగుల్ని...
అద్దుకొని మరీ మన ముందుకు వచ్చింది..
శాస్త్రిగారి '**పాటపుంత**'..
నిజంగా అప్పట్లో ఇదో వింత..
ఇప్పటికీ వింటూంటే ఏదో నిశ్చింత..!
**'నా ఉచ్ఛ్వాసం కవనం... నా నిశ్వాసం గానం'**..అని
నొక్కి మరీ వక్కాణించిన కవి మా గురువుగారు.
ఒకప్పుడు ఆయన **భరణి**...
కానీ ఎప్పుడూ ఆయనది భారీవాణి, భారీ బాణీ...
వెరసిపాటల మేజువాణి..ద్రుహిణ గృహిణి కాళ్ళపారాణి...
వరవీణా మృదుపాణి ఆయన కలలరాణి...
ఆ కలికి చూపుల కలిమి ఈ కవితల మాగాణి..
ఆయన పాట ఒకసారి భాద్రపదంలో భాగీరథి లాగ ప్రవహిస్తుంది....
మరోసారి హేమంతంలో హిమఖండంలాగ అనిపిస్తుంది...
ఒకసారి వాసంతికా క్రతున్యాస హవిర్ధామ
లతాగ్రం లాగ లాస్యం చేస్తుంది..
మరోసారి మరకత మృదు శాద్వలస్ఫురత్
కుశాగ్రం లాగ గాయం చేస్తుంది..
ఒకసారి మూగమనసుల ప్రేమ కావ్యంలాగ అనిపిస్తుంది....
ఇంకోసారి మౌని మహసుల వేద సౌధం లాగ అనిపిస్తుంది...
ఆయన పాట ఒక్కోసారి మాటంత సహజంగా అనిపిస్తుంది..!
ఆవేశం నిండినప్పుడు ఆయన కళ్ళు...
అగ్నికణాల్లాగ తళ తళ మంటాయి...
అభిమానం పొంగినప్పుడు..
శ్రావణ మేఘాల్లాగ తడితడిగా ఉంటాయి..!

ఆయన పాటలో
వేదన ఉంటుంది...శోధన ఉంటుంది...
ఆరాధన ఉంటుంది.. ఆక్షేపణ ఉంటుంది...
స్థాయి ఉంటుంది.. హాయి ఉంటుంది..
రాగం ఉంటుంది..వేగం ఉంటుంది..

ఈ వేగమే ఈ వేదనే ఆయన కవిత్వానికి ప్రాణం..!
ఏ అనుభూతికి ఏ రాగమో...ఏ తాళమో...ఏ వరసో....ఏ విరుపో...
ఎక్కడ ఏ నొక్కో... ఏ ఒదుగో ఆయనకి బాగా తెలుసు!
**'ప్రతి కవికీ తన ప్రత్యేక ధ్వని ఉండాలి, లేకపోతే ప్రతిధ్వని అవుతాడు'**
అని కృష్ణశాస్త్రి అంటాడు.
అందుకే మా గురువుగారిది ప్రత్యేక ధ్వని..! సరస కవితా రసధుని..!!
పాటలో పద విన్యాసం మీద కన్నా ప్రౌఢత్వం మీద, భావుకత్వం మీద
గురువు గారికి మమత ఎక్కువ...
అందుకే చాలా మందికి ఆయన పాటలంటే మక్కువ..
ఆయన కవితా ధార మన మనస్సుల్ని ఒడిసిపట్టుకొని
ఎటో లాక్కొని పోతుంది...
ఆయన పాటలో పడి దిగులు పడిపోము...అలసిపోము...
ఆ మధురానుభూతిని అసలు మరిచిపోము..
అందుకే ఆయన పాటలు పారిజాత పల్లవాలు..
చినుకుతడికి చిగురు తొడిగిన చెంగల్వలు...
బతుకుబడిని చెలిమి పంచు చేమంతులు..
మనసుపుటల్లో దాచుకున్న జ్ఞాపకాల గులాబులు..!!!

గురువుగారికి జన్మదిన శుభాకాంక్షలతో....

**- కులశేఖర్**



**రచన: వేటూరి సుందరరామమూర్తి** (1) **గానం : టిప్పు**

ప: స్వప్నా - వాస్తవదత్త-అప్నీ - జాన్‌కి రిష్తా
సత్తామీకే చూపిస్తా
స్వర్గం - నేలకు తెస్తా - శబ్దం - బొమ్మను గీస్తా
సర్వం సొంతం అనిపిస్తా
ఆకాశం నీ హద్దు- అవకాశం వదలొద్దు
నేడే నీ సరిహద్దు-రేపంటూ గడపొద్దు
సరదాలకు పరదా వెయ్యొద్దు... ॥స్వప్నా॥

చ: రంగులన్ని కలబోస్తే రంభ అవుతుందిరా
రంభ రాకతో పగలే రాతిరవుతుందిరా
మచ్చతో అచ్చుపడ్డ జాబిలే వెచ్చన
ముచ్చటే గిచ్చుకుంటే తెచ్చుకో నిచ్చెన
లబ్ డబ్ దరువుల గప్‌చిప్ గొడవల
లైఫే నాట్యం రా......
చిక్ బుక్ నడకల చక్ చక్ పరుగుల
రైలే నేస్తం రా......
కలలోన నువ్వె కనుపాప......అల ఊయాలూగే చిరుచేప
పనికోసమింత పడిగాపా- పరిచెయ్యి బ్రతుకనే చాప
దర్జాగా మీర్జాగాలిబ్‌గా..... ॥స్వప్నా॥

చ: డుమువులు కలిపేస్తే తెలుగు పుట్టిందిరా
తెలుగు పాటతో ఎదలో తేనె కురిసిందిరా
కూచిపూడి ఒడిలోనే మెరుపు మెరిసిందిరా
మువ్వమువ్వలో నటనే మేను విరిచిందిరా
పొగరస్ ఉడుకులు-విగరస్ వయసుల
నడకే ట్రై చెయ్యిరా....
సిలబస్ చదువుల ......చిక్‌లెట్ పెదవుల
పలుకే విడిచేయ్‌రా .......
వదిలెయ్యి పాతపిడవాదం
కలలింక చెయ్యి అనువాదం
గురిచూసి పెట్టు కుడిపాదం
గెలిచెయ్యి బ్రతుకనే పందెం
కాశ్మీర్లో కార్గిల్ హీరోలా ॥స్వప్నా॥

**రచన: ధర్మతేజ** (2) **గానం: సుజాత**

ప: పూలజల్లువై తేనెవెల్లువై
వెండివెన్నెలై నిండుజాబిలై నన్నల్లుకో
చల్లగాలివై పిల్లవాగువై
సన్నజాజులా కన్నె మోజులె వెదజల్లుకో
పరుగెత్తె నా మనసు పురివెప్పే వేళ
పరువాలు పులకించి పదునెక్కేవేళ
కలలన్ని నిజమే చేయవా

చ: నీలి నీలి ఆకాశం నేల వాలె చూడు ॥పూలజల్లువై॥
పాలపొంగు వయసంతా కోరుకుంది తోడు
చిన్ని చిన్ని చినుకమ్మా చేసి వందనాలు
వన్నెలన్ని తడిమించి పూసి చందనాలు
కోయిలమ్మ గొంతులోన కొత్తరాగాలు
కానుకిచ్చి పెంచుతోంది గుండె వేగాలు
కలలన్నీ తీరే హాయిలో....... ॥పూలజల్లువై॥

చ: తుమ్మెదమ్మ కోరేది పూల పరిమళాలు
వాగు వంక చేరేది ప్రేమసాగరాలు
నింగిలోని జలసాల జంటపావురాలు
పచ్చవైన పొదపైన చేరి చుంబనాలు
ప్రేమ పంచే తోడు నాకు పంచప్రాణాలు
ప్రాణమిచ్చే నీడవంకే నేటిపయనాలు
కలకాలం కరిగే హాయిలో......... ॥పూలజల్లువై॥

**రచన: వేటూరి సుందరరామమూర్తి** (3) **గానం: ఉదిత్ నారాయణ్, స్వర్ణలత**

ప/అ:తకిట తకిట ధిమిరే తళాంగు తళుకదిరే
ఆ: ఝనకు ఝనకులదిరే జాబిల్లి జతకుదిరే
అ: పున్నమంటి నీ నవ్వుల్లో పూలమబ్బు ముసిరే
ఆ: కొంగుజారిన కొత్తల్లో కొండగాలి విసిరే
అ: ఒకసారే ఒడి సుఖసారే
వలపులదారే వయసులగోదారే ॥తకిట॥
అ: అల్లరి మొగ్గల అందంలో అడిగేది ఒక్కటే
ఆ: బంతులు విచ్చిన బంధాలు బతికేది ఒళ్ళోనే
అ: వెచ్చని వెన్నెల కన్నుల్లో వెతికేది ఒక్కటే
ఆ: మెత్తని మల్లెల మోహంతో మొదలయ్యే దాహాలే
అ: కులాసాగా పాడుకున్న ఎదురొచ్చే వయసుల్లో
ఆ: గులాబీలు గిల్లిపోకు ఎదనిచ్చే మనసుల్లో
అ: తెరతీసి వెన్నలు దోచి
కన్నులు పూసె సన్నజాజుల్లో ॥తకిట ॥
ఆ: నిప్పని చెప్పని ఊసుల్లో వినిపించే కోరిక
అ: నిప్పుల పువ్వుల తోటల్లో విరహించే రాధిక
ఆ: కన్నుల నల్లని మేఘంలో మెరుపుంటె చూపుగ
అ: ఎర్రని కుర్రని ముద్దుల్లో అలకెంతో తీపిగ
ఆ: వసంతాలు చల్లుకున్న వలపింటి గొడవల్లో
అ: గుణింతాలు దిద్దుకుందాం తొలిప్రేమ చదువుల్లో
ఆ: ఎదచాటో ఏ పొదచాటో
తుమ్మెద పాటో కమ్మని పొరపాటో ॥తకిట॥



రచన: సాయిశ్రీహర్ష **5** గానం: కార్తిక్

ప: కల అంటె నీవా ప్రేమా
కలవంటె నమ్మానమ్మా
కలకాలముంటావంటే ఈ గుండెలో
కలగానే మిగిలావమ్మా నా కళ్లల్లో.......
ఓ ప్రేమా.....నా ప్రేమా....ఓ ప్రేమా.....నా ప్రేమా....॥కల అంటే॥
చ: మనసు మనసుతో కలపని మనిషి....మనిషికాడనీ
బ్రతుకు బ్రతుకుతో ముడిపడిపోతే...పండగేనని
కలలన్నవే కొలువుండని కనులన్ని దండగనీ
వలపన్నదే రుచి చూడని ఈ జన్మ ఎందుకనీ
పన్నీరులే చిలికించుతూ కన్నీరు నింపావే..... ॥కల అంటే॥
చ: కనుల ఎదురుగా నిలిచే నీవే.....కంటిచుక్కవా
మరల తిరిగి ఇక రాలేనన్న...నింగిచుక్కవా
విషమించిన విధి తోటలో విరజాజి విరిసేనా
మనకేసిన నిశిరాతిరై నెలవంక వెలిగేనా
ఎదకోసిన ఎడబాటుతో నేనింక నేనేనా.... ॥కల అంటే॥

రచన: వేటూరి సుందరరామమూర్తి **6** గానం :యస్.పి. చరణ్,ఫెబి

ప: మరుమల్లె చెండు నవ్వే
మావిళ్ల పండు నవ్వే
మందార సందె పొద్దుల్లో
ప్రాణాలు ఆరు నువ్వే
ప్రాయాల జోరు నువ్వే
పసినిమ్మపండే పంటల్లో
అందాలమ్మ ఆకారం
జాబిలమ్మ జాగారం
దూరంకాని సిందూరంలో
గీతంలోనే గోవిందం గిల్లీకజ్జా సంబంధం
గుండే నిండే ఆనందంలో
రే హుర్రే పుట్టింది నాకు వెర్రే
సే సర్రే కుట్టింది ప్రేమజర్రే ॥మరుమల్లె చెండు॥
చ: పాలరాతి చెమ్మ- మురిపాల పూలరెమ్మ - జారింది తారమ్మ
చెక్కినాడు బ్రహ్మ- ఈ చక్కనైన బొమ్మ- చాలంది నాజన్మ
తొలుత వలపు తెలిపే- పిదప మనసు కలిపే
కలికి చిలక పిలుపే- చిలిపి కథలు నడిపే
దా పదా నను రమ్మందిలే
నా ఎదా ఝుం ఝుమ్మందిలే
సబరనమయవా సఖీరా ॥మరుమల్లె చెండు॥
చ: స్వాతి వాన కురిసే - నీలేత సొగసు మెరిసే- ముంగిళ్ల సిగ్గుల్లో
వీణముందు నిలిచే-నెరజాణ పొందు పిలిచే- ముత్యాల ముగ్గుల్లో
నెలలు పొడిచె పగలే- చలికి వయసు రగిలే
కలకు నిజము తగిలే - ఇలకు జతలు మిగిలే
సా పసా మగ సంగీతమే-నే సదా ఇక నీ సొంతమే
చేతన్ చేన్ తోడన్ తోన్ చెలీరా..... ॥మరుమల్లె చెండు॥



రచన: సిరివెన్నెల సీతారామశాస్త్రి **4** గానం: యస్.పి. బాలసుబ్రమణ్యం ,చిత్ర

అ: ప్రియరాగాలనే పలికించావులే
నయగారాలనే ఒలికించావులే ॥ప్రియ॥
మల్లెపూవల్లె విచ్చావులే
నువ్వు నాకెంతో నచ్చావులే ॥ప్రియ॥
ఆ: ప్రేమ తెరచాపలా నీవు నిలిచావులే
నీలి కనుపాపలో నన్ను నిలిపావులే ॥ప్రేమ॥
నిండు మనసంత ఇచ్చావులే
అందుకే నిన్ను మెచ్చానులే..... ॥ప్రియ॥
అ: చినుకంత స్నేహం కోరిందని-గగనాల మేఘం ఇల చేరదా
ఆ: ఇన్నాళ్ల దాహం తీరిందని- చిగురాకు ప్రాణం పులకించదా
అ: కలల్లోని ఆ స్వర్గం ఇలా చేతికందింది
ఆ: నిజంలోని ఆనందం మనస్సంత నిండింది
అ: నీకు తోడుండి పొమ్మన్నది
ఆ: నన్ను నీవెంట రమ్మన్నది... అ: ॥ప్రియ॥
ఆ: బతుకంటె అర్థం చెబుతానని
నడిపింది హృదయం నీ దారిని
అ: ఈ గాలి పయనం ఎన్నాళ్లని -నీ ప్రేమబంధం నన్నాపని
ఆ: ఋణం ఏదో మిగిలింది అదే నిన్ను కలిపింది
అ: మరీ ఆశ కలిగింది మరో జన్మ అడిగింది
ఆ: నిన్ను ప్రేమించుకోమన్నది
అ: ప్రేమనే పంచుకోమన్నది...... ॥ప్రియ॥



పాటల పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు 'రాజా' పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.




## తారాగణం

రాజా, నయన హర్షిత,
అమిత్‌కుమార్,
మల్లిఖార్జునరావు,
ఏ.వి.యస్., సునీల్,
వేణుమాధవ్, అలీ,
అనంత్, రఘునాథరెడ్డి,
సారిక రామచంద్రరావు,
గౌతంరాజు, శివారెడ్డి,
చిత్రం శ్రీను
జూనియర్ నాగార్జున,
షకీలా, సుభాషిణి,
సంధ్య, రీతు....

## సాంకేతిక నిపుణులు

సంగీతం
**ధర్మతేజ**

పాటలు
**వేటూరి సుందరరామమూర్తి**
**సీతారామశాస్త్రి**
**సాయిశ్రీహర్ష**

కెమెరా
**కె.శంకర్**

ఆర్ట్
**శిష్టా**

ఫైట్స్
**రామ్-లక్ష్మణ్**

డాన్స్
**నిక్సన్, శాంతి**

పి.ఆర్.ఓ.
**సురేంద్ర**

పబ్లిసిటీ
**'కల' యాడ్స్**

ఎడిటర్
**ఉదయభాస్కర్**

ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్స్
**మహిందర్ రెడ్డి**
**కృష్ణ శిరంశెట్టి**

కో-డైరెక్టర్
**యల్.వేణు**

నిర్మాత
**వై.రామచంద్రారెడ్డి**

రచన, దర్శకత్వం
**చిమ్మని మనోహర్**


వై.రామచంద్రారెడ్డి


చిమ్మని మనోహర్


ధర్మతేజ


వేటూరి


సిరివెన్నెల


సాయిశ్రీహర్ష

# ఒకసారి అమృతం తాగటానికి అలవాటు పడిన వాళ్లని మానేయమంటే మానేయలేరు కదా...!?

**- ఉష**



ఊహల పల్లకీలో
ఊరేగించనా...
అంటూ పాటల పల్లకీలో
శ్రోతల హృదయాలను
ఊయలలూగించి
మంచి పాటను ఇష్టపడే
రసహృదయాలను
తూనీగా తూనీగా
ఎందాకా పరిగెడతావే
రావే నావంక....
అంటూ
తన వైపు తిప్పుకున్న
చక్కటి గాయని ఉష.
తియ్యనైన కంఠం,
స్వచ్ఛమైన ఉచ్చారణ
వెరసి పదహారణాల
తెలుగింటి అమ్మాయి ఉష.
**మే 29న ఆమె పుట్టినరోజు సందర్భంగా జరిపిన సంభాషణ ఇది...**

❖ **పాట మీద ఇంట్రెస్ట్ ఎలా కలిగింది మీకు?**

మా అమ్మగారిది అమలాపురం, మా నాన్నగారిది తణుకు. ఉద్యోగరీత్యా మా నాన్నగారు నాగార్జునసాగర్ వచ్చారు. అక్కడే నేను పుట్టాను. మాది సంగీత కుటుంబమే. మా తాతగారు కాశీభొట్ల అయ్యన్న శాస్త్రి గారు వయొలిన్ విద్వాంసులు. మా అమ్మ, నాన్న కూడా సింగర్స్. వాళ్లు పాడుతూ ఉంటే నాకు తెలియకుండానే వారితో గొంతు కలిపేదాన్ని. అలా పాటపై నాకు ఇంట్రెస్ట్ కలిగింది. మూడు సంవత్సరాల వయసునుండి పాడుతున్నాను.

❖ **మొదటిసారి ఎక్కడ పాడారు ?**

ఎక్కడా.... అంటే పర్టిక్యులర్‌గా చెప్పలేను కానీ, కాంపిటీషన్స్‌లో మాత్రం రెగ్యులర్‌గా పాల్గొనేదాన్ని. జెమినీలో నవరాగం, ఈ టీవీ లో పాడుతా తీయగా ప్రోగ్రాంలలో నేను పాల్గొన్నాను.

❖ **సినీ రంగ ప్రవేశం ఎలా జరిగింది ?**

జెమినీ, ఈటీవీలలో పాడినప్పుడు ఆ ప్రోగ్రామ్స్ ఎగ్జిక్యూటివ్ ఎన్.బి.శాస్త్రి గారితో పరిచయం అయింది. ' హైదరాబాద్‌లో వాయిస్ టెస్ట్‌లు చేస్తున్నారు. మీరు ఒకసారి రండి' అని చెప్పి పూర్ణచంద్రరావుగారి ద్వారా నన్ను వందేమాతరం శ్రీనివాస్ గారికి పరిచయం చేశారాయన. వాయిస్ ఓకే అయిన తర్వాత 'ఇల్లాలు' సినిమాలో నా మొదటి పాట పాడాను. తర్వాత శశిప్రీతమ్ గారి సంగీతంలో 'హలో..ఐ లవ్‌యూ'లో పాడాను. ఆ తరువాత ఆర్.పి.గారి మ్యూజిక్‌లో 'చిత్రం' కు పాడాను.

❖ **ఏ తరహా పాటలు మీరు ఎక్కువగా పాడాలనుకుంటున్నారు ?**

ఈ తరహా పాటలను మాత్రమే పాడాలని ఏ నియమం పెట్టుకోలేదు. అన్ని తరహా పాటలనూ పాడాలని వుంది. అయితే ఆ అవకాశం రావాలి కదా!?

❖ **మీరు ఎం.సి.ఏ. చేస్తూ సింగర్‌గా మారారు కదా. రెండు చోట్లా మీ కెరీర్‌ని ఎలా మ్యానేజ్ చేసుకున్నారు ?**

ఈ విషయంలో మ్యూజిక్ డైరక్టర్స్‌కి, మా కాలేజీ వారికి థాంక్స్ చెప్పుకోవాలి. నేను షాదన్ కాలేజీలో చదివేటప్పుడు మాకు మార్నింగ్ క్లాసులు జరుగుతూ ఉండేవి. క్లాసులు అయిన తర్వాత రికార్డింగ్‌కు వెళ్లేదాన్ని. ఒకవేళ మార్నింగ్ రికార్డింగ్ ఉంటే కాలేజీలో పర్మిషన్ తీసుకునేదాన్ని. రికార్డింగ్‌లకు వెళ్తున్నా చదువు మాత్రం అశ్రద్ధ చేయలేదు.

❖ **ఓల్డ్ మెలోడీస్ వింటుంటారా ?**

తెలుగు, హిందీ ఓల్డ్ మెలోడీస్ బాగా వింటుంటాను. సుశీల, జానకి, లీల, జమునారాణి, జిక్కి గార్ల పాటలంటే నాకు బాగా ఇష్టం. హిందీలో ఆశా భోంస్లే గారి పాటలను ఇష్టపడతాను.

❖ **నచ్చిన ఓల్డ్ మెలోడీస్ ?**

తెలుగులో మనసున మల్లెల మాలలూగెనే , హిందీలో చైన్ సే హమ్(ఆశా), రేనా బీత్ జాయే(లతా).

❖ **ఇప్పుడు వస్తున్న పాటలకు, అప్పటి పాటలకు ప్రధానమైన తేడా ఏమై ఉంటుందని మీరు అనుకుంటున్నారు ?**

ప్రధానమైన తేడా అంటే..... అప్పట్లో మాట బాగా వినపడేది. ఇప్పుడు బీట్ దాన్ని డామినేట్ చేస్తోంది. అదీ కాకుండా సాహిత్యం కూడా పాత వాటిల్లో చాలా బాగుండేది. ఇప్పుడు బాగుండటం లేదా అంటే బాగుంటోంది కానీ కొన్ని పాటలలోనే.

❖ **ఇప్పటి వరకూ మీరు పాడిన పాటలలో ఎక్కువగా కష్టపడి పడి పాడినా గుర్తింపు రాని పాట ఏదైనా ఉందా ?**

అన్ని పాటలను కష్టపడే పాడతాము. పాట బాగా రావటానికి రెండు మూడు టేక్స్ తీసుకోవటం కూడా జరుగుతుంది. అయితే ఈ పాట

బాగా గుర్తింపు తెస్తుంది అని అనుకున్నది సరైన గుర్తింపుకు నోచుకోకపోతే కొంచెం బాధగానే ఉంటుంది. అలా 'మా బాపు బొమ్మకు పెళ్లంట' చిత్రంలో నేను పాడిన 'మాటలే రాని వేళ పాట ఎలా పాడను... కంటిలో కడలినింక ఎంతసేపు ఆపను' పాట చాలా మంచి పాట. అది ప్రేక్షకాదరణ సరిగా పొందలేకపోయిందనే బాధ ఉంది.

❖ **తొలిసారి నంది అవార్డు అందుకున్నప్పుడు మీ ఫీలింగ్.. ?**

చాలా సంతోషం వేసింది. మరోప్రక్క నిజంగా నాకు వచ్చిందా అని అనుమానం... కన్ఫర్మయిన తర్వాత ఫ్రెండ్స్‌కి, అసోసియేట్స్‌కి, బంధువులకు ఫోన్ చేసి చెప్పాను. ఆ రోజంతా చాలా సంతోషంగా గడిపాను.

❖ **మీరు గాయని కావటానికి ఇన్‌స్పిరేషన్ ఎవరు ?**

మా అమ్మ. నా చిన్నతనంలో మా అమ్మ పాడటం చూసి నేను కూడా సింగర్‌ని కావాలనుకున్నాను. అయితే సినిమాలకు పాడతానని ఎప్పుడూ అనుకోలేదు.

❖ **జానకి గారంటే 'నీ లీల పాడెద దేవా' పాటలాగా ఉష అంటే ఠక్కున గుర్తొచ్చే పాట ఏదైన ఉంటుందని మీరనుకుంటున్నారు?**

నేను వారంత గొప్పదాన్ని కాదు. కాబట్టి ఉష అంటే ఠక్కున గుర్తొచ్చే పాటంటే....చెప్పటం కష్టం. 'తూనీగా తూనీగా ....' పాట నాకు చాలా మంచి పేరు తీసుకువచ్చింది. కాబట్టి ఆ పాట గుర్తుకువస్తుందని అనుకుంటున్నాను.

❖ **'నేనున్నాను'లో చిత్ర గారు పాడిన ' ఏ శ్వాసలో చేరితే గాలి గాంధర్వమౌతున్నదో' లాంటి ఛాలెంజింగ్ పాటలు చూస్తే మీకేమనిస్తుంది? అలాంటి పాటలు మీరుపాడగలరా?**

ఏ సింగర్‌కైనా ఛాలెంజింగ్ పాటలు పాడాలనే అనిపిస్తుంది. అలాంటి పాటలు తన కెరీర్ మొదట్లో రావాలనే కోరికుంటుంది కూడా. చిత్ర గారు ఆ పాటను చాలా అద్భుతంగా పాడారు. ఆమె గ్రేట్ సింగర్. ఆమెతో పోల్చటం సరికాదు. కొన్ని పాటలకు ఈ తరహా వాయిస్ అయితేనే బాగుంటుందని మ్యూజిక్ డైరెక్టర్ ఫీల్ కావటం కూడా ఉంటుంది. మెచ్యూర్డ్ వాయిస్ కావాలనుకున్నప్పుడు డెఫినెట్‌గా అటువంటి వాయిస్ కోసం చూస్తారు. అటువంటి పాటలు నేను పాడగలనా అంటే.... పాడగలననే అనుకుంటున్నాను.

❖ **మీరు ఎక్కువగా ఆర్.పి. సంగీతంలోనే పాడుతున్నారు. ప్రత్యేకమైన కారణం ఏమైనా ఉందా ?**

ప్రత్యేకమైన కారణం అంటూ ఏమీ లేదు. ఇళయరాజా గారికి పాడాను. వందేమాతరం, కీరవాణి, మణిశర్మ, కోటి, చక్రి, దేవీశ్రీప్రసాద్, అనూప్, శశిప్రీతమ్ గార్లు ఇలా అందరి దగ్గరా పాడాను. ఒక్క రెహమాన్‌గారికే నేను పాడలేదు. అయితే ఆర్.పి.గారు నాకు ఇచ్చిన పాటలన్నీ హిట్ కావటం ... వాటితో ప్రజలకు బాగా చేరువ అయి, ఆర్.పి. సినిమా అంటే ఉష పాడుతుంది అని అన్పిస్తుందంతే !

❖ **ఇళయరాజా గారిలాంటి గ్రేట్ మ్యుజిషియన్‌తో పనిచేయటం ఎలా అన్పించింది?**

కనీసం ఆయనను దగ్గరనుండి చూస్తానని కూడా ఊహించలేదు. అటువంటిది ఆయన సంగీతంలో పాడే అవకాశం రావటం నా అదృష్టం. 'శంభు' సినిమాకు రికార్డింగ్ కోసం చెన్నై వెళ్లాను. అయితే స్టూడియోలో చిన్న రిపేర్ ఉండటంతో రికార్డింగ్ కొంచెం ఆలస్యం అయింది. సాధారణంగా ఆయన ఎవరితోనూ ఎక్కువగా మాట్లాడరంట. అటువంటిది ఆయన నాతో తన ఎక్స్‌పీరియన్స్, ఎలా పాడాలి, ఎక్కడ కట్ చేయాలి లాంటి విషయాలెన్నో చెప్పారు. నిజంగా అదో గ్రేట్ ఎక్స్‌పీరియన్స్. 'శంభు' సినిమాకు పాటల పిక్చరైజేషన్ అయిపోయిన తర్వాత ట్యూన్స్ చేయటం జరిగింది. పిక్చరైజేషన్ అయిపోయిన పాటకి వాళ్ల మూమెంట్స్ చూస్తూ ట్యూన్ చేయటం నిజంగా గ్రేట్.

❖ **మళ్లీ జన్మంటూ ఉంటే గాయనిగా కాక ఎలా పుట్టాలనుకుంటున్నారు?**

గాయనిగానే పుట్టాలనుకుంటున్నాను. ఎందుకంటే ఒకసారి అమృతం తాగటానికి అలవాటు పడిన వాళ్లని అమృతం తాగటం మానేయమంటే మానలేరు కదా.

❖ **ప్రయివేట్ ఆల్బమ్స్ చేసే ఆలోచన ఉందా ?**

చేయాలనే ఉంది. కానీ అన్నీ కలిసి రావాలి కదా! దేవుడు అనుగ్రహిస్తే తప్పకుండా ఓ ప్రైవేట్ ఆల్బమ్ చేస్తా.

❖ **రీ-మిక్స్‌లపై మీ అభిప్రాయం ?**

రీ-మిక్స్ చేయటం తప్పేమి కాదు. రీ మిక్స్‌ల వల్ల ఆ పాట ఒరిజినల్ ట్యూన్‌కు మరింత గుర్తింపు వచ్చిన సందర్భాలున్నాయి. అదేవిధంగా ఒరిజినాలిటీని దెబ్బతీసినవీ ఉన్నాయి. అయితే పాటలోని ఒరిజినాలిటీ పోకూడదు. అప్పుడే ఆ పాటకు మరింత గుర్తింపు వస్తుందని నా అభిప్రాయం.

❖ **మంచి సింగర్ కావాలనుకునే వారికి మీ సలహా ఏంటి అని అడిగితే మీ రియాక్షన్ ఏంటి?**

సలహాలు ఇచ్చే స్టేజ్‌లో నేను లేను, అంత వయసు కూడా నాకు లేదు. అయితే నేను చెప్పేది ఒకటే బి కాన్ఫిడెంట్ వాట్ యూ ఆర్. ఏ దశలోనూ కాన్ఫిడెన్స్ వదలకూడదు. ఎంత చిన్న అవకాశాన్ని అయినా సద్వినియోగం చేసుకోవటానికి ప్రయత్నించండి.

❖ **తెలుగు సింగర్స్‌కు ఇక్కడ అవకాశాలు బాగున్నాయా ?**

ఉన్నాయా అంటే ఉన్నాయి, లేవు అంటే లేవు. హానెస్ట్ గా చెప్పాలంటే సరిగా లేవు. మనవాళ్లలో కూడా మంచి టాలెంట్ ఉంది. అయితే ఆ టాలెంట్‌ను ఉపయోగించుకునే వాళ్లేరి ? అందరికీ ఎస్టాబ్లిష్డ్ సింగర్స్ కావాలంటే ఎట్లా ? ఎవరో ఒకరు ముందు ఒకసారి పాడటానికి అవకాశం ఇస్తేనే కదా వాళ్లు పాడగలరో లేదో తెలిసేది. భాష రాని వాళ్ల చేత రిహర్సల్స్ చేయించి పాడించటానికి అయినా సిద్ధపడతారు కానీ మనవాళ్లకు అవకాశం ఇవ్వటానికే భయపడతారు.

❖ **మీరు అభిమానించే సంగీత దర్శకులు ?**

ఎవరు మంచి సంగీతం ఇస్తే వాళ్లే నా అభిమాన సంగీత దర్శకులు!

**-పి.గిరి**

**చిత్రం ; మనసంతా నువ్వే**

సంగీత దర్శకత్వం : ఆర్.పి.పట్నాయక్ రచన: సీతారామశాస్త్రి

ప: తూనీగా తూనీగా ఎందాక పరిగెడతావే రావే నా వంక
దూరంగా పోనిక ఉంటాగా నీ వెనకాలే రానీ సాయంగా
ఆ వంకా ఈ వంకా తిరిగావే ఎంచక్కా
ఇంకానా చాలింక ఇంతేగా నీ రెక్కా
ఎగిరేనా ఎప్పటికైనా ఆకాశం దాకా ॥తూనీగా॥

చ: దోసిట్లో ఒక్కో చుక్కా పోగేసి ఇస్తున్నాగా
వదిలేయకు సీతాకోక చిలకలుగా
వామ్మో బాగుందే చిట్కా నాకు నేర్పిస్తే చక్కా
సూర్యుణ్ణే కరిగిస్తాగా చినుకులుగా
సూర్యుడు ఏడి
నీతో ఆడి
చందమామ
అయిపోయాడుగా ॥తూనీగా॥

చ: ఆ కొంగలు ఎగిరి ఎగిరి
సాయంత్రం గూటికి మళ్లీ
తిరిగొచ్చే దారిని ఎప్పుడూ మరచిపోవెలా
ఓ సారటు వైపెళుతుంది
మళ్లీ ఇటు వైపొస్తుంది
ఈ రైలుకి సొంతూరేదో గురుతురాదెలా....
కూకూ బండి
మా ఊరుంది
ఉండిపోవె మాతో పాటుగా.... ॥తూనీగా॥



380 పై చిలుకు చిత్రాలకు సంగీతం సమకూర్చినా
వసివాడని పసి(డి) రాగాలతో
సినీ సంగీత సరస్వతికి వసంతోత్సవం నిర్వహిస్తున్న
**కోటి పుట్టినరోజు మే 28.**
కెరీర్ ప్రారంభించి రెండు దశాబ్దాలు దాటినా
తన సంగీతం యవ్వనారంభ సంరంభంలోనే ఉందని
'నువ్వేకావాలి', 'నువ్వే...నువ్వే' వంటి చిత్రాల ద్వారా
నిరూపించుకున్న కోటితో
సినీ సంగీతానికి సంబంధించిన పలు విషయాలపై
'హాసం' తరఫున
పాత్రికేయుడు, గీత రచయిత ఆర్డీయస్ ప్రకాష్
జరిపిన ముఖాముఖీ యిది

# నాన్నగారు చేసిన పాటల్ని రీమిక్స్ చెయ్యాలన్న ఆలోచన వుంది

**- సంగీత దర్శకుడు కోటి**



✦ **పుట్టినరోజుకి మీరిచ్చే ప్రాధాన్యత ఏమిటి? బాల్యంలో మీ పుట్టినరోజు ఎలా జరుపుకునేవారు?**

నేనెప్పుడూ బర్త్‌డే సెలబ్రేట్ చేసుకోలేదు. రోజు ఎలాగో - ఆ రోజు కూడా అంతే నాకు. మ్యూజిక్ డైరక్టర్ అయ్యాక మా మ్యుజీషియన్స్ నా బర్త్‌డేని సెలబ్రేట్ చేసి నాతో కేక్ కట్ చేయించిన సందర్భాలున్నాయి.

✦ **1983లో 'ప్రళయగర్జన' చిత్రం ద్వారా సంగీత దర్శకుడయ్యారు. రెండు దశాబ్దాలు దాటిన మీ కెరీర్‌ని సింహావలోకనం చేసుకున్నపుడు మీకు కలిగే అనుభూతులేమిటి?**

మహాసముద్రం లాంటి సంగీతంలో నేను చేయగలిగినంత - నా లెవల్‌బెస్ట్ - చేశాను. నేను చేసింది ఓ నీటి బొట్టంతే కావొచ్చు. అయినా నేను సంతృప్తిగా ఉన్నాను. ఎంతోమంది టాప్ స్టార్స్‌తో, టాప్ డైరక్టర్స్‌తో గొప్ప గొప్ప సంస్థల్లో పనిచేశాను. నేను భారీ లక్ష్యాలు పెట్టుకుని పరిశ్రమకు రాలేదు. రాజ్, నేనూ కలిసి రాజ్-కోటిగా 1983లో కెరీర్ ప్రారంభించాం. 1993 వరకూ - దశాబ్ద కాలం కలిసి పనిచేశాం. ఆ తర్వాత 'కోటి'గా ఈ పదేళ్ళలో దాదాపు వంద చిత్రాలకు సంగీతం సమకూర్చాను. మొత్తం కెరీర్‌లో 380 పై చిలుకు చిత్రాలకు సంగీతం సమకూర్చాను. 'నువ్వేకావాలి', 'నువ్వునాకునచ్చావ్', 'నువ్వే..నువ్వే', 'మల్లీశ్వరి' చిత్రాల్లో నేను చేసిన పాటలు విని '20 ఏళ్ళ క్రితం వచ్చిన మీరు ప్రజెంట్ యూత్ ట్రెండ్‌కి అనుగుణంగా ఫ్రెష్ మ్యూజిక్ ఇస్తున్నారు' అని అభినందించినవారు ఎందరో ఉన్నారు. నా కెరీర్ పట్ల, నేనిస్తున్న మ్యూజిక్ పట్ల - నేనెంతో సంతృప్తిగా ఉన్నాను.

**✦ మీరిచ్చిన ట్యూన్ హైలెట్ అయ్యేలా, లిరిక్‌తో మీ ట్యూన్ విని మీరే మైమరచిపోయేలా పాట రాసిన రచయితలెవరైనా ఉన్నారా? ఉంటే ఆ పాటలేమిటి?**

చాలా ఉన్నాయండి! మా గురువుగారు వేటూరి గారు మాకు రాసిన పాటలన్నీ ట్యూన్‌ని ఎన్‌హాన్స్ చేసేలా సాగేవే. సడన్‌గా గుర్తుకు రావడం లేదు కానీ 'యముడికి మొగుడు'లో 'బహుశా... నిను బందర్లో చూసి ఉంటా' పాట అలాంటి వాటిల్లో ఒకటి. అలాగే సీతారామశాస్త్రి గారు రాసిన 'నువ్వేకావాలి'లో 'కళ్ళలోకి కళ్ళుపెట్టి చూడవెందుకు', 'ఎక్కడ ఉన్నా పక్కన నువ్వే...' పాటలు, 'నువ్వే నువ్వే' సినిమాలోని 'నామనసుకేమైంది' పాట ట్యూన్ లైఫ్‌ని ఎంతగానో పెంచాయి. అలాగే భువనచంద్ర గారు 'ప్రాణ స్నేహితులు' సినిమా కోసం రాసిన 'స్నేహానికన్న మిన్న లోకాన లేదురా' పాట ట్యూన్ కంటే మిన్నగా సాగింది. అలాగే చంద్రబోస్ కూడా నా ట్యూన్ హైలెట్ అయ్యేలా ఎన్నో సూపర్‌హిట్ సాంగ్స్ రాసారు.

**✦ మరి తమ గానంతో మీ పాటల స్థాయిని పెంచిన గాయనీ గాయకులు....?**

గాయనీగాయకుల ప్రతిభ కారణంగా మరింత అందాన్ని సంతరించుకున్న - ఘన విజయాలను సొంతం చేసుకున్న - పాటలు చాలా ఉన్నాయి. 'గువ్వా... గోరింకతో..' పాట జానకి, బాలు గార్లు పాడటం వలన పెద్ద హిట్ సాంగ్ అయింది. 'కళ్ళలోకి కళ్ళు పెట్టి' (నువ్వేకావాలి), 'సముద్రమంతా నా కళ్ళల్లో' (నువ్వేనువ్వే) పాటలు చిత్ర గళంలో కొత్త అందాన్ని పొందాయి. 'నువ్వు నాకు నచ్చావ్'లో 'ఓ నవ్వుచాలు...' పాటకు శంకర్ మహదేవన్ వాయిస్ పెద్ద ప్లస్ పాయింట్ అయింది.

'నువ్వే నువ్వే'లో 'నా మనసుకేమయింది...', 'ఎలా చెప్పను' లో 'మాఘమాసవేళ...' పాటలు అంత పెద్ద హిట్ అయ్యాయంటే అందుకు ఉదిత్‌నారాయణ స్వరమే కారణం. 'మల్లీశ్వరి'లో 'నీ నవ్వులే... వెన్నెలనీ, మల్లెలనీ...'కి కుమార్‌సాను గళం ఎంత అద్భుతంగా మ్యాచ్ అయిందో విన్నవారందరికీ తేలిగ్గా అర్థమౌతుంది. ఇవి కేవలం కొన్ని ఉదాహరణలు మాత్రమే. గాయనీగాయకుల ప్రతిభ కారణంగా శాశ్వతత్వాన్ని సంపాదించుకున్న పాటలు ఎన్నో ఉన్నాయి.

**✦ రచయితలు రాసిన సాహిత్యాన్ని మీరు ట్యూన్ చేసినపుడు ఆయా రచయితలు మురిసిపోయి మిమ్మల్ని ప్రశంసలతో ముంచెత్తిన సందర్భాలేవయినా ఉన్నాయా?**

మా గురువు గారు వేటూరి గారు రాసిన లిరిక్స్‌కి ట్యూన్స్ చేసి అభినందనలు పొందిన సందర్భాలు చాలా ఉన్నాయి. మా బిగినింగ్ డేస్‌లో ఆత్రేయ గారితో పనిచేసే అదృష్టం కూడా కలిగింది. ఆయన ముందు పాట ఇచ్చేవారు. మేం ట్యూన్ చేసేవారం. పెండ్యాల గారు, మహదేవన్ గారు, నాన్న గారు... ఇలా ఎంతోమంది ఉద్దండులతో ఆయన పనిచేశారు. మేం అప్పుడు చిన్న కుర్రాళ్ళం. మా ట్యూన్ విని 'నా లిరిక్ కొత్త స్టయిల్‌లో, కొత్త ఒరవడిలో, ఫ్రెష్‌గా వినిపిస్తోంది' అనేవారాయన. మా ఇద్దరినీ (రాజ్-కోటి) బాగా ఎప్రీషియేట్ చేసేవారు. మోహన్‌బాబు, సుమలత యాక్ట్ చేసిన 'భార్యాభర్తల సవాల్' సినిమా కోసం ఆత్రేయ గారు రాసిన 'ఆ గంగా యమున కలిసేది ప్రయాగ...' అనే పాటకి - రంగారావు దర్శకత్వంలో రాజశేఖర్, జీవిత నటించిన 'ఇంద్రధనుస్సు' చిత్రం కోసం 'ఇంద్రధనుసు ఇల్లాలై...' పాటకి - మేమిచ్చిన ట్యూన్స్ విని ఆయనెంతో మురిసిపోయారు. భువనచంద్ర గారు రాసిన కొన్ని లిరిక్స్‌కి కూడా ఆయన అభినందనలు పొందాం.

**✦ మీరు కష్టపడి కంపోజ్ చేసి రికార్డ్ చేసిన పాటలకు స్క్రీన్ మీద పూర్తి న్యాయం జరుగుతోందంటారా?**

ప్రస్తుతం మేమే ఊహించనంత బాగా మా పాటలు పిక్చరైజ్ చేస్తున్నారు. పెరిగిన టెక్నాలజీని ఉపయోగించుకుని కొరియోగ్రాఫ్స్‌తో అద్భుతంగా పాటలు తెరకెక్కిస్తూ సంగీత దర్శకులు సమకూర్చిన సంగీతానికి పూర్తి న్యాయమే చేస్తున్నారని చెప్పొచ్చు. అందమైన లొకేషన్లు, ఆధునికమైన కెమెరాలెన్స్‌లు, అకేలా క్రేన్స్, నంబరాఫ్ డాన్సర్స్, డిఫరెంట్ డాన్స్ మూవ్‌మెంట్స్ - మేం కంపోజ్ చేసే పాటలకు కొత్త అందాల్ని తెస్తున్నాయని చెప్పడానికి నేను సందేహించడం లేదు.

**✦ ఈ మధ్య కాలంలో మీ పాట విని - మీ సమకాలీన సంగీత దర్శకులు అభినందించిన సందర్భం ఏదయినా ఉందా?**

'నువ్వునాకునచ్చావ్'లో 'నా చూపే నిను వెదికినది...' పాట విని మణిశర్మ ఫోన్ చేసి అభినందించారు. అలాగే దేవిశ్రీప్రసాద్ కూడా ఫోన్ చేసి అదే పాట తనకు బాగా నచ్చిందని చెప్పాడు. వందేమాతరం శ్రీనివాస్ గారు 'ఎలా చెప్పను'లో 'మాఘమాసవేళ...' పాట చాలా బాగుందని అభినందించారు.

అలాగే నాకు వందేమాతరం శ్రీనివాస్ గారు చేసిన 'ఒసే... రాములమ్మ'లోని పాటలంటే బాగా ఇష్టం. ఎప్పుడు కలిసినా నేను ఆ పాటల గురించి ఆయన్ను అభినందించకుండా ఉండలేను. మణిశర్మ 'ఒక్కడు' కోసం చేసిన 'నువ్వేం మాయ చేశావో గానీ...' పాట నాకు బాగా నచ్చింది. 'వర్షం' సినిమాలో దేవిశ్రీప్రసాద్ చేసిన 'నువ్వొస్తానంటే నేనొద్దంటానా...' పాట చాలా బాగుంది. ఇతర సంగీత దర్శకులు చేసిన పాటలు నాకు నచ్చినపుడు నేను కూడా ఫోన్ చేసి అభినందనలు తెలుపుతుంటాను.

**✦ ప్రస్తుతం రీమిక్స్‌ల ట్రెండ్ నడుస్తోంది కదా... వీటిపై మీ అభిప్రాయాలేమిటి? మీరేమైనా రీమిక్స్‌లు చేయబోతున్నారా?**

రీమిక్స్‌ని నేను సపోర్ట్ చేస్తాను. ఒరిజినల్‌లోని మెలోడీ, ఫ్లేవర్ చెడకుండా కొన్ని కొత్త వాయిద్యాలు, రిథమ్స్‌తో పాత పాటలకు మరింత అందం తేవడమే రీమిక్స్. ఉదాహరణకి అర్.డి.బర్మన్ చేసిన 'చురాలియా...' పాట అప్పట్లో సింగిల్ రిథమ్‌లో చేశారు. ఇప్పుడున్న టెక్నాలజీని ఉపయోగించుకుని మరికొన్ని రిథమ్స్ యాడ్ చేస్తే ఎంత బావుందో...? నాన్న గారు చేసిన పాటలని రీమిక్స్ చేయాలన్న ఆలోచన ఉంది.

**✦ తెలుగులో హీరో సపోర్ట్ లేకుండా మ్యూజిక్ డైరక్టర్ పేరు మీద ఆడియో మార్కెట్ చేయాలంటే నామినల్ సేల్ కూడా రావడం లేదని ఆడియో కంపెనీలు అంటున్నాయి. ఈ పరిస్థితి నుండి బయట పడాలంటే ఏం చేయాలంటారు?**

తెలుగులోనే ఇలాంటి పరిస్థితి ఉంది. తమిళ్‌లో ఇళయరాజా, ఏ.ఆర్.రెహమాన్‌ల ఆడియోలకు హీరోలతో సంబంధం లేకుండా మార్కెట్ ఉంది. అదే వారిద్దరూ తెలుగులో చేస్తే అంత మార్కెట్ రాదు. ఇక్కడ హీరో సపోర్ట్ కావాలి. మొదటినుండి హీరో బొమ్మ వేసి కేసెట్స్ అమ్మడం మనకు అలవాటు. హీరో ఇమేజ్‌ని బట్టి ఇక్కడ కేసెట్ సేల్స్ ఉంటాయి. నేను ఒక సాంగ్ కంపోజ్ చేస్తే దానిని స్టార్ హీరో బొమ్మ వేసి రిలీజ్ చేస్తేనే స్పీడ్‌గా సేల్ అవుతుంది. అదే పాటని ఒక అప్‌కమింగ్ హీరో బొమ్మతో కేసెట్ రిలీజ్ చేస్తే సేల్స్ 10 శాతం కూడా ఉండవు. పాట ఒకటే అయినా అది ఏ హీరో మీద ఉంటుంది అనేది ఇక్కడ శ్రోతల ప్రయారిటీ. ఆ ధోరణి పోవాలి. పాట బాగుందా...? లేదా...? అన్న దానికి ప్రాముఖ్యత ఇచ్చే పరిస్థితి రావాలి. 'ఐతే' చిత్రం ఆడియో మంచి విజయం సాధించడం తెలుగు సినీ సంగీత ప్రియుల అభిరుచిలో వస్తున్న మార్పుని తెలియజేస్తోంది. రాబోయే రెండు మూడేళ్ళలో మ్యూజిక్ డైరక్టర్ పేరు మీద ఆడియో కేసెట్స్ సేల్ అయ్యే పరిస్థితి వస్తుందని ఆశిస్తున్నాను.

**✦ తెలుగులో ఎందరో ప్రతిభావంతులైన సంగీత దర్శకులు ఉన్నప్పటికీ రెహమాన్ లాగా జాతీయస్థాయి గుర్తింపును, మార్కెట్‌ను పొందలేకపోవడానికి కారణమేమిటి?**

రెహమాన్ గానీ, ఇళయరాజా గారు గానీ జాతీయస్థాయిలో గుర్తింపు పొందడానికి కారణం మణిరత్నం, శంకర్ లాంటి గ్రేట్ డైరక్టర్స్. వాళ్ళు మ్యూజిక్ డైరక్టర్‌కి పూర్తి స్వేచ్ఛనిస్తారు. తాము అనుకున్న కథని సంగీత దర్శకుడికి పూర్తిగా వివరించి - ఆ కథకి ఎలాంటి మ్యూజిక్ ఇస్తారో ఇమ్మని అడుగుతారు తప్ప - ఏవో కొన్ని సి.డి.లు వినిపించి ఇలాగ

చెయ్యండి, ఫలానా పాటలాగా చెయ్యండి అని అడగరు. ఇళయరాజా గానీ, రెహమాన్ గానీ దర్శకుడు చెప్పిన సిట్యుయేషన్‌ని పూర్తిగా అర్థం చేసుకుని ఒక ట్యూన్ ఇస్తే దర్శకుడు నమ్మకంతో ఆ ట్యూన్‌ని తీసుకుంటారు. వారు ఇచ్చిన ట్యూన్‌లో మార్పులు ఉండవు. వారు ఏది ఇస్తే అదే ట్యూన్. వారి మనసులో రూపుదిద్దుకున్న ట్యూన్ యథాతథంగా రికార్డయి వస్తుంది. ఆ ట్యూన్‌ని మణిరత్నం, శంకర్ లాంటి దర్శకులు అద్భుతంగా తెరకెక్కిస్తారు. అలాంటి దర్శకులు ఇప్పుడిప్పుడే తెలుగులోనూ వస్తున్నారు. కె.విశ్వనాథ్, కె.రాఘవేంద్రరావు గార్ల వంటి మంచి మ్యూజికల్ టేస్టున్న దర్శకుల తర్వాత ఈ జనరేషన్‌లో గుణశేఖర్, విజయభాస్కర్ లాంటి మంచి అభిరుచి, అవగాహన, టెక్నిక్‌ని ఉపయోగించుకునే నేర్పు ఉన్న దర్శకులు మాలాంటి సంగీత దర్శకులకి కొత్త ఆశల్ని, నమ్మకాల్ని కలిగిస్తున్నారు. మణిరత్నం, శంకర్ లాంటి దర్శకులు తెలుగులో వస్తే - సంగీత దర్శకుడికి తాననుకున్న సంగీతాన్ని అందించే స్వేచ్ఛ లభిస్తుంది. అప్పుడు ఇళయరాజా, రెహమాన్ లాంటి జాతీయస్థాయి సంగీత దర్శకులు - తెలుగు సినీ రంగం నుండి పదిమంది దాకా వస్తారు. ఫిలిం మేకింగ్ పట్ల పాషన్, కమాండ్, అవగాహన, అభిరుచి ఉన్న కొత్తతరం దర్శకుల కోసమే నేను, నాలాంటి సంగీత దర్శకులు ఎదురుచూస్తున్నాం. ఇక్కడ టాలెంటెడ్ మ్యూజిక్ డైరెక్టర్స్‌కి కొదవలేదు. కొత్తగా ఆలోచించే యువ దర్శకులు వస్తే - సంగీత దర్శకులంతా తమ సత్తా చూపించడానికి సిద్ధంగా ఉన్నారు.

'నువ్వునాకునచ్చావ్' సినిమాలో కథ మూడ్‌కి తగ్గ ట్యూన్స్, రీ-రికార్డింగ్ కుదిరాయంటే దర్శక నిర్మాతలు ఇచ్చిన స్వేచ్ఛ ఒక కారణం. ఇచ్చిన ట్యూన్ తాలూకు పవర్‌ని, సిట్యుయేషన్‌ని ఆ ట్యూన్ ఎలివేట్ చేస్తుంది అనే గ్రహింపు, నాలెడ్జ్ ఉండటం మరో కారణం. వారిలా మరో 10-15 మంది దర్శక నిర్మాతలుంటే తెలుగు సినిమా సంగీతం కూడా జాతీయ స్థాయికి వెళుతుంది.

✦ **నేటి 'మల్లీశ్వరి' సినిమా చివర్లో రోలింగ్ టైటిల్స్ మీద నాటి 'మల్లీశ్వరి' సినిమాలోని 'పరుగులు తీయాలి -గిత్తలు ఉరకలు వేయాలి...' పాట ట్యూన్ పోస్ట్ చేశారు. ఆ ఆలోచన ఎవరిది?**

'మల్లీశ్వరి' టైటిల్‌తో సినిమా తీస్తున్నాం. పాత 'మల్లీశ్వరి'లో నాన్నగారు చేసిన ట్యూన్ ఏదయినా రిపీట్ చేద్దాం అనుకున్నాను. కానీ ఎక్కడా ప్లేస్‌మెంట్ కుదరలేదు. అయితే 'నీ నవ్వులే...' పాటలో 'పరుగులు తీయాలి' పాటలో చిన్న చిన్న హమ్మింగ్... పది పన్నెండు సెకండ్లు వచ్చేది వేశాను. అయినా తృప్తి లేదు. రీరికార్డింగ్ టైమ్‌లో సడన్‌గా ఐడియా వచ్చింది. చివర రోలింగ్ టైటిల్స్ మీద 'పరుగులు తీయాలి...' పాటని రీమిక్స్ చేసి పోస్ట్ చేస్తే బావుంటుందని - సురేష్‌బాబు, విజయభాస్కర్ గార్లకి చెప్తే హాపీగా ఓకే చేశారు. ఫాస్ట్ బీట్‌లో రీమిక్స్ చేసి వేశాను. ఆడియన్స్ ఆ మ్యూజిక్ బిట్‌ని బాగా ఎంజాయ్ చేయడం నాకెంతో సంతోషం కలిగించింది.

✦ **ప్రస్తుతం సంగీతం సమకూర్చుతున్న చిత్రాలు?**

బాలకృష్ణ హీరోగా ఆదిత్య ప్రొడక్షన్స్ సంస్థ స్వర్ణ సుబ్బారావు దర్శకత్వంలో నిర్మిస్తోన్న చిత్రం. సుమంత్ హీరోగా 'స్రవంతి' రవికిషోర్ రమణ దర్శకత్వంలో తీస్తున్న చిత్రం - మరో రెండు కొత్త సంస్థల చిత్రాల వర్క్ చేస్తున్నాను.

**- ఆర్.డి.యస్.ప్రకాష్**

# కోటి హిట్స్

## చిత్రం : పెదరాయుడు

రచన: సాయి హర్ష    గానం: కె. జె. ఏసుదాసు, చిత్ర

కదిలే కాలమా కాస్సేపు ఆగవమ్మా
జరిగే వేడుకా కళ్ళారా చూడవమ్మా
పేగే కదలగా సీమంతమాయెలే
ప్రేమ దేవతకు నేడే ॥కదిలే॥
లాలించే తల్లి పాలించే తండ్రీ
నేనేలే నీకన్నీ
కానున్న అమ్మా నీ కంటి చెమ్మా
నే చూడలేనమ్మా
కన్నీళ్లలో చెలికాడినే...
నీ కడుపులో పసివాడినే
ఏనాడు తోడు నీడను వీడనులే ॥కదిలే॥
తాతయ్య తేజం పెదనాన్న నైజం
కలిసున్న పసిరూపం
నీ రాణి తనము
నా రాచగుణము
ఒకటైన చిరుదీపం
పెరిగేనులే నా అంశము
వెలిగేనులే మా వంశము
ఎన్నెన్నొ తరములు తరగని యశములతో
ఎన్నో నోములే గత మందు నోచివుంటా
నీకే భార్యనై ప్రతిజన్మనందువుంటా
నడిచే దైవమా
నీ పాద ధూళులే పసుపు కుంకుమలు నాకు ॥ఎన్నో॥

## చిత్రం : నువ్వు నాకు నచ్చావ్

రచన: సీతారామశాస్త్రి    గానం: శంకర్ మహదేవన్

నా చెలియ పాదాలూ హంసలకే పాఠాలు
తాను పలికితే చాలు తేనె జలపాతాలు
ఓ నవ్వుచాలు ఎన్నెన్నో వలలు వేస్తూ అల్లుకుంటుంది
ముత్యాల జల్లు మృదువైన ముల్లు మదిలో గుచ్చుకుంటుంది
ఆ సోగ కళ్ల ఓ సైగ చాలు మనసే ఆగనంటుంది
చెక్కిళ్ల లోని నొక్కుల్లో చేరి మళ్ళీ తిరిగి రానంది
పట్టపగలెవరైనా రాతిరిని చూస్తారా
తన కురులు చూపిస్తా జౌననకా చస్తారా ॥ఓ నవ్వుచాలు॥
గుండెల్లో భోగి మంటలా ఎండల్లో లేత వెన్నెలా
కొండల్లో ఏటి పరుగులా దూకుతున్న లయలో
గుమ్మంలో సందె వెలుగులా కొమ్మల్లో కొత్త చిగురులా
మబ్బుల్లో వెండి మెరుపులా ఆమెకెన్ని హొయలో
అలా నడిచి వస్తుంటే పువ్వుల వనం
శిలైపోని మనిషుంటే మనిషే అనం ॥ఓ నవ్వుచాలు॥
గాలుల్లో ఆమె పరిమళం ఊపిరిలో నిండి ప్రతిక్షణం
ఎటువున్నా నన్ను వదలదే ఎలా తప్పుకోను
గుర్తొస్తే ఆమె పరిచయం కవ్వించే పడుచు పసితనం
రెప్పల్లో కైపు కలవరం ఎలా దాచుకోనూ
కలో కాదో నాకే నిజం తేలకా ఎలా చెప్పడం తాను నాకెవ్వరో
అదిరిపడకయ్యా యిది ఆమె మాయ
యిది కవిత కాదబ్బా మన్మథుడి దెబ్బ ॥ఓ నవ్వుచాలు॥

**మే 16 సుద్దాల అశోక్‌తేజ పుట్టినరోజుని పురస్కరించుకుని.....**

'భారతీయుడు' సినిమాలో కమలహాసన్ పోషించిన సేనాపతి పాత్ర అందరికీ గుర్తుండే ఉంటుంది. స్వాతంత్ర్య సమరయోధుడిగా, అజాద్ హింద్ ఫౌజ్ నాయకుడు సుభాష్ చంద్రబోస్ కుడిభుజంగా బ్రిటిష్ వాళ్ల గుండెల్లో మంటలు రేపిన ఆ విప్లవ పోరాట యోధుడ్ని మరచిపోలేం! పతి బాటలోనే సతి అనే నానుడిని అనుసరిస్తూ నేను సైతం... అంటూ అవమానాల్ని కూడా దిగమింగి తల్లి భారతిని దాస్యశృంఖలాల నుండి విముక్తి కావించటానికి ఆ సినిమాలో పోరాడిన యోధురాలుగా నటించిన అమృతవల్లి పాత్రలో సుకన్య ని కూడా మరువటం కష్టమే.

ఆ... అది సినిమా... నిజంగా అటువంటి వాళ్లు ఉంటారా ? అంటే ఉన్నారు అనే చెప్పాలి. ఎక్కడా... అంటే మన ఆంధ్ర దేశంలోనే....నల్గొండలోని సుద్దాల అనే గ్రామంలో...

తెల్లదొరల పాలన నుండి విముక్తి కావటానికి ఎందరో మహానుభావులు తమ ప్రాణాల్ని సైతం లెక్క చేయకుండా పోరాటం నెరిపితే, నిజాం దొరల నిరంకుశ పాలనకు చరమ గీతం పాడి స్వతంత్ర్య భారతావనిలో విలీనం కావటానికి(1948 సెప్టెంబరు 17 వరకూ) ఎందరో ఉద్యమకారులు అవిశ్రాంతంగా పోరాడారు. తెలంగాణా ప్రజలు అనుభవిస్తున్న బానిసత్వం నుండి విముక్తి పొందటం కోసం పెన్నుని, గన్నుని సమానంగా వాడుతూ జానపద బాణీలో - ప్రజలకు అర్థమయ్యేలా - వారి మనసుల్లో చొచ్చుకుపోయి ఉద్యమస్ఫూర్తి రగిలించేలా - పాటలు రాయటంలో పేరెన్నికగన్న స్వాతంత్ర్య సమరయోధుడు, ప్రజాకవి - సుద్దాల హనుమంతు ! ఆయనతో సమానంగా ఉద్యమంలో పాల్గొన్నది వారి అర్థాంగి జానకమ్మ !!

అటువంటి ఉద్యమకారుల ముద్దుబిడ్డ - నన్నయ్య నుండి నారాయణరెడ్డి వరకూ, కందుకూరి నుండి యండమూరి వరకూ అందరినీ చదివి, వారి సాహిత్యాన్ని ఔపోసన పట్టి తనదైన బాణీలో మాటను తూటాగా ఉపయోగిస్తూ పాటల్ని రాయటమే కాదు సినీ పరిశ్రమకు వచ్చిన తొలి మూడు సంవత్సరాలలోనే మూడు ప్రముఖ అవార్డుల్ని కూడా సొంతం చేసుకున్న రచయిత - సుద్దాల అశోక్ తేజ. మే 16 ఆయన పుట్టినరోజు సందర్భంగా 'హాసం' ఆయనతో జరిపిన ఇష్టాగోష్టిలోని విశేషాల సారాంశమిది :



నాకన్నా ముందే మా ఇంట పాట పుట్టింది. మా నాన్నగారు 1000కు పైగా పాటల్ని రాయటంతో పాటు తెలంగాణ యక్షగానం కూడా రాశారు. ఆయన ఏ పాట రాసినా దానిని ఊళ్లో పెద్దలముందు, మరికొంత మంది సాహితీ మిత్రుల ముందు పాడి వినిపించి, దానిపై చర్చ చేసేవారు. ఆ సమయంలో నేను ఎక్కడ ఉన్నా తీసుకువచ్చి కూర్చోబెట్టేవారు. వారు ఏది మాట్లాడుతున్నారో తెలియని వయసులోనే అలా వాళ్ల సంభాషణల మధ్య నన్ను ఉంచటం ద్వారా నాన్నగారు నాలో తెలియకుండానే సాహిత్యం పై అభిలాష పుట్టేట్టు చేశారు.

నాకు అక్షరాలు పలకటం, రాయటం కూడా రాని రోజుల్లోనే నేను శ్రీశ్రీ గారి మహాప్రస్థానం కంఠతా పట్టేశాను. అప్పటికి నాకు శ్రీశ్రీ అంటే ఎవరో కూడా తెలియదు. మా ఇంటికి వచ్చే పెద్దవారి ముందు నాన్నగారు నాచేత ఆ పద్యాలు పాడించేవారు. నాకు ఊహ వచ్చిన తర్వాత నాకు కనిపించింది నాన్నగారి సాహితీ లైబ్రరీనే. ఎన్నో పుస్తకాలు ఉండేవి. ఖాళీ దొరికినప్పుడల్లా ఆ పుస్తకాల్ని చదువుతూ ఉండేవాడ్ని. అలా నన్నయ్య దగ్గర్నుండి సి.నారాయణరెడ్డి గారి దాకా, కందుకూరి వీరేశలింగం నుండి యండమూరి వీరేంద్రనాథ్ దాకా మొత్తం అందరినీ చదివాను. అందరికీ తండ్రి నుండి వారసత్వంగా డబ్బు, పరపతిలాంటివి వస్తే మా నాన్నగారు నాకు సాహితీ సిద్ధాన్నం వడ్డించి పెట్టారు.

నేను పుట్టిన తేదీ మే 16... తిథి వైశాఖ పౌర్ణమి. ఆ సంగతి చెబుతూ 'గౌతమబుద్ధుడు, అన్నమాచార్యుడు, గుడిపాటి వెంకటాచలం పుట్టింది ఈ వైశాఖ పౌర్ణమి రోజునే రా' అనేది మా అమ్మ. ఈ మాటలు నాకు అనిర్వచనీయమైన ప్రేరణ కలిగించేవి.

నా చిన్నతనంలో నేను చాలా బలహీనంగా ఉండేవాణ్ణి. స్కూల్‌లో జరిగే ఆటల పోటీలలో కూడా - నాకు ఏమైనా జరుగుతుందేమోనని - ఏ ఆటలూ నన్ను ఆడనిచ్చేవారు కాదు. ఆగష్టు 15 రోజున ఆ ఆటలలో గెలిచిన వారికి ప్రైజులు ఇస్తుండేవారు. నాకు కూడా అలా ప్రైజులు తెచ్చుకోవాలని ఆశ ఉండేది. అయితే నాకా అవకాశం ఏది? ఒక్కోసారి మాష్టార్లు మా నాన్నగారి మీద ఉండే అభిమానం వల్లనైతేనేమి, గౌరవం వల్ల అయితేనేమి ఊరికే పిలిచి గిఫ్ట్ ఇవ్వబోయేవాళ్లు. ఆత్మాభిమానం వల్ల తీసుకునేవాణ్ణి కాదు. అయితే నాలో ఓ కసి ఉండేది - ఎలాగైనా ప్రైజు తెచ్చుకోవాలని ! 'చూడు నాన్నా.... ఆడలేకపోతేనేం బాగా రాయొచ్చు. ఉపన్యాసం ఇవ్వొచ్చు' అంటూ ఆ కసినే మా నాన్నగారు లలిత కళల దిశగా మళ్లించారు. అదే సరియైన దిక్సూచికత్వం కూడా అయింది. ఆ తర్వాత జరిగే ప్రతి ఉపన్యాస పోటీలోనూ, గేయ, పద్య రచన పోటీల్లోనూ నేనే మొదటి ప్రైజ్ తెచ్చుకునేవాణ్ణి. అది నాలో ఉన్న దైహికమైన బలహీనతని వాఙ్మయమైన బలంగా మార్చింది.

నేను 4వ తరగతి చదివే రోజుల్లో నా మొదటి పాట రాసాను.

**ఆ చరణాలను నేను చదువుతుంటే 'ఇటు చూడు అశోక్' అంటూ చిరంజీవి గారు రోమాంచితమైన తన చేతిని చూపించారు**

**- సుద్దాల అశోక్‌తేజ**

**'ధగధగలాడే ఓ జెండా నిగనిగ మెరిసే ఓ జెండా**
**వినవే పేదల బాధ చల్లారదు ఆకలి గాథ'**

అంటూ జాతీయ జెండా పై రాశాను. అప్పుడు మా నాన్నగారు ఊళ్లో పెద్దలందరినీ పిలిచి గెట్ టు గెదర్ లాంటిది ఏర్పాటు చేసి నేను రాసిన ఆ పాటను నా చేత కావ్యగానం చేయించారు. పాట అయిన తర్వాత వారు కొట్టిన చప్పట్ల సౌండ్ నాలో అలా నిక్షిప్తమైపోయింది. ఇప్పటికీ అవి నన్ను వెంటాడుతూనే ఉన్నాయి. **ఇటీవల నేను రాసిన 'భద్రాచలం' సినిమాలోని 'ఒకటే జననం -ఒకటే మరణం' పాటలో 'రాబోయే విజయాన్ని పిడికిలిలో చూడాలి....ఆ గెలుపు చప్పట్లే గుండెలలో మోగాలి' అంటూ రాయటానికి ప్రేరణ ఆ చప్పట్లే !**



ఆ జండా పాటను అంతగా అందరూ మెచ్చుకున్న తర్వాత ఓ రోజు మా నాన్నగారు నాకు హితబోధ చేశారు. అది కూడా ప్రాక్టికల్‌గా! ముందు ఓ ఖాళీ బాల్టి పట్టుకురమ్మన్నారు. తెచ్చాను. చిన్న గ్లాసు ఇచ్చి దానిలో నీళ్లు పోయమన్నారు. తెచ్చిపోసాను. బాల్టిని నింపు అన్నారు. మళ్లీ పోయటానికి నీళ్లు తేవటానికి వెళ్తుంటే ఆపి..'ఎక్కడకు వెళ్తున్నావ్... నువ్వు ఆ చిన్ని గ్లాసుతోనే ఒక్కసారిగా బాల్టి నింపాలి' అన్నారు. 'అదెట్లా ఇంత చిన్న గ్లాసుతో అంత పెద్ద బాల్టి ఒక్కసారే ఎట్లా నిండుతుంది?' అని అడిగితే అప్పుడు చెప్పారు ' ఇంత చిన్న వయసులోనే అంతగా కవిత్వం రాస్తే తర్వాత ఏం రాస్తావ్? కాబట్టి ముందు శ్రద్ధగా చదువు...' అని నా మేధస్సులోకి గ్రంథాలయాల పుస్తకాల దండయాత్ర ప్రారంభింపచేశారు. అలా నేను మొదటి సారిగా చిన్నయసూరిగారి పంచతంత్రంతో పుస్తక పఠనం ప్రారంభించాను. ఇప్పటికి కూడా పాట రాయని రోజుందేమో కానీ పుస్తకం చదవని రోజు ఒక్కటి కూడా లేదు. అది నా సెకండ్ నేచర్ అయిపోయింది.

ఆ ఏజ్‌లోనే పుస్తకపఠనంతో పాటు రేడియో కూడా విపరీతంగా వింటూ ఉండేవాణ్ణి. అప్పడే సి.నారాయణరెడ్డి గారి పాటల్ని బాగా ఇష్టపడేవాణ్ణి. ఆయన 'రామప్ప' నాటకంలోని 'ఈ నల్లని రాళ్లలో...' పాట అంటే నాకు విపరీతమైన ఇష్టం. ఆ పాటను తర్వాత సినిమాల్లో కూడా ఉపయోగించారు. ఆ పాట విన్నప్పుడల్లా ఎప్పటికైనా అంతటి గొప్ప పాట రాయాలి. అలా అందరికీ చేరువ కావాలి అని కలలు కనేవాణ్ణి. నారాయణరెడ్డి గారు తన కవిత్వాన్ని అరబిక్- ఉర్దూ షాయరీల తరహాలో వినిపించే విధానం నన్ను ఎంతగానో ఆకట్టుకుంది. ఎప్పటికైనా నారాయణరెడ్డి గారి పేరు తర్వాత నా పేరు ఉండాలి అనుకునేవాణ్ణి. అది నాకు 'ఒసేయ్ రాములమ్మ' చిత్రంతో తీరింది.

అసలు మా ఇంటి పేరు గుజ్జిం. నా అసలు పేరు అశోక్. నల్గొండ జిల్లాలోని మా ఊరి పేరు సుద్దాల. అంచేత మా నాన్నగార్ని సుద్దాల హనుమంతు అని ప్రజలు అనేవారు. మా అబ్బాయి పేరు అర్జున్ తేజ. సినిమాల్లోకి వచ్చాక వీటిని నా పెన్‌నేమ్ గా కలుపుకుని సుద్దాల అశోక్ తేజ అయ్యాను.

నా కాలేజీ చదువు హైదరాబాద్‌లోనే సాగింది. విరసం సభ్యుడు ఎం.టి.ఖాన్ గారు మా గురువుగారు. అప్పుడు కూడా నేను విస్తృతంగా కవితా చర్చలలో పాల్గొనేవాణ్ణి. అలా నేను కవిత్వానికి దూరంగా ఎప్పుడూ లేను. ఎక్కడకు వెళ్లినా కూడా కవిత్వమనే నది ఒడ్డుకే చేరుకునే వాణ్ణి.

సి.నారాయణరెడ్డి గారికి పి.వి.నరసింహారావు గారు గండపెండేరం తొడగటం నాకు ఇప్పటికీ గుర్తే.

తెలంగాణా ఉద్యమ నేపథ్యంలో దాశరథిగారు రాసిన అగ్ని, నైజాం రాజు జన్మజన్మలబూజు... ఇవన్నీ సాహిత్యపరంగానే నేను ఇష్టపడేవాణ్ణి. ఆయనవన్నీ కండగల పద్యాలే!

జంధ్యాల పాపయ్య శాస్త్రి గారి కరుణశ్రీ, ఉదయశ్రీ, విజయశ్రీ లంటే నేను బాగా ఇష్టపడతాను.మామూలుగా మాట్లాడుకునే మాటలతో ఆయన చూపిన దృశ్యకల్పన అత్యద్భుతంగా ఉంటుంది. పూర్వకవులు చూపించినంత పిక్టోరియల్ ఎఫెక్ట్ ఇప్పుడు ఎవరు చూపగలుగు తున్నారు చెప్పండి !? భారతం తీసుకుంటే నర్తనశాలలో కీచకుడు, భీముడు చేసిన యుద్ధాన్ని ఎంతో అద్భుతంగా తిక్కన గారు వర్ణించారు. అప్పటి కావ్యాలలో శాబ్దిక ఔచిత్యం, సంస్కారం ఎంత బాగా ఉండేవో ! వాటి ఇన్స్‌పిరేషన్ తోటే పిక్టోరియల్ ఎఫెక్ట్, శాబ్దిక ఔచిత్యం ఉండే విధంగా నేను 'సమ్మక్క-సారక్క' చిత్రంలో **'కొండరాళ్ళ దొర్లిన శబ్దమ్మున దండు కదిలెనా నిముషము** చూడు వందల ఏనుగులొక్కసారి ఫీంకరించు ప్రతాప శంఖము చూడు' అలాగే 'ఠాగూర్'లో

**'అగ్నినేత్ర మహోగ్రజ్వాల**
**దాచిన ఓ రుద్రుడా**
**అగ్ని శిఖలను గుండెలోన**
**అణచిన ఓ సూర్యుడా**
**పరశ్వథమును చేతబూనిన**
**పరశురాముని అంశమా**
**హింసనణచగ ధ్వంసరచనలు**
**చేసిన ఆచార్యుడా**
**మన్నెం వీరుడు రామరాజు**
**ధనుష్టంకారానివా**
**భగత్‌సింగ్ కడసారి పలికిన**
**ఇంక్విలాబ్ శబ్దానివా'**

అంటూ రాశాను. ఆ సాహితీ సంస్కారం నాకు ఆ కావ్యాల ద్వారానే వచ్చింది.

నేను డబుల్ ఎమ్మే చేశాను. ఎం.ఏ. తెలుగు, ఎం.ఏ. ఫిలాసఫీ. అయితే ఫిలాసఫీ చేసింది మాత్రం కేవలం పాట కోసమే. 12 సంవత్సరాల పాటు టీచర్‌గా కరీంనగర్

---

✦ సి.నారాయణరెడ్డి గారు రాసిన కర్పూర వసంత రాయలు కు ఆచంట జానకీరాం గారు అద్భుతమైన విశ్లేషణ రాశారు. నేను రాసిన 'నేలమ్మ నేలమ్మ' పాటకు కోవెల సంపత్కుమారాచార్య గారు అలాగే అద్భుతమైన విశ్లేషణ రాయటం....

✦ ఠాగూర్ చిత్రంలో శ్రీశ్రీ గారి 'నేను సైతం...' పల్లవికి నేను చరణాల్ని బాగా రాసానని డైరక్టర్ గారు అంటుంటే విన్న చిరంజీవి గారు నన్ను పిలిపించి ఆ చరణాలను మళ్లీ వినిపించమని అడిగారు. నేను రాసిన 'అగ్నినేత్ర మహోగ్రజ్వాల' చరణాలు చదువుతున్నాను. ఆ చరణాల్ని విన్న తర్వాత'అశోక్ ఓసారిటు చూడు' అని చిరంజీవి గారు నిక్కబొడుచుకున్న తన చేతి రోమాల్ని చూపించటం, అద్భుతంగా రాశానని మెచ్చుకోవటం...

✦ నేను రాసిన 'ఒకటే జననం....ఒకటే మరణం' పాట తమను ఎంతగానో ఇన్‌స్పయిర్ చేసిందని ఎమ్‌సెట్ రాసే పిల్లలు ఫోన్ చేసి చెప్పటం....

✦ కృష్ణగారి 'శాంతిసందేశం' చిత్రంలో క్రీస్తుకు శిలువ వేసే సమయంలో వచ్చే పాటలో క్రీస్తు పూర్వం, క్రీస్తు శకం అంటూ కాలం రెండుగా చీలిందని అర్థం వచ్చేట్టు

'దైవ కుమారుని తలపై కిరీటం
కాలమే రెండుగా చీలుతున్న ఘట్టం'

అంటూ రాశాను. అలాగే 'పరమ పవిత్రుని శిలువ వేయటం, కరుణకు తొలిసారి మరణశిక్ష వేయడం' అని రాశాను. ఈ ప్రయోగాలను కృష్ణ గారు, బాలు గారు ఎంతగానో మెచ్చుకోవటం....

✦ మామూలుగా కవులు నెమలిని స్త్రీ పరంగా చెప్తూ ఉంటారు. అయితే నాట్యం చేసేది మగ నెమలి. ఆ నెమలి పింఛం లోని కన్నునే నేపథ్యంగా తీసుకుని ఒకటో నెంబరు కుర్రాడులో 'నెమలి కన్నోడా' అనే ప్రయోగాన్ని అందరూ మెచ్చుకోవటం...

✦ ఒక సందర్భంలో నారాయణరెడ్డి గారు 'ఎన్.గోపి నా సాహితీ వారసుడు అయితే సుద్దాల అశోక్‌తేజ నా సినీ సాహితీ వారసుడు' అని పేర్కొనటం....

నేను మరిచిపోలేని మధురస్మృతులు....

**దాసరి నారాయణరావు గారికి సుద్దాల అశోక్‌తేజ వినిపించిన తొలిపాట పూర్తి పాఠం ఇది**

ప: నేలమ్మ-నేలమ్మ-నేలమ్మ
నీకు వేల వేల వందనాలమ్మ
చ: సాలేటి వానకు తుళ్లింత - ఇంక
సాలు సాలుకు నువ్వు బాలింత
నీళ్లనే చనుబాలుగా-గాలినే ఉయ్యాలగా
పక్కల్లో -రెక్కల్లో డొక్కల్లో-నువు
చక్కగా మోసేవు మొక్కల్ని
పరువమొచ్చి చేనువంగె-పైరు
కాపు మేనుప్పొంగె
పంట బిడ్డల రైతు బండికెత్తినంక
పగిలి పోతుందమ్మ నీ కన్న కడుపింక ॥నేలమ్మ॥
చ: తల్లి నువు నవ్వితే మాగాణి -ఎద
తలుపు తీశావంటే సింగరేణి
తనువునే తవ్వి తీసిన
మనసునే తవ్వి తీసిన
మనసునే తొలిచేసినా
పొట్టతిప్పలు కొరకు బిడ్డలు -నీ
పొట్టలో పడుతున్న తిప్పలు
ఏ రోజుకారోజు తీరి - వాళ్ల
నూరేళ్ల ఆయుష్షుకోరి
కడుపులో తిరిగేటి కొడుకుల కొరకు
తిరుగున్నావేమొ సూర్యుని గుడిచుట్టు ॥నేలమ్మ॥
చ: తైలాలు పూసింది నైలూనది -నీకు
తలస్నాన మయ్యింది గంగానది
గంధమే పూసిందహో-
పొందుగా హో యాంగ్ హో
ఖండాలలో రంగు రంగుపూలో
గండుకోయిలలో నైటింగేళ్లు
కొలువైనదా వెండికొండ
నా జాలి గుండెల జెండ
ఇన్ని వున్నా - మనిషికన్నీళ్లు రక్తాలు
కన్నుల కనలేక కంపించిపోతామ ॥నేలమ్మ॥
చ: మా తల్లి నీ మట్టి బంగారం -అది
మానవాళి నుదుట సిందూరం
అమ్మ నీ అనురాగమూ-
కమ్మనీ సమభాగమూ
గొప్పలు-తప్పలు చూడక -ఇంక
ఎప్పుడు మమ్మెడబాయక
జన్మించినా రారాజులై-
పేరొందినా నిరుపేదలై
నీ ఒంటి పై నుతులచితులు కాల్చుకున్న
నీ వంటి తల్లింక దేవుళ్లకే లేదు ॥నేలమ్మ॥

జిల్లా మెట్‌పల్లిలో ఉద్యోగం చేశాను. 150 రూపాయల జీతం. అప్పుడు చాలా కష్టాలు అనుభవించాను.

ఉత్తేజ్ మా అక్కయ్య కొడుకు. నేను చిన్నప్పట్నుంచి పాటలు రాయటం, వాటికి ప్రైజులు పొందడం అవన్నీ వాడికి తెలుసు. వాడు అప్పటికే హైదరాబాద్ వచ్చి కొన్ని సినిమాలకు పని చేయటం జరిగింది. నేను మెట్‌పల్లిలో టీచర్‌గా చేస్తున్నప్పుడే ఒకసారి అన్నాడు 'మామయ్యా నువ్వు సినిమాల్లో ఎందుకు రాయకూడదు?' అని. 'సినిమా రచయితలంటే ఫైల్స్ పట్టుకుని అందరి చుట్టూ తిరగాలి, మనల్ని పట్టించుకునే వాళ్లు ఎవర్రా' అంటే 'నేనున్నాను కదా', అని చెప్పి తీసుకువచ్చాడు. నేను అప్పుడే వాడికి చెప్పాను. 'నేను పాట వినిపిస్తాను అయితే సినిమాల్లో పాటలాగా మాత్రం కాదు' అని. ప్రెస్‌క్లబ్‌లో టి.కృష్ణ, గద్దర్, ఉత్తేజ్ సమక్షంలో నా పాటలు వినిపించాను. అది భరణిగారికి తెలిసింది. 'మీ మామయ్యను ఓ సారి తీసుకురారా?' అని ఆయన అనటంతో, ఉత్తేజ్ నన్ను భరణిగారి దగ్గరకు తీసుకుని వెళ్లాడు. ఆ రోజు ఆయనకు షూటింగ్ హడావుడి కూడా లేకపోవటంతో ఆయనకు కూడా వినిపించాను. ఆయన చాలా ఇంప్రెస్ అయ్యారు. నెల రోజుల తర్వాత ఆయన రచన చేసిన 'నమస్తే అన్న' చిత్రానికి సిట్యుయేషన్ చెప్పి సినిమాకు తొలిపాట రాయించారు. కోటి గారు ఆ పాటను స్వరపరిచారు. అప్పుడు కూడా నేను సినిమారైటర్‌గా స్థిరపడతానని అనుకోలేదు.

'నమస్తే అన్న' చిత్రం తర్వాత నేను రెండు మూడు సినిమాలకు రాశాను. వాటిలో 'మాయదారి కుటుంబం' ఒకటి. తర్వాత 'రాయుడుగారు నాయుడు గారు'! ఆ చిత్రంలో గ్రూపు సాంగు ఒకటుంది. దాసరి నారాయణరావు గారు, మిగతా మెయిన్ క్యారెక్టర్స్ మీద ఆ పాట ఉంటుంది. ఆ పాట చిత్రీకరణ సమయంలోనే దాసరి గారు 'ఈ పాట రాసింది ఎవరు' అని అడిగారు. అక్కడే ఉన్న ఉత్తేజ్ 'మా మామయ్య' అని చెప్పటంతో ఒకసారి తీసుకురమ్మని చెప్పారంట. ఉత్తేజ్, నేనూ దాసరిగారి దగ్గరకు వెళ్లాం. ఆయన ఒకటే మాట అన్నారు **'ఇప్పటి వరకు నువ్వు రాసిన సినిమా పాటల గురించి చెప్పొద్దు. ఉద్యమాలకు పుట్టిల్లైన నీదైన నేల గురించి, నీదైన జీవితంలోంచి, నీదైన రక్తంలోంచి, నీదైన కన్నీటిలోంచి రాసుకున్న పాటలు ఏవైనా ఉంటే అవి నాకు వినిపించు'** అన్నారు. అప్పుడు నేను వినిపించిన పాట

'నేలమ్మ-నేలమ్మ-నేలమ్మ,
నీకు వేల వేల వందనాలమ్మ,
సాలేటి వానకు తుళ్లింత -
ఇంక సాలు సాలుకు నువ్వు బాలింత'.

వెంటనే దాసరి గారు - **ఆ బ్రహ్మదేవుడు అడ్డువచ్చినా సరే నీకు నేను అవకాశం ఇస్తున్నాను. నువ్వు నా సినిమాలో రాస్తున్నావ్** - అన్నారు. అన్నమాట ప్రకారం దాసరిగారు 'ఒసేయ్ రాములమ్మ'లో అవకాశం ఇచ్చారు. ఆ సినిమాలో నేను రాసిన ఆరు పాటలకు చాలా చక్కటి గుర్తింపు వచ్చింది. నేను సినిమా పాటల రచయితగా నిలబడటానికి కూడా కారణమయ్యింది. ఆ తర్వాత రాఘవేంద్రరావు గారు, ఎస్వీ కృష్ణారెడ్డిగారు, మోహన్‌బాబుగారు....ఇలా చాలామంది మంచి మంచి అవకాశాలు ఇచ్చారు.

'ఒసేయ్ రాములమ్మ' నాకు పేరు తీసుకురావటంతో అశోక్‌తేజ ఆ తరహా పాటలను మాత్రమే రాయగలడన్న ఓ ఇమేజ్ చట్రాన్ని మోహన్‌బాబు గారు బ్రేక్ చేశారు. 'కలెక్టర్ గారు'లో ఓ చక్కటి డ్యూయెట్ రాసే అవకాశం ఇచ్చారు. అలాగే రాఘవేంద్రరావు గారు 'రామసక్కనోడమ్మ చందమామ...రాకరాక వచ్చాడు అయ్యోరామ' పాటతో కమర్షియల్‌గా మంచి బూస్టప్ ఇచ్చారు. ఎస్వీ కృష్ణారెడ్డి గారు 'సకుటుంబ సపరివార సమేతంగా' చిత్రంతో సింగిల్ కార్డ్ రైటర్‌ని చేశారు.

నేను పరిశ్రమకు వచ్చిన తొలి మూడు సంవత్సరాలలోనే మూడు ప్రముఖ సంస్థలు ప్రకటించిన అవార్డులను అందుకున్నాను. 1996లో 'దళం' సినిమాలోని 'అవ్వ నీకు దండమే....' పాటకు కళాసాగర్ అవార్డు, 1997లో 'ఒసేయ్ రాములమ్మ' చిత్రంలోని 'రామసక్కని రాములమ్మో రాములమ్మా' పాటకు మనస్విని అవార్డు, 1998లో 'కంటే కూతుర్నేకను' చిత్రంలోని 'ఆడ కూతురా నీకు అడుగడుగునా వందనం' పాటకి నంది అవార్డు అందుకున్నాను.

నేను 150 రూపాయల జీతగాడిగా ఉన్నప్పుడే ఇల్లు కట్టుకోవాలని, దానికి 'పాట కుటీరం' అని పేరు పెట్టుకోవాలని కలలు కనేవాణ్ణి. ఆ కలను ఇటీవల సాకారం చేసుకోగలిగాను. నా ఇంటికి 'పాట కుటీరం' అనే పేరునే పెట్టుకున్నాను.

ప్రస్తుతం నా కోరిక ఒక్కటే...నానాటికీ దూరమైపోతున్న మానవీయ సంబంధాలు బలోపేతం కావాలి. నా పాట ద్వారా అది సాధించాలనేది నా ప్రయత్నం.

# సుద్దాల అశోక్ తేజ హిట్స్

## చిత్రం : దళం

సంగీతం, గానం : వందేమాతరం శ్రీనివాస్

ప: అవ్వనీకు దండమె
అక్కవ్వ నీకు దండమె
ఆలు నీకు దండమె
అర్థాంగి నీకు దండమె
చ: తల్లిదండ్రుల నొదిలివేసి-అన్నదమ్ముల విడిచిపెట్టి
తాళికట్టిన వాని చిటికెన వేలుతోనే నడిచివచ్చి
అత్తమామకు ఆడబిడ్డకు అందరికి నువ్వు వండిపెట్టి
గిన్నెలున్నది వూడ్చివేసి ఉన్నదే తిన్నట్టు చేసి
నిండనీ నీ కడుపు సగము నీళ్లతోనే నింపుతావు ॥ఆలు॥
చ: చుక్క పొడవకముందె నువ్వు ఇంటి చాకిరి చేసుకోని
నడుము విరిగేదాక పగలు పొలములోనే అలిసిపోయి
గడ్డిమోపుతో ఇంటికొచ్చి-చంటి పాపాల నిదరపుచ్చి
ఆలసటె కనిపించకుండ పెనిమిటికి నీ ఒడిని పంచీ
నాలో చెరిసగముకాదు బ్రతుకులో పరిపూర్ణమైతివి ॥ఆలు॥
చ: బతుకు ముళ్ల బాటలోన జతగ స్నేహితురాలవైతివి
కళ్ల నీళ్లు తుడిచేవేళ తోడబుట్టిన చెల్లివైతివి
వెనుక ముందు లాడు వేళ వెన్ను తట్టిన భార్యవైతివి
పురిటి నొప్పుల బాధ తెలియని పురుషజాతికి తల్లివయితివి
మానవతకే మోక్షమిచ్చిన మాతృదేవత మూర్తివైతివి ॥ఆలు॥
చ: మూడు రోజుల నుంచి మేము పిడికెడన్నము నోచుకోక
అడవిలో పడిపోయినామని గడపగడపకు కొంగు సాచి
గటుక బువ్వలు బిచ్చమెత్తి కడుపులోపల దాచి తెచ్చి
అన్నలకు తినిపించినావు- అమ్మలా అనిపించినావు ॥ఆలు॥
చ: ఉద్యమాలను గుండెలోపలి ఊపిరిగ తలపోసినందుకు
నిన్ను ఒంటిగ వదిలివేసి పోరుబాటకు నేను పోతే
నిందలెన్నో వేసి నిన్ను ఎన్ని హింసలు పెడితెనేమి
నిప్పుల పోరాట మందున నిందకూడ పూలదండే ॥ఆలు॥
చ: ఆడదానికి మానమే ప్రాణనికన్న ప్రాణమనుకొని
పూలుగాజులతోని నువ్వు పుణ్యస్త్రీగా మిగులుదామని
మొగుడి కన్న ముందుగానే మొగుడి ఒడిలో కన్నుమూసి
ఆలిగా చెరిసగము కాదు ఆకసము సగమయ్యి నావు॥ఆలు॥

## చిత్రం : ఒసేయ్ రాములమ్మ

సంగీతం : వందేమాతరం శ్రీనివాస్ గానం: ఎం.ఎం.కీరవాణి, శ్రీలేఖ

ప: రామ చక్కని తల్లి రాములమ్మో-రాములమ్మో
రాయోలె కూచున్న వెందుకమ్మో - ఎందుకమ్మో
చ: తాచుపాములు కరిచె ఇటువంటి తావుల్లో
దయ్యాలు బూతాలు తిరిగేటి ఘడియల్ల
ఎండీన చెట్టూకు రాలిన ఆకోలె
ఒక్కదానివి నువ్వు రాములమ్మో- రాములమ్మో
వెక్కెక్కి ఏడ్చేవు ఎందుకమ్మో-ఎందుకమ్మో
చ: ఎట్ల చెప్పదునయ్య నా బాధను నా నోటితో
ఏమనిచెప్పుదు నా గోడును నా తండ్రితో
దయ్యాలు ముట్టిన ఫలమయ్యి పోతిని
కన్న తల్లికి నేను బరువయ్యి పోతిని
నలుగురిలో మీకు నల్ల మొకము జేసే
ఆడపోరిగ నేను పుడితీనయ్యో- పుడితీనయ్యో
అడవిలో మానయి పోతానయ్యో- పోతానయ్యో
చ: తెలుపేదో నలుపేదో తెలువని తల్లివి
బతుకు శాపమైన బంగారు తల్లివి
నిన్ను గొట్టిన తల్లి కన్నీరు పెడుతుంది
నన్ను తల్లను కోని రాములమ్మో-రాములమ్మో
ఉన్న ముచ్చట చెప్ప రాములమ్మో-రాములమ్మో
చ: పటువారి దొరగారు-అరిటాకులో నాకు
పరమాన్నం పెడుతుంటె-పరమాత్ముడనుకున్న
ఆడుకొమ్మని నాకు ఆటబొమ్మలిస్తే
దయగల్ల మా రాజు ధర్మాత్ముడనుకున్నా
జాలి తోటి నాకు జామ పండు ఇచ్చి
తలమీద చెయి పెడితె తండ్రి లెక్కనుకున్న
వెండి గిన్నెల పాలు పోసి నాకిస్తుంటే
దండిగుణము జూసి దండాలు పెట్టిన
కాటువేసెదాక తెలువదయ్య నాకు
కడుపులో విసమయ్యి అది పెరిగిపోయింది
కొరగాని బతుకయ్యి పోయిందయ్యో-పోయిందయ్యో
కొరివి పెట్టి సాగనంపాలయ్యో-చంపాలయ్యో ! అమ్మో....

## చిత్రం : కంటే కూతుర్నే కను

సంగీతం: వందేమాతరం శ్రీనివాస్ గానం : చిత్ర

ప: ఆడకూతురా నీకు
అడుగడుగున వందనం
అనునిత్యం కరుగుతున్న
నీవు రక్త చందనం ॥ఆడ॥
చ: మహరాజులే మగాళ్లు అందరు
తెల్లవారినా నిదర లేవరు
కంటినిండ కునుకు కనలేదు నీవెప్పడు
సగమునిదురలోనె నినులేపేను చీపురు
మగ బిడ్డల యోగ మేమిటో
లేవగానే భోగమేమిటో
ఎగతాళిగ- నిన్నేగని
నవ్వె పాచి గిన్నెలు ॥ఆడ॥
చ: బండచాకిరి రేబవలు చేసినా
గుండెబరువని నీ పేరు పెట్టిరి
పదహారవ ఏట ఇకమొదలు వరుడివేట
నీ బరువు దించుకోవడమే తల్లిదండ్రి ముచ్చట
పుటకనుండి చావు మధ్యనా
బతుకు నంత అరగదీసినా
ఏ జీతము- ఏ సెలవులు
ఎరుగని ఒక దాసివి ॥ఆడ॥
చ: పెళ్లి పీటపై కంఠాన్ని ముడేసి
నాతి చరామి అంటాడు ఒట్టేసి
అక్షింతలతోనే మంత్రాలు నేలపాలు
ఆ మరునాటి నుండే నీ బతుకు బూటు కాలు
ఇంటికి దీపం ఇల్లాలు
అత్తమామ కాదంటే చీకటి పాలు
మగవాడే నీ నొసటన
రాసె మనువు రాతలు ॥ఆడ॥

# తాతా థిత్తై తథిగిణతోం

సీరియల్ 13

- జీడిగుంట రామచంద్రమూర్తి

| పాత్రలు | నటీనటుల సజేషన్ |
|---|---|
| వీరభద్రం | - కోట శ్రీనివాసరావు |
| విష్ణుమూర్తి | - నూతన్‌ప్రసాద్ |
| శ్రీరామ్ | - తరుణ్ |
| అశ్విని | - శ్రియ |
| పార్వతమ్మ | - అన్నపూర్ణ |
| హనుమంతు | - గుండు హనుమంతరావు |
| అనంత్ | - గోపీచంద్ |

పైన ఉదహరించిన నటీనటులను మనసులో ఉంచుకుని ఈ సీరియల్‌ను మీ మనో నేత్రాలతో తిలకించండి.

## జరిగిన కథ

రాజుపాలెం గ్రామంలోని రావుబహద్దర్ వీరభద్రం అంటే ఇంట్లోవాళ్లకు, బయటవాళ్లకు అందరికీ హడల్. పట్నంలో చదువుతున్న అతని కొడుకు శ్రీరామ్‌కి కూడా. అందుకే అశ్విని అనే డబ్బున్న అందమైన అమ్మాయి తనను ప్రేమిస్తున్నా ముందువెనకలాడుతూంటాడు. శ్రీరామ్ అంటే అభిమానం పెంచుకున్న అశ్విని తండ్రి విష్ణుమూర్తి వీరభద్రం ఇంటికి వచ్చి పెళ్లి ప్రతిపాదన తెస్తాడు. వీరభద్రం అతన్ని అవమానించి పంపడంతో విష్ణుమూర్తి కోపగించుకుంటాడు. శ్రీరామ్ తండ్రితో పెళ్ళి ప్రస్తావన చేయడానికి రాజుపాలెం వస్తాడు.

- ఇక చదవండి



"ఏమోయ్ శ్రీరామ్! పరీక్షలు బాగా రాశావా?" భోంచేస్తూ అడిగేడు చిదంబరం.

"బాగానే రాశానంకుల్!... క్లాసురావచ్చు!" చెప్పాడు శ్రీరామ్.

"వెరీగుడ్...మరి తర్వాతేమిటి?"

శ్రీరామ్ జవాబు చెప్పేలోగానే ..వీరభద్రం కల్పించుకున్నాడు..

"ఏమున్నదీ?వచ్చే మాసమున మంచి ముహూర్తములుండును కదా !... వివాహము చేయ నిశ్చయించితిని!"

కాగల కార్యాన్ని గంధర్వులే తీర్చినట్టు ..తాను చెప్పదల్చుకున్న విషయాన్ని తన తండ్రే ప్రస్తావించటంవల్ల శ్రీరామ్ ఊపిరి పీల్చుకున్నాడు. కుడిచేతి దండకు కట్టుకున్న తాయెత్తును ఎవరూ చూడకుండా - ఓసారి కళ్ళకు అద్దుకున్నాడు.

"అప్పుడే పెళ్లేమిట్రా?.... పోస్ట్ గ్రాడ్యుయేషన్ చేయించు!" అంతలో చిదంబరం సలహా ఇచ్చాడు.

"ఏ వయసుకా ముచ్చట తీరవలెనుగదా..! మా సుపుత్రుడికి మేనరికము కూడా వున్నదాయె!..

"అవుననుకో !...కానీ మరీ ఇంత చిన్న వయసులో "అంటూ ఏదో చెప్పబోతున్న చిదంబరం మాటలకు మధ్యలోనే అడ్డం పడుతూ చెప్పాడు వీరభద్రం.

"నన్నడిగితే ఇదే సరైన వయసు! నా వివాహం ఏ వయసున జరిగెనో నీకు తెలియును కదా!.. అప్పుడు నాకు కేవలం ఇరువది సంవత్సరాలు!... మరి వీనికి అప్పుడే ఇరువది రెండు దాటినది.. అనారోగ్యము వల్ల ఒక సంవత్సరమూ, కాలేజీ నందు సీటు లభించక మరియొక సంవత్సరమూ వృధా అయినందువల్ల ఇంకనూ డిగ్రీయందే ఉండిపోయాడు.. లేకున్న, నీవన్నట్టు ఇప్పటకి పోస్టు గ్రాడ్యుయేషన్ సైతము పూర్తయి వుండెడిది...అయినా, మనసున్నచో మార్గ మదియే లభిస్తుందనీ..మా 'కుంక'కి ఇంకా చదువు కోవలయునన్న అభిలాషే వుంటే ఓపెన్ విశ్వ విద్యాలయములుండనే వున్నవి!.




ప్రేయివేటుగా అఘోరించవచ్చు!"

'కుంక', అఘోరింవు, అనే పదాల్ని ప్రయోగించినందుకు- తండ్రి వైపు గుర్రుగా చూశాడు శ్రీరామ్.

"అయితే త్వరలోనే మాకు పెళ్ళి భోజనాలున్నాయన్నమాట!" చిదంబరం చిరునవ్వుతో అన్నాడు.

"ఆహా!...నేను రేపే ఏలూరు వెళ్లి..మా బావ గారితో ముచ్చటించి - ముహూర్తం నిశ్చయించ దలిచాను!" చెప్పేడు వీరభద్రం.

"మీరు 'ఏలూరు' వెళ్ళక్కర్లేదు.. మావయ్య గారమ్మాయిని నేను చేసుకోవటం లేదు" మంచి నీళ్ళు తాగుతున్న శ్రీరామ్ మధ్యలోనే ఆపి - చేతిలో వున్న గాజుగ్లాసుని బల్లమీద కొట్టి మరీ




చెప్పాడు. ఆ గ్లాసు రెండు ముక్కలై అందులో వున్న నీళ్లన్నీ ఒలికిపోయాయి.

శ్రీరామ్ -తండ్రిని అలా ఎదిరించి సమాధానం చెప్పేసరికి -వడ్డన చేస్తున్న పార్వతమ్మ -టర్కీలో వచ్చిన భూకంపం - తమ ఇంట్లో కూడా సంభవించినట్టుగా హడలిపోయి చేతిలో వున్న పులుసు గరిటె చిదంబరం విస్తట్లో వదిలేసింది. ఆమెకు వెనుకగా గోడమీద పాకుతున్న బల్లీ ఆ పక్కనే గడియారంలో 'టిక్కు టిక్కు' మని శబ్దం చేస్తూ తిరుగుతున్న సెకండ్లముల్లూ హఠాత్తుగా ఆగిపోయాయి..

వీరభద్రం చివ్వున తలెత్తి శ్రీరామ్ వైపు చూశాడు

"ఏదీ ? నీ హెడ్డు పైకెత్తి-నాఫేసులోకి చూసి ఆ మాట మళ్లీ చెప్పు" ఉగ్రనేత్రుడై అడిగేడు.

"నాకేమన్నా భయమా?...నీ మొహంలోకి చూస్తూ ఒకసారి కాదు...వందసార్లు చెప్పగలను...! శ్రద్ధగావిను...నేను శ్యామసుందర్ని చేసుకునేది 'లేదుగాక లేదు' మా క్లాస్ మేట్ అశ్విని నేను గాఢంగా ప్రేమించాను. పెళ్ళంటూ చేసుకుంటే ఆ పిల్లనే చేసుకుంటాను.. కాదంటే ఏ హిమాలయాలకో పోయి తపస్సు చేసుకుంటాను!" చిదంబరం కంచం పక్కనే వున్న మరో గాజుగ్లాసు తీసి బల్లమీద కొట్టబోయాడు శ్రీరామ్.

కానీ అతని ప్రయత్నాన్ని చిదంబరం వారించి, ఆ గ్లాసు లాగేసుకున్నాడు- "ఆ మాట చెప్పటానికి బంగారంలాంటి గ్లాసులెందుకయ్యా పగల గొట్టడం?" అడిగేడు.

"మా ఇంట్లో కుండలు లేవు కనుక!"

"నోరుమూయుము! తన కుమార్తెను ఈ ఇంటి కోడలుగా చేసుకుందునని చనిపోయిన నా సోదరికి-తన మరణశయ్యపై మాట నిచ్చితిని! మాట తప్పుట మన రావుబహద్దర్ల వంశమున లేనే లేదు..!" తీవ్ర స్వరంతో చెప్పేడు వీరభద్రం.

"పెళ్ళనేది నూరేళ్ళ పంట ! పైగా నా జీవితానికి సంబంధించిన విషయం.. పెళ్లి చేసుకుంటానని అశ్వినికి నేను కూడా మాటఇచ్చాను! ఇచ్చిన మాట తప్పటం మన వంశంలోనేలేదని - ఇప్పుడు నువ్వే చెప్పావు!.... అయినా నువ్ అత్తయ్యకి 'చనిపోయేముందు' మాటిచ్చా నంటున్నావ్!...ఇప్పుడు ఆ మాట తప్పితే, ఆవిడగారు బతికొచ్చి నిన్ను నిలదియ్యదు. కానీ, నేను 'బ్రతికున్న' అశ్వినికి మాటఇచ్చాను. అది నేను తప్పితే...నా అశ్విని ఆత్మహత్య చేసుకుంటుంది. అప్పుడు ఆ పాపం నీదవుతుంది!" కంచంలో ఇంకా అన్నం వుండగానే, అందులో చేయి కడిగేసుకుంటూ ఆవేశంగా అన్నాడు శ్రీరామ్.

వీరభద్రానికి నరనరాల్లోనూ రక్తానికి బదులు కోపమే ప్రవహిస్తోంది.

"చదువుకొమ్మని టౌనుకి పంపితే క్లాసులెగ్గొట్టి అడ్డమైన సినిమాలు చూసిన తమరికి ఆ

సంభాషణలు బాగుగానే ఒంటబట్టినవి. అయిననూ, నీ తాటాకు చప్పుళ్లకు ఈ కుందేలు భయపడుట కల్ల!.. నీకు 'త్రీ అవర్స్' అనగా అక్షరాలా మూడు గంటలు సమయమిస్తున్నాను. ఈ లోగా మనసు మార్చుకొమ్ము!'' వీరభద్రం కూడా ఆవేశంగానే హెచ్చరించాడు. 'హేంగర్'కి వేలాడుతున్న టవల్‌తో చేయి తుడుచుకుంటున్న శ్రీరామ్ తండ్రి మాటల్ని లక్ష్య పెట్టలేదు.. పెట్టకపోగా, రెండడుగులు ఆయనకు ఎదురుగా వచ్చాడు.

"నీకూ మూడు రోజులు గడువిస్తున్నా! ఈ లోగా నువ్వే మనసుమార్చుకుని మర్యాదగా మా పెళ్లికి ఒప్పుకో! లేదంటే నాలుగోరోజు పొద్దున పదింటికల్లా, నేనూ అశ్విని, రిజిస్ట్రార్ ఆఫీసుకెళ్లి పెళ్లి చేసుకుంటాం!...." అన్నాడు.

ఆ తర్వాత మరి మాట్లాడే అవకాశం తండ్రికివ్వకుండా, ఒకవేళ మాట్లాడినా వినే అవసరం తనకు రాకుండా అక్కణ్ణించి వేగంగా వీధిలోకి వెళ్లిపోయాడు....

తన ఆగ్రహావేశాల్ని అణుచుకునే ప్రయత్నం చేస్తూ పక్కన కూర్చుని భోంచేస్తున్న చిదంబరంతో ఏదో చెప్పబోయాడు వీరభద్రం. కానీ అదే క్షణంలో అతని గుండెను ఎవరో నొక్కి పట్టినట్టుగా ఉవ్వెత్తున నెప్పిలేచింది. చేయి కడిగేసుకుని, ఎడం చేత్తో గుండెను గట్టిగా ఒత్తుకుంటూ వెళ్లి మంచం మీద కూర్చుండిపోయాడు. ఒళ్లంతా చెమట్లు పోశాయి..

చిదంబరం పరిస్థితిని అర్థం చేసుకున్నాడు.

"ఏమిట్రా భద్రం..ఏమైంది?" అంటూ గబగబా వీరభద్రాన్ని చేరుకున్నాడు.

"ఏం కాలేదురా ! కొంచెం నొప్పిగా వున్నది. స్కూల్ పిల్లలను సైతము గట్టిగా అరచుట తెలియని వాడను. ఇప్పుడు ఆవేశమున వాడిపై విరుచుకుపడితిని గదా ! అందుకనీ.."గుండెను అలా చేత్తో అదుముకుంటూనే, కళ్ళు మూసుకుని చెప్పాడు వీరభద్రం.

భర్త పరిస్థితిని గమనించిన పార్వతమ్మ




భయంతో వణికి పోయింది. మనసెందుకో కీడు శంకించింది.

"డాక్టర్‌గారి దగ్గరకు వెడదామా?" భర్తను చేరుకుని అడిగింది ఆందోళనగా.

'వద్ద'ని చేత్తోనే సైగ చేశాడు వీరభద్రం.

కానీ శరీరమంతా చెమటతో తడిసి పోతూండటాన్ని గమనించిన చిదంబరం క్షణం ఆలస్యం చేయకుండా, వీరభద్రాన్ని తన కార్లో ఎక్కించుకుని పక్కవీధిలోనే వున్న నర్సింగ్‌హోంకి తీసు కెళ్ళాడు.

'నర్సింగ్‌హోం'లో పరీక్షలన్నీ చేసిన డాక్టరు వీరభద్రానికి రక్తపోటు అధికమైందనీ, ఆ కారణం వల్లనే గుండెపోటుకూడా వచ్చిందనీ నిర్ధారణగా చెప్పాడు. కనీసం రెండునెలలైనా విశ్రాంతి తీసుకోవాలని ప్రిస్క్రిప్షన్ కూడా రాసిచ్చాడు. ఉద్రేక పడవద్దనీ, ఉప్పూ కారాలు వాడద్దనీ హెచ్చరించాడు. రెండురోజులు ఇంటెన్సివ్ కేర్ లో వున్నాక మూడోనాడు సాయంత్రం ఇంటికి తిరిగొచ్చాడు వీరభద్రం..

ఆ రాత్రి, చిదంబరం చెప్పాడు-

"రోజులు మారిపోతున్నాయిరా భద్రుడూ!, వాటితో పాటు మనం కూడా మారుతుండాలి. ఒకప్పుడు బాల్యవివాహాలు చేసేవారు..పెద్దవాళ్లే మంచి చెడ్డలన్నీ చూసి సంబంధాలు కుదిర్చేవారు. కానీ ఈ రోజుల్లో 'యవ్వన వివాహాలు ' మాత్రమే జరుగుతున్నాయి. యుక్త వయస్సొచ్చాక అబ్బాయీ, అమ్మాయీ ఒకరినొకరు చూసుకుని, అర్థంచేసుకుని-ప్రేమించుకుని మరీ పెళ్ళిళ్లు చేసుకుంటున్నారు. మనది జరిగిపోతున్న తరం. జారిపోతున్న తరం!. కానీ వాళ్లది యువతరం ...నవతరం!.. నువ్వు అనవసరంగా ఆవేశం తెచ్చుకున్నావే తప్ప - ఇందులో మీ వాడి తప్పు, తొందరపాటూ నాకేం కనిపించలేదు!."

ఆ హితవచనాలు వీరభద్రానికి రుచించలేదు 'వాడిని సమర్థించుట నీ అవివేకము! నాకు ఎదురుబడుటకే ధైర్యములేనివాడు ఈ రోజున ఏకవచన ప్రయోగం గావిస్తూ "నువ్వు, నీకు', అని సంబోధిస్తాడా ?" అన్నాడు.

"అదిగో..నువ్ మళ్లీ ఆవేశం తెచ్చుకుంటున్నావ్!, అయినా, పదిమందికి చెప్ప గలిగే మాస్టారువి నువ్వు ..! ఆర్యధర్మం లో ఏం చెప్పారో నీకు తెలీదూ?" అడిగాడు చిదంబరం..

అర్థంకానట్టు చూశాడు వీరభద్రం.

"పుత్రుణ్ణి అయిదేళ్ల వరకూ ప్రేమగా పెంచాలట!. పదిహేనేళ్లు వచ్చేవరకూ దండించైనాసరే భయ భక్తుల్లో వుంచాలి! పదహారేళ్ల దాటింతర్వాత స్నేహితుడిలాగా చూసుకోవాలట" వివరించాడు చిదంబరం.

వీరభద్రం మౌనంగా వింటూ వుండిపోయాడు. అదే సమయమనుకున్న పార్వతమ్మ అక్కడకొచ్చింది.

"మీ చెల్లెలికిచ్చిన మాట తప్పినట్టవుతుందని భయపడుతున్నారే తప్ప-రేపు ఆవిడ కూతుర్ని ఈ ఇంటి కోడలుగా తెచ్చుకుంటే ఏమవుతుందో ఆలోచించారా ?" అడిగింది.

ఆమె వైపు ప్రశ్నార్థకంగా చూశాడు వీరభద్రం.

తన ప్రశ్నకు జవాబుగా తనే, మళ్లీ చెప్పింది పార్వతమ్మ

"మీ బావగార్ని కట్నం కానుకలు ఇవ్వమని మనం అడగలేం..'' అంటూ ఇంకా చెప్పబోతుండగానే

"అదిగో ..ఆ కూతే కూయవద్దని చెప్పాను!. కట్నం కానుకలు పుచ్చుకొనుట చట్టరీత్యా నేరం... అటుపై వాటిని మా సంఘం కూడా నిషేధించినది....!"అంటూ విరుచుకు పడ్డాడు వీరభద్రం.

(ఇంకావుంది)



జస్ట్ ఫర్ ఫన్

# గోవిందా... గోహోవిందా

**పోలింగు రోజున అవసరమయితే ఇంటికయినా వెళ్ళి ఓటు వేయించుకునే వెసులుబాటు అభ్యర్థులకు భవిష్యత్తులో కలిగితే ఎలా ఉంటుందో నన్న చిలిపి ఊహకి రూప కల్పన యిది.**

రాజకీయ నాయకులు ఓటు కోసం శవాన్ని కూడా వదలరని నా నుడి!

పోలింగుక్షణాలు ముగుస్తుండగా, ఆ ఇంట్లో ఇవాళ్లో రేపో అన్నట్లున్న ఒక ప్రాణి ఉందని తెలిసి ఉరుకులు పరుగులతో ముగ్గురు అభ్యర్థులు ఎలక్షన్ ఆఫీసరుని వెంటబెట్టుకుని వచ్చారు.

ఓ పెద్దాయన మంచాన్నతుక్కుని కళ్ళు శూన్యంలోకి చూస్తూండగా ఎగశ్వాసతో క్షణాలు లెక్కపెడుతుంటే, మంచం ప్రక్క ఆ క్షణాలు కోసం నిముషాలు లెక్కపెడుతూ కూర్చుని ఉన్నాడు అతని మనవడు.

ఒక్కమాటు చుట్టూ పరికించి మనవడితో నాలుగు సానుభూతి వాక్యాలు పలికి, తాము వచ్చిన పనిని మెల్లగా బయటపెడుతూ, 'ఓటు జన్మహక్కు' అని జన్మను చాలించబోతున్న తాతగారి ఈ జన్మకి గల ఆ హక్కుని కాదనే హక్కు మనకు లేదని అభ్యర్థులు వివరించారు.

'ఓటు మాటదేముడెరుగు, రాత్రి నుండి మాట కూడాపడిపోయింది తాతకి' అన్నాడు మనవడు దిగులుగా.

పట్టువదలని ఆ రాజకీయ విక్రమార్కులు తమ ప్రయత్నాన్ని విరమించు కోలేదు. మెదటి అభ్యర్థి తాత తలవైపుకి వెళ్ళి "తాతా! నీ ఓటు ఎవరికి? తెలుగుదేశానికేగా?" అని నారాయణ మంత్రం చెవిలో ఊదినట్లుగా కొంచెం గట్టిగానే అడిగాడు. శరీరంలో కదలిక లేకపోయినా తెరుచుకునే ఉన్న తాత నోటివెంట'ఆ'...అన్న శబ్దం వచ్చింది. విప్పారిన ముఖంతో అభ్యర్థి 'అయితే నీ ఓటు తెలుగుదేశానికేనన్నమాట" అన్నాడు చెవిలో కొంచెం గట్టిగా.

'ఆ' ...మళ్ళీ అదే శబ్దం.

వెుదటి అభ్యర్థి సంతోషంగా ఎలక్షను ఆఫీసరు వైపు తిరిగి చూశారా-"ఆయన ఓటు మాకే, వ్రాసుకోండి" అన్నాడు.

ఇంతలో రెండవ అభ్యర్థి అడ్డుపడుతూ "ఆగండి ఆయన ఆ....' అని ఆవులించాడు అంతేకాని అవునని కాదు. నేనడుగుతాను" అని, తాత చెవి దగ్గరకు వెళ్ళి "తాతా నీ ఓటు కాంగ్రెసుకేనా" అన్నాడు మరింత గట్టిగా.

'ఆ..' డిటో శబ్దం.

"చూశారా ఆయన ఓటు మా పార్టీకే, వ్రాసుకోండి" అన్నాడు రెండో అభ్యర్థి.




మూడో అభ్యర్థి కల్పించుకుంటూ... "మీరు కాస్త ఆగుతారా, పెద్దాయన... ఆ... అంటే ఏమిటీ అని అర్థం... నేను అడుగుతా చూడండి". అని మూడో అభ్యర్థి తాత చెవిలో "నీ ఓటు బి జె పి కే కాదా తాతా" అని అరిచాడు.

'......'

ఈ మాటు శబ్దం లేదు. మాటతో పాటు ఓటు ఎగిరిపోయింది. తాత గుడ్లు తేలేశాడు.

"ఈ ముగ్గురూ మా తాతను చంపేశారు నాయనోయ్" అని గొల్లుమన్నాడు ఆ క్షణం కోసం ఎదురు తెన్నులు చూస్తున్న మనవడు.

'చంపేశారు' అన్నమాట ఒక్కటే వినబడ్డ 'అధికారి' నేరచరిత్ర గల ముగ్గురు అభ్యర్థుల గురించి ఇప్పుడే లోక్‌సత్తాకు ఫిర్యాదు చేస్తానంటూ పెన్ను జేబులో పెట్టుకుని చక్కాపోయాడు.

"ఆ.."

అన్నారు అభ్యర్థులు ముగ్గురూ కోరస్‌గా!!

**(క..రాజు కథలు స్ఫూర్తితో.....)**

**- వెంపరాల శారద, రాజోలు**



జంతువులు మనగురించి మాట్లాడేది తెలిసిపోతే
ఎంత తమాషాగా ఉంటుందో వివరించే...



బాల్యపు
లేతదనం
మళ్లీ కోరుకునే
పెద్దలకు
మరీ మరీ
ప్రత్యేకం

పిల్లల కోసం ప్రత్యేకం...



# డాక్టర్ డూలిటిల్

నవలీకరణ
**ఎమ్బీయస్ ప్రసాద్**

చిత్ర పరిచయం 5

సమన్వయం
**మంజీర**

### జరిగిన కథ

జాన్ డూలిటిల్ చిన్నప్పుడు జంతువులభాష అర్థం చేసుకునేవాడు. క్రమేపీ ఆ శక్తి పోయింది. పెరిగి డాక్టరయ్యాక ఓ రోజు హఠాత్తుగా ఆ శక్తి తిరిగివచ్చింది. దానితో ఖంగారుపడ్డాడు. భార్యతో సహా ఎవరికీ చెప్పలేదు. బ్రెయిన్ స్కాన్ చేయించుకున్నాడు. డాక్టరు ప్రాబ్లెమ్ ఏదీ లేదన్నాడు. ఫామ్‌హౌస్‌లో ఓ గుడ్లగూబ వచ్చి రెక్కలో గుచ్చుకున్న ముల్లుముక్క తీయించేసుకుంది. ఇతను చేసిన ఉపకారాన్ని సిటీకొచ్చి పదిమందికీ చెప్పడంతో ఓ రోజు రాత్రి నానారకాల జంతువులూ ఇతని ఇంటిమీదకు వచ్చిపడ్డాయి. ఇంట్లో ఉన్న భార్య, పెద్దకూతురుకు తెలియకుండా మేనేజ్ చేద్దామని ప్రయత్నిస్తూంటే పెద్దకూతురు పెప్రీకా వచ్చి బాత్‌రూమ్ కెళతానంది.- ఇక చదవండి

అలా కూతురుని కాస్త ఆపి గదిలోకి వెళ్లి మేక మెడలో తాడును ఓ టేబుల్ సొరుగు హేండిల్‌కి గట్టిగా కట్టేసి ధైర్యంగా కూతురితో మాట్లాడడానికి బయటకు వచ్చాడు. మాట్లాడగలడే కానీ బాతులరూముగా మారిపోయిన బాత్‌రూముకు ఆ పిల్లను పంపలేడుకదా! అందుకని లేనిపోని అథారిటీని తెచ్చిపెట్టుకుని, "చూడు, గడగడా కూల్‌డ్రింక్‌లు తాగేసేటప్పుడే నువ్వు ఆలోచించుకోవాల్సిం. ఇలా చీటికీమాటికీ బాత్‌రూమ్‌కు వెళ్లడం మంచిదికాదు, పెద్దదానివయ్యావు, ఆపుకోవడం నేర్చుకోవాలి. వెళ్లు, వెళ్లి పడుక్కో" అని ఆర్డరేసాడు.

నాన్న ధోరణి ఆ పిల్లకు అంతుపట్టలేదు. "బాత్‌రూమ్‌కి వెళ్లి తీరాలి నాన్నా" అంది ఏడుపుమొహం పెట్టి.



"లక్కీ బాత్‌రూమ్ యూజ్ చేస్తోంది. కాస్త ఆగు." అన్నాడు జాన్ ఏదో ఒకటి అనాలని.

ఒక్కదెబ్బతో పెప్రీకా నిద్రమత్తు వదిలిపోయింది. "కుక్క బాత్‌రూమ్ యూజ్ చేయడమా?" అని అడిగింది నిర్ఘాంతపోతూ.

జాన్ పరువు కాపాడే అవకాశం వచ్చింది లక్కీకి. జాన్ మాట నిలబెట్టడానికి ఫ్లష్‌చేసి బాత్‌రూమ్‌లోంచి బయటకు నడిచింది. ఫ్లష్ చప్పుడు వినబడడం, టాయిలెట్ పేపరు ఈడ్చుకుంటూ లక్కీ బయటకు రావడం చూసి పెప్రీకా మతిపోగొట్టుకుంది. దానికి తోడు తండ్రి "ఆగాగు, లక్కీ సరిగ్గా ఫ్లష్ చేసిందో లేదో చూస్తాను." అంటూ బాత్‌రూమ్‌లోకి దూరడం మరీ వింతగా అనిపించింది.



బాత్‌రూమ్‌లోకి వచ్చిన జాన్ గబగబా బాతులను స్విమ్మింగ్ టబ్‌లోకి తరలిస్తూండగానే ఇంక ఆగలేక పెప్రీకా లోపలకి వచ్చేసింది. అదృష్టవశాత్తూ ఆ టైముకు కర్టెన్ వేసేయగలిగేడు జాన్. తన కంగారు కప్పిపుచ్చుకోవడానికి టాయిలెట్ తనెంత బాగా శుభ్రపరిచాడో, అందరూ దాన్ని ఎంత జాగ్రత్తగా వాడాలో చెవుతూండగానే 'నన్నొదిలేయ్ బాబూ' అన్నట్టు పెప్రీకా ఓ దణ్ణం పెట్టింది. జాన్ ఒక్క గెంతులో బయటపడ్డాడు.



ఈలోగా మేక తన కట్టు తెంపుకుని టేబుల్ సొరుగుతో సహా డ్రాయింగ్‌రూమ్‌లో చేరింది. దాన్ని ఆపడానికి చూస్తూండగానే నాలుగు గొఱ్ఱెలు వచ్చాయి. ఆ వెనుక ఓ పంది. తర్వాత పెంగ్విన్ పక్షులు. కోళ్లు. మచ్చల కుక్క. ఈ యావత్ జంతుజాలం డ్రాయింగ్‌రూమ్‌లో సభ తీర్చడం జరిగింది. జాన్ ఈ సభ చూసి ఆశ్చర్యపడ్డాడు. అక్కడ తెలిసున్న మొహం - గుడ్లగూబ తాలూకుది- కనబడింది. ఏమిటిదంతా అన్నాడు.



"తనకు తెలిసిన మంచి విషయం పదిమందికీ చెప్పమన్నారు పెద్దలు" అంది గుడ్లగూబ.

"అంటే?"

"నువ్వు మంచివాడవని, మంచి డాక్టరువని, ముఖ్యంగా జంతువుల భాష అర్థం చేసుకుని వాళ్ల బాధలు తీరుస్తావని పదిమందికీ, అంటే పదిమందే కాదనుకో, చెప్పాను. దాంతో రకరకాల రోగాలతో బాధపడుతున్న మా వాళ్లందరూ మీ ఇంటికి ప్రయాణం కట్టారు. కాస్త వాళ్ల సంగతి చూద్దూ"

కాస్సేపటిలో అక్కడ గవర్నమెంటు ఆసుపత్రి ఓపీ వార్డు వాతావరణం నెలకొంది. డాక్టరు జాన్ డూలిటిల్ వైద్యుడిహోదాలో అందరి ఆరోగ్యసమస్యలూ వింటున్నాడు. తనకు చేతనైనంత మేరకు నయం చేస్తున్నాడు.

అన్నిటికంటె పెద్దపని ఓ పావురాల జంటకు కౌన్సిలింగ్ చేయడం. అచ్చం మనుష్యులలాగానే ఆడ పావురం మొగ పావురంపై ఫిర్యాదులు చేసింది - 'ఈయనకి తను పావురమని చెప్పుకోవడం నామోషీ. సెల్ఫ్-పిటీతో బాధపడే రకం. ఎవ్వరితోనూ కలవడు.' అని. మామూలు మొగుడుపెళ్లాల గొడవలాగే ఇదీ తేలలేదు.



తర్వాత పేషంటు ఓ సర్కస్ కోతి. డ్రెస్ అదీ వేసుకుని ఉంది. సర్కసు ఆర్టిస్టులు తాగి పడేసిన విస్కీ సీసాల్లో మిగిలినది పట్టించడానికి అలవాటు పడింది. "నేను సోషల్ డ్రింకర్‌ను. అంటే ఒకణ్నీ ఉన్నప్పుడు తాగను. ఏదో పదిమంది ఉన్నప్పుడు సొసయిటీకోసం తాగేవాణ్నన్నమాట. ఎందుకో కానీ..'



కోతి మాటలు జాన్ నమ్మలేదు. ముక్కుకొన పట్టుకుని ఒంటికాలిమీద నుంచోమన్నాడు. ఓ తెల్లగీత గీసి దానిమీద అడుగులు తడబడకుండా నడవమన్నాడు. అన్నిరకాల పరీక్షలు జరిపి, తాగుడు మానకపోతే లాభంలేదని తేల్చి చెప్పాడు.

ఆ తర్వాత సమస్య ఓ బొచ్చుకుక్కది. దాన్ని పెంచుకున్నవాళ్లు అస్తమానూ ఓ బంతి పడేసి తెమ్మనేవారు. అది తెచ్చేది. ఆ తర్వాత దానికి అది ఓ అబ్సెషన్‌గా మారిపోయింది. బంతి కనబడితే చాలు 'విసురు, నే వెళ్లి పట్టుకొస్తా' అనడం సాగించింది. జాన్ సమస్యను అర్థం చేసుకున్నాడు. బాల్ చేతిలో పెట్టుకుని 'దీని గురించి ఆలోచించకు. ఈ బంతి ఉంటే ఎంత, లేకపోతే ఎంత!' అని చూశాడు. అబ్బే, కుక్కపిల్ల వింటేనా? 'బంతి, బంతి' అని ఒకటే గోల, గెంతులు. ఆ గోల భరించలేక లక్కీ, గినిపిగ్ రోనీ (ఎక్కణ్నుంచి వచ్చి చేరిందో కానీ) ముక్తకంఠంతో అరిచాయి - 'ఆ బాల్ దాని మొహాన పడేసి పొమ్మనమను' అని. జాన్ బంతి విసిరేశాడు.



ఇంతలో బయటనుండి గుర్రం సకిలింపు వినబడింది - 'ఎవరండీ ఇక్కడ డాక్టరట!' అని.

జాన్ కిటికీలోంచి బయటకు చూశాడు. నిజంగా గుర్రమే! 'తల పైకెత్తి చూడు' అని అరిచాడు.

'తల పైకెత్తుతాను కానీ చూస్తానని హామీ ఇవ్వలేను. కళ్లు మసకేసిపోయాయి. మిలటరీలో పనిచేసేదాన్ని. కళ్లులేని కబోది నని చెప్పి తీసిపారేశారు" అని మొరపెట్టుకుంది.

జాన్ దిగివచ్చాడు, పరీక్షచేశాడు. ఓ కళ్లజోడు అమర్చాడు. 'హమ్మయ్య' అంది గుర్రం. "ఇప్పుడు బాగా కనబడుతున్నాయి. థాంక్స్. నాకు ప్రమోషన్ రాడానికి ఇప్పుడు ఏ అడ్డూ లేదు." అని చెప్పి కదిలింది.

ఓ రోజు రాత్రి లక్కీతోబాటు జాన్ తిరిగివస్తున్నాడు. 'నా దగ్గర ట్రీట్‌మెంటు తీసుకున్న ఈ జంతువులన్నీ దేశం నాలుగుమూలలకూ వెళ్లి నా సంగతి చెప్పినపుడు..." అని లక్కీతో ఏదో అంటూండగానే తాగుబోతు కోతి అతని కంటబడింది.

"తప్పంతా నాది... తను ఆత్మహత్య చేసుకుంటానంటే మాత్రం బోను గడియ తీసేయడమేనా!? నాకు బుద్ధి ఉండద్దూ...' అని పశ్చాత్తాపం సీనులో ఉంది. జాన్ కోతిని గుర్తుపట్టాడు. 'తాగుడు మానకపోతే ఇలాటి డైలాగులు ఎన్నయినా వస్తాయి'' అన్నాడు ఏ మాత్రం జాలి కనబరచకుండా.



కోతి తనచేతిలో ఉన్న బాటిల్ కేసి ఒక్క చూపు విసిరింది. ఆ తర్వాత బాటిల్నే విసిరేసింది. "నాతో బాటు సర్కస్ పనిచేసే పులి ఆత్మహత్య చేసుకోబోతోంది. వచ్చి కాపాడు." అని రిక్వెస్టు చేసింది.

ఆ కోతి, పులి ఒకే సర్కస్‌లో ఉన్నాయి. పులికి నానారకాల శారీరకబాధలు పట్టుకున్నాయి. బాధలు భరించలేక ఆత్మహత్య చేసుకుంటానంది. బోనుగడియ తీసిపెట్టమని కోతి సాయం కోరింది. సరేనంది కోతి. పులి పరిగెట్టుకెళ్లి ఐదంతస్తుల ఒంటిస్తంభం టవర్ ఎక్కింది. కోతి ఇటొచ్చి విస్కీ సహాయంతో విషాదయోగం అభినయిస్తోంది.



కోతిని, లక్కీని వెంటబెట్టుకుని కారులో జాన్ ఒంటిస్తంభం టవర్ వద్దకు వచ్చేనరికి పై అంతస్తులో అటూ ఇటూ తిరుగాడుతూ పులి తన వీలునామాను వినిపిస్తోంది. తను దొంగతనంగా దాచుకున్న విస్కీ బాటిళ్లను తన గర్ల్‌ఫ్రెండుకు, తనకు సర్కస్ వాళ్లు తొడిగిన డ్రస్‌ను తననాడించే బఫూన్‌కు ఇచ్చేస్తున్నానని యావత్ప్రపంచానికి తెలియచేస్తూ గంభీరోపన్యాసం గావిస్తోంది.

**(సశేషం)**

## చిత్ర విశేషాలు

డా.డూలిటిల్ పేరుతో 1967లో రెక్స్ హారిసన్ హీరోగా సినిమా వచ్చింది. కథానాయకుడికి జంతువుల భాష తెలుసు. మనుష్యుల కంటె జంతువులతో మాట్లాడడంలోనే ఎక్కువ హాయి పొందుతాడు. క్లయిమాక్స్‌లో జంతువులు అతన్ని రక్షిస్తాయి కూడా. రిచర్డ్ ఫ్లైషర్ దర్శకత్వంలో వెలువడిన ఈ సినిమా ఎడ్డీ మర్ఫీ సినిమాలంత ఖ్యాతిని పొందలేకపోయింది.

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

| | తమిళం | తెలుగు |
|---|---|---|
| చిత్రం | మిస్సియమ్మ | మిస్సమ్మ |
| రచన | తంజై రామయ్యాదాస్ | పింగళి నాగేంద్రరావు |
| సంగీతం | యస్.రాజేశ్వరరావు | యస్.రాజేశ్వరరావు |
| గానం | ఎ.ఎం.రాజా | ఎ.ఎం.రాజా |
| అభినయం | జెమిని గణేష్, సావిత్రి, సారంగపాణి | ఎన్.టి.రామారావు, సావిత్రి, రేలంగి |

**1955**లో వెలువడిన 'మిస్సమ్మ' చిత్రానికి చాలా ప్రత్యేకతలున్నాయి. 'మిస్సమ్మ' కథ ఒక ప్రహసనం. అయితే అలా అనిపించకుండా ఆ చిత్రం ప్రేక్షకుల మన్ననలు చూరగొన్నదంటే అందుకు ప్రధాన కారణం-ఆ చిత్రరచన చేసిన చక్రపాణిగారి ప్రతిభ. చక్రపాణి గారు తమ మేధస్సూ,హాస్యము, కథన చాతుర్యము జోడించి స్వయంకృషితో తీసిన చిత్రాలలో 'మిస్సమ్మ' ఒకటని కొడవటిగంటి కుటుంబరావుగారు చెప్పేవారు.

'మిస్సమ్మ' చిత్రానికి ఎల్.వి.ప్రసాద్ దర్శకులు. నాయికా నాయకులు ఎన్.టి.రామారావు, సావిత్రి. నాగేశ్వరరావు, జమున-చిత్రానికి మరొక జంట. 'మిస్సమ్మ' చిత్రానికి సంభాషణలు రాసినవారు చక్రపాణి . పాటల రచయిత పింగళి నాగేంద్రరావు. సంగీత దర్శకులు సాలూరి రాజేశ్వరరావు.

అప్పటిదాకా విజయవారి చిత్రాలకు సంగీత దర్శకత్వం వహించిన ఘంటసాల-మరొకరి సంగీత దర్శకత్వంలో పాడరేమోనన్న అనుమానంతో నిర్మాతలు ఘంటసాలతో కాక ఎ.ఎం.రాజాతో పాటలు పాడించారట. అయితే - అంతకు ముందు తమ తర్వాతి చిత్రంలో క్రైస్తవ భక్తిగీతాలు ఉండవచ్చుననీ ఆ పోకడలు కొంత గమనించమనీ చక్రపాణి - ఘంటసాలకు చెప్పారట. చిత్రదర్శకులు ప్రసాద్ ప్రేరణతో రాజేశ్వరరావు 'మిస్సమ్మ'కు సంగీతం సమకూర్చారని చిత్రరంగ ప్రముఖులు చెబుతూంటారు.

సావిత్రి ధరించిన పాత్ర కోసం మొదట భానుమతిని ఎన్నుకొన్నారు. కారణాంతరాలవల్ల భానుమతి -'మిస్సమ్మ'లో పాత్రధారణచేయలేదు.

'మిస్సమ్మ' చిత్రానికి విజయావారే 'మిస్సియమ్మ'గా తమిళంలో నిర్మించారు. ఎన్.టి.రామారావు, నాగేశ్వరరావు తెలుగుచిత్రంలో ధరించిన పాత్రలను ఆ తమిళచిత్రంలో జెమిని గణేష్, తంగవేలు నటించారు.

తమిళచిత్రానికి మాటలు పాటలూ రాసినవారు 'విజయవారి ఆస్థాన తమిళ రచయిత' గా పేరొందిన తంజై రామయ్యాదాస్.

నాయికా నాయకులిద్దరికీ ఉద్యోగం అవసరం. భార్యాభర్తలయితే ఉద్యోగాలు ఇస్తామన్న ప్రకటన చూసి నాయకుడు నాయికకు ఆ సంగతి చెబుతాడు. ఈ బ్రహ్మచారి మాటలు విని ఆ పెళ్ళికాని యువతి మండి పడింది. అప్పటికే నాయకుడికి పరిచయమైన దేవయ్య అనే గడుసు బిచ్చగాడు నాయిక కాదని వెళ్లిపోయింది కనుక తన మాట వినమని నాయకుడికి నచ్చ జెప్పబోతుంటే - ఆ నాయకుడు స్త్రీల మనస్తత్వం గురించి పాట మొదలు పెడతాడు. ఆపాట ఇది:

అవునంటే కాదనిలే కాదంటే అవుననిలే
ఆడువారి మాటలకు అర్థాలే వేరులే
అర్థాలే వేరులే అర్థాలే వేరులే
అలిగి తొలిగి నిలిచినచో
చెలిమి చేయ రమ్మనిలే
చొరవచేసి రమ్మనుచో
మరియాదగా పొమ్మనిలే ॥ఆడువారి॥
విసిగి నసిగి కసిరినచో
విషయమసలు ఇష్టమెలే
తరచి తరిచి ఊసడిగిన
సరసమింక చాలనిలే
ఆడువారి మాటలకు అర్థాలే వేరులే
అర్థాలే వేరులే అర్థాలే వేరులే



తెలుగుపాటను చిత్రీకరించిన చోటే తమిళ చిత్రంలోని గీతాన్ని చిత్రీకరించారు. తెలుగు పాటలో -ఎన్.టి.రామారావు, సావిత్రి, రేలంగి ప్రధానపాత్రలు. తమిళగీతంలో జెమిని గణేష్, సావిత్రి, సారంగపాణి ప్రధానపాత్రలు. రెండు భాషల చిత్రాలలోనూ ఆ సన్నివేశంలోని ప్రేక్షకులు మారరు. ఆ ప్రేక్షకుల పరంగా రెండు పాటల చిత్రీకరణలో తేడా ఒకటే.

తెలుగుపాటలో ఒక విద్యార్థిని రేలంగి నెత్తిన పుస్తకంతో కొట్టబోతున్నట్టు అభినయిస్తుంది. తమిళ చిత్రంలోని పాటలో ఆమె పుస్తకంతో సారంగపాణి నెత్తిన కొడుతుంది.

తంజై రామయ్యదాస్ రాసిన తమిళగీతాన్ని ఇక్కడ చూద్దాం.

ముడియుమెండ్రాల్ పడియాదు
పడియుమెండ్రాల్ ముడియాదు
వంజయరిన్ వార్తైయిలే అర్తమే వేరుదాన్
అర్త మెల్లాం వేరుదాన్ అగరాదియుం వేరుదాన్
అలుక్కి కులుక్కి ఒదుంగి నిండ్రాల్
అరుగిల్ ఓడి వారు మెండ్రే
వలియ పేశి వారు మెండ్రాల్
వందవళియై పారుమెండ్రే ॥వంజియరిన్॥
వెఱుప్పుం ముఱుప్పం ఇరుప్ప దెల్లాం
విషయమదిలే విరుప్ప మెండ్రే
శిరిత్తు శిరిత్తు పేశినాలుం
సరస మినియం పోదు మెండ్రే
వంజియరిన్ వార్తైయిలే అర్తమే వేరుదాన్
అర్తమెల్లాం వేరుదాన్ అగరాదియుం వేరుదాన్ ॥వెజియు॥



తమిళగీతంలో నాయకుడు ఏమంటున్నాడు?
అవుతుందీ అంటే జరగదు
జరుగుతుంది అంటే కాదు
మగువల మాటలలో అర్థమే వేరులే
అర్థాలన్నీ వేరేలే (వాళ్ల) నిఘంటువూ వేరేలే
అణిగి మణిగి ఒదిగి నిలిస్తే
చెంతకు పరుగున రమ్మనిలే
తమంత మాటాడి రమ్మంటే
వచ్చిన దారినే (చూసుకొని) వెళ్లమనిలే
బెట్టుగా బిగువుగా ఉంటే
ఆ విషయం ఇష్టమనేలే
నవ్వి నవ్వి మాట్లాడినా
సరసమింక చాలనిలే
మగువల మాటలలో అర్థమే వేరులే
అర్థాలే వేరులే నిఘంటువే వేరులే

తెలుగుపాటలో పల్లవిలో 'అర్థాలే వేరులే' అనే మాటలు మూడుసార్లు కనిపిస్తాయి. వాటిని మూడు రకాలుగా పాడించే ప్రయత్నం చేశారు. తమిళగీతంలో ఆ మాటలు- 'అర్థం వేరు' అని మొదటి సారీ 'అర్థాలువేరులే' అని రెండవసారీ, 'స్త్రీల నిఘంటువు వేరే' అని మూడవసారీ మూడురకాలుగా కనిపిస్తాయి.

తెలుగు పాటలోని భావాలను కొంచెం ఇంచుమించుగా తమిళగీతంలో సర్దుబాటు చేశారు రామయ్యదాస్. తెలుగు పాటను పాడినంత హాయిగా తమిళగీతాన్ని ఏ.యమ్. రాజా పాడలేదనిపిస్తుంది. అలాగే తెలుగుచిత్రంలోని రేలంగి నటనలో కనిపించే సహజత్వం తమిళచిత్రంలో సారంగపాణి నటనలో కనిపించదు.

అయితే -తెలుగు పాటలాగే తమిళగీతమూ -నేటికీ అభిమానులను అలరిస్తూనే ఉంది! (తెలుగు గీతంలోని సంగీత సాహిత్యాలను ఆ మధ్య 'ఖుషీ' చిత్రంలో తిరిగి ఉపయోగించుకోవటాన్ని ఈ సందర్భంగా గుర్తు చేసుకోవటం అవసరం.)

**- పి.ఎస్.గోపాలకృష్ణ**

న్యూస్ వ్యూస్

## గాయని కౌసల్యకు పుత్రోదయం



కౌసల్య

'నీకోసం' చిత్రంతో సినీ పరిశ్రమలో ప్రవేశించి 'బాచి', 'ఇట్లు శ్రావణి సుబ్రహ్మణ్యం', 'ఔను వాళ్ళిద్దరూ ఇష్టపడ్డారు', 'అమ్మా నాన్నా ఓ తమిళ అమ్మాయి', 'శివమణి' చిత్రాల ద్వారా గాయనిగా మంచి పేరు తెచ్చుకుని ఇటీవల విడుదలైన 'పెదబాబు' చిత్రంలో 'నవ్వవయ్య బాబూ నీ సొమ్మేం పోతుంది' పాటకు తన గళంతో హిట్ రేంజిని మరింత పెంచిన శ్రీమతి కౌసల్యకు 6-05-2004 గురువారం ఉదయం 10 గంటల 10 నిమిషాల 45 సెకన్లకు అబ్బాయి పుట్టాడు. మాతృమూర్తి అయిన శ్రీమతి కౌసల్యకు అభిమానులందరి తరపున 'హాసం' అభినందనలు అందజేస్తోంది.





# 'పాట'శాల - 'పాక'శాల నడుమ 'సాగరిక'

ఆకర్షణీయమైన రూపం - దానికి తగ్గ గాత్రం వెరసి 'సాగరిక'. నిన్న మొన్నటివరకూ ఆమె షాన్ సోదరిగానో, మానస్ ముఖర్జీ కూతురుగానో గుర్తింపు తెచ్చుకుంది కానీ ఇవాళ సీన్ మారింది. 'పాట'శాల విషయంలో ఆమె తనవాళ్ళ ఛాయలో నిలబడి వుండవచ్చు గానీ 'పాప్‌గాయని' పాత్రతో పాటుగా రెస్టారెంట్ నిర్వహణలోకి మారడంతో సాగరికకు తనదైన గుర్తింపు వచ్చింది.

ప్రస్తుతం వున్న పాప్ సింగర్స్‌లో సాగరిక ఓ రకంగా అదృష్టవంతురాలనే చెప్పాలి. మహ్మద్ రఫీతో కలిసి పాడే అవకాశం బాలగాయనిగా వున్నప్పుడే సాగరికకు లభించింది. అయితే సాగరిక తండ్రి మానస్ ముఖర్జీ సంగీత దర్శకుడు కావటం వల్లే ఇది సాధ్యపడింది. సాగరిక గాయనిగా తన కెరీర్‌ను రఫీసాబ్‌తో కలిసి పాడటంతోనే మొదలుపెట్టింది. ఆ పాటని స్వరపరచింది మానస్ ముఖర్జీ. అప్పటినుండి వరుసగా సాగరిక అనేకమంది బాల నటీనటులకు పాటలు పాడింది. అలానే వాణిజ్య ప్రకటనల కోసం జింగిల్స్ గానం చేసింది. తెల్లవారి నిద్రలేచింది మొదలు పడుకునే వరకూ సంగీత వాతావరణమే కళ్ళముందు వుండటంతో సాగరిక - ఆమె సోదరుడు షాన్ ఇద్దరూ ఆ సంగీతం మీద మక్కువ పెంచుకున్నారు. తండ్రితో కలిసి ఇంటి దగ్గర గొంతు కలపడం ప్రారంభించారు.

'ఊర్జా' ఆల్బమ్‌లో 'క్యూ-ఫంక్' అనే పాటను పాడటంతో సాగరిక -షాన్ ద్వయానికి గుర్తింపు వచ్చింది. అలానే ఆ వెనుకే పాడిన 'రూప్‌తేరా మస్తానా' పాట కూడా శ్రోతల్ని బాగా ఆకట్టుకుంది. రీ-మిక్స్ కింగ్‌గా పేరు తెచ్చుకున్న బిడ్డూ స్వరపరచగా సాగరిక-షాన్ 'నవ్‌జవాన్' అనే ఆల్బమ్‌ను విడుదల చేశారు. అందులోని 'ఐసాహోతాహై' పాటతో ఈ ఇద్దరూ స్టార్స్‌గా ఎదిగిపోయారు. అలానే ఆ ఆల్బమ్‌లోని 'డిస్కోదివానే' పాటను వీడియోగా చిత్రీకరించడంతో సాగరికకు ఎక్కడలేని గుర్తింపు వచ్చింది. 1997లో విడుదలైన 'ఏ రీజన్ టు స్మయిల్' ఆల్బమ్‌లో 'ఫిఫ్టీ - ఫిఫ్టీ' అనే పాటనూ సాగరిక పాడింది. షాన్-సాగరిక ఇద్దరు కలిసి ఒకవైపు ప్రైవేట్ ఆల్బమ్స్‌లో పాడి పేరు తెచ్చుకుంటూనే - మరోవైపు స్టేజ్ షోలను నిర్వహించారు.



అయితే యువతను ఆకట్టుకునే పాప్ గీతాలను అక్కా-తమ్ముడు పాడడం కొంత ఇబ్బంది కలిగించటంతోనూ - ఎవరి సత్తా వారు వ్యక్తిగతంగా చాటుకోవాలనే కోరికతోనూ - ఇద్దరూ సోలో ఆల్బమ్ విడుదల చేయాలని భావించారు. ఆ దశలో షాన్ 'లవ్వాలజీ' ఆల్బమ్‌ను విడుదల చేసి యువత మనసును కొల్లగొడితే - సాగరిక - 'మా' ఆల్బమ్‌తో విమర్శకుల ప్రశంసలు సొంతం

చేసుకుంది. టైటిల్‌కి తగ్గట్టుగానే ఈ ఆల్బమ్‌ను తన తల్లికి అంకితం చేస్తున్నానని చెబుతూ 'మనిషి ఒకో సమయంలో ఒకో భావనకి లోనవుతూ వుంటాడు. అటువంటి కొన్ని భావాల సమీకరణం నా - 'మా' ఆల్బమ్' అని అంది. ఆ ఆల్బమ్ అంత గొప్పగా రావడానికి గౌతమ్ ముఖర్జీ, పండిట్ ప్రతాప్ నారాయణ్‌ల నుండి తాను నేర్చుకున్న సంగీతమే కారణమని సాగరిక అంటోంది.

పాటలు పాడటంతో పాటుగా పర్యటనకూ సాగరిక అధిక ప్రాధాన్యం ఇవ్వడంతో 'మా' ఆల్బమ్‌లో భారతీయ శాస్త్రీయ సంగీతంతో పాటుగా - అల్జేరియా, బల్గేరియా, ఆఫ్రికా తదితర దేశాలలోని సంగీతమూ మనకి వినిపిస్తుంది. బాల్యం నుండి వివిధ బాల నటీనటులకు ఆమె నేపథ్య గానాన్ని అందించిన అనుభవం - ఈ పాటలలో వైవిధ్య స్వరానికి ఆస్కారమిచ్చింది. ఇప్పుడు పాటలోని భావానికి తగ్గట్టుగా సాగరిక తన గాత్రాన్ని మార్చగలదు. ప్రస్తుతం వున్న గాయకులలో లక్కీ అలీ, కొలోనియల్ కజిన్స్ గాత్రాలు తనకెంతో ఇష్టమని సాగరిక చెబుతోంది.



'ఏ రీజన్ టు స్మయిల్' ఆల్బమ్‌లోని 'వజహ్ ముస్కురానేకీ...' పాటను స్వరపరిచిన సలీమ్ మర్చంట్‌ను వివాహం చేసుకుని కొద్దికాలం కాపురం చేసిన సాగరిక - ఆ తర్వాత పోర్చ్‌గీస్ జాతీయుడు మార్టిన్ డ కోస్టాను పెళ్ళి చేసుకుంది. కెరీర్ ప్రారంభంలో మ్యూజిక్ డైరక్టర్‌ను చేసుకుని సంగీతంలో మునిగితేలిన - సాగరిక - రెస్టారెంట్ నిర్వాహకుడు మార్టిన్‌తో పెళ్ళి తర్వాత తన జీవిత ప్రాధాన్యాన్ని మార్చుకుంది. పాటశాల నుండి ఆమె పాకశాల వైపు దృష్టి నిలిపింది.

ఈ విషయమై మాట్లాడుతూ " ఓ సింగర్ - ఓ మంచి కుక్ ఎందుకు కాకూడదు అనేది చాలామందికి అర్థం కాదు. నాకు పాటలు పాడటం అంటే ఎంతిష్టమో - వివిధ ప్రాంతాలు పర్యటించడమన్నా - రకరకాల ఆహారాన్ని తయారు చేసి భుజించడమన్నా అంతే ఇష్టం. మా ఆయన మార్టిన్‌కి కూడా ఇవే అభిరుచులు వుండటంతో మా బంధం మరింత బలపడింది" అని చెబుతోంది సాగరిక. "మేమిద్దరం హనీమూన్‌కి వెళ్ళినప్పుడే వీలైనంత సమయాన్ని, డబ్బుని ఖర్చుచేశాం. అదే సమయంలో స్థానికంగా లభించే ఆహార పదార్థాల గురించి, అందులోని రకాలను గురించి తెలుసుకున్నాం. వంటకాల మీద మాకున్న ప్రేమే ఆ తర్వాత ఇండియా వచ్చి మేమొక రెస్టారెంట్‌ను ప్రారంభించడానికి కారణమైంది" అని చెప్పింది. మొదట కేవలం పన్నెండు సీట్లు వున్న చిన్న రెస్టారెంట్‌ను ప్రారంభించిన సాగరిక ఇప్పుడు కొందరు స్నేహితులతో కలిసి బాంద్రా (ముంబాయి)లో ఆలివ్ రెస్టారెంట్ ప్రారంభించి, విజయవంతంగా నిర్వహిస్తోంది.

**పాట ఆగదు :**

పాకశాల వైపు దృష్టి మరల్చినా - సంగీతాన్ని తాను వీడనని సాగరిక చెబుతోంది. "ఈ రెస్టారెంట్ నిర్వహణలో పడి ఆల్బమ్ వెంటనే తీసుకుని రాని మాట వాస్తవమే. అయితే ఏడాది క్రితమే ఓ ప్రైవేట్ ఆల్బమ్‌ను నేను రూపొందించాను. కానీ ఇప్పుడున్న పరిస్థితుల్లో పాప్ గీతాలకు సమయమంత అనుకూలంగా అనిపించలేదు. అందుకనే ఓ యేడాది పాటు దానిని వాయిదా వేశాను. ఆల్బమ్ అంటూ విడుదల చేస్తే - అందరినీ ఆకట్టుకునేలా వుండాలన్నది నా కోరిక" అంటోంది సాగరిక.

అటువంటి ఆల్బమ్‌ని షాన్ తన సోదరి సాగరికతో కలిసి తీసుకురాబోతున్నాడు. దీనిని ఈ అక్కాతమ్ముళ్ళు కలిసి చేస్తున్న మరో ప్రయోగం అనొచ్చు - లేదంటే వాళ్ళ తండ్రికి ఇస్తున్న నివాళిగానూ భావించొచ్చు. షాన్ తన సోదరి సాగరికతో కలిసి మొదటిసారి ఓ బెంగాలీ ఆల్బమ్‌ను రూపొందించే ప్రయత్నంలో వున్నాడు. "మా నాన్న మానస్ ముఖర్జీ స్వరపరిచిన కొన్ని పాటలు ఇంతవరకూ వెలుగు చూడలేదు. వాటిని నేను - సాగరిక కలిసి పాడబోతున్నాం. అలానే మరికొన్ని కొత్త పాటల్ని కూడా ఈ ఆల్బమ్‌లో చేర్చుతాం. జూన్-జులై నెలల్లో రికార్డింగ్ జరిపి - ఈ ఏడాదిలోనే ఆల్బమ్‌ని విడుదల చేస్తాం" అంటున్నాడు షాన్. కాస్త విరామం తర్వాత పాకశాల నుండి పాటశాలకి వస్తున్న సాగరిక - సోదరుడు షాన్‌తో కలిసి సంగీత ప్రియులకు కొత్తరుచులు త్వరలో చూపబోతోందన్న మాట!

**- వి. అరుణ సత్యవతి**

## కొంటెకొశ్చెన్లు - తుంటరి జవాబులు



ప్ర. రోజూ ఎక్క గడప, దిగ గడపగా బ్రతికేవాడు?
జ॥ పోస్ట్‌మెన్
ప్ర. కొంపలార్పి బ్రతికేవాడు?
జ॥ ఫైర్ సర్వీస్‌మెన్
ప్ర. పిల్లల్ని ఏడ్పించి బ్రతికేవాడు?
జ॥ చిల్డ్రన్ స్పెషలిస్ట్
ప్ర. పోటీ పెరిగేలా పాడేవాడు?
జ॥ వేలంపాట పాడేవాడు
ప్ర. దారులు కొట్టి బ్రతికేవాడు?
జ॥ రోడ్డు మేస్త్రీ

-బి. చంద్రశేఖరయ్య, రామసముద్రం.

## పేరు - రిపేరు




కెప్టెన్ నాగార్జున - ముద్దుల మామయ్య -ఐతే - సత్యం - ముద్దులమేనల్లుడు
ప్రియా ఓ ప్రియా - నీకోసం- వేచిఉంటా-ప్రేమతో -చంటిగాడు
నువ్వు-నేను-ప్రేమించుకుందాం రా -ఐతే -ఆ ఒక్కటీ అడక్కు
నువ్వు నేను -పెళ్లి చేసుకుందాం-సారీ నాకు పెళ్లయింది

-జి.రాజేష్, కొత్తగూడెం



## చిలిపి కవిత




పెళ్లయిన కొత్తలో
భార్య -బెటర్ హాఫ్
కొన్నాళ్లయ్యాక
అవుతుందామె -బిట్టర్ హాఫ్
మంగళసూత్రంతో పాటు
నల్లపూసలు కట్టినవాడు
పెళ్లయ్యాక నల్లపూసే అవుతాడు
పెళ్లయిన కొత్తలో
మొగుడూ పెళ్లాం -చిలకాగోరింక
కొన్నాళ్లయ్యాక
ఒకరికొకరు -బోరింక

-బి.శ్రీనివాసాచారి, అమీర్‌పేట, హైదరాబాద్

## ఈ రూటే వేరు




ఫోర్జరీ - నాలుగంచుల జరీ
హీ'రో' - అతడి వరుస
షీ'లా' - ఆమె చట్టం
ఫోర్మెన్ - నలుగురు పురుషులు
వైటు' - రెండు ఎందుకు?
న్యూ'రో' - క్రొత్త వరుస

-బి. చంద్రశేఖరయ్య, రామసముద్రం.

## డబుల్ రోల్




మా బాకీలు తీర్చకపోతే నీ కీలు విరిచేస్తాం
చిరాకు పడితే నాతో రాకు

-మహేంద్రాడ చలం, టెక్కలి

చెట్టు ఎక్కితేనె లభిస్తుంది తేనె
గురుపూర్ణిమ ఈ గురు వారమే
వైరి జనులను పెంచుకున్న వారికి మిత్రులు కరువైరి

-బి. చంద్రశేఖరయ్య, రామసముద్రం.

## చిలిపి లిపి




| | | |
|---|---|---|
| They m | = | దెయ్యం |
| A me t | = | ఏమిటి |
| A law | = | ఎలా |
| Flew two | = | ఫ్లూటు |

-వరదా సాయికుమార్, పర్లాకిమిడి(ఒరిస్సా)

## షార్ట్‌కట్స్




| | | |
|---|---|---|
| కారంపూడి శీను | - | కాశీ |
| గరిమెళ్ల యతిరాజు | - | గయ |
| కావిళ్ల మహేశ్వరం | - | కామ |
| క్రోవిడి రాధ | - | క్రోధ |
| లోహితాస్యుల భవాని | - | లోభ |
| మోదుకూరి హరిత | - | మోహ |
| మరుదూరి దయాకర్ | - | మద |

- బి.చంద్రశేఖరయ్య, రామసముద్రం

## పేరడీ పెరేడ్




ప: యమహో రుచికరి మెత్తమెత్తని పూరీ
నమహో తినరండీ సాంబారు ఇడ్లీ
చిరు'భోజరాజు' ఈ హోటలునే
మరిగెను కద మరి ॥యమహో॥

చ: వేడి వేడి మసాల్‌దోశ వడివడిగా తిను సమోసా
సోదరా... నీకిష్టం ఏదిరా...ఆ...ఆ..
ఉల్లిగారె ఊతప్పాలూ.....నోరూరె ఎగ్‌బోండాలు
తీసుకో.....మనసారా మేసుకో....
తినుగురూ...! టేస్టుగా ఉంది రోస్టూ
చేయకింక టైం వేస్టూ... కదిలిరారా!
కొబ్బరి పచ్చడట కోరినంత ఉందట
ముంబై చెట్నీయట బోలెడంత ఉందట
కడుపారా టిఫిన్ చెయ్ మా హోటల్‌లో.... ॥యమహో॥

చ: మది మెచ్చే చపాతి ఉందీ
మా మంచి రుచిగుంటుందీ
ఆగరా... ఓసారిటు చూడరా...
ఉల్లిదోశ ఊరిస్తుంది....పళ్లెమంత సైజుంటుందీ
పట్టరా.... ఓ పట్టూ పట్టరా....
రా గురూ మెరిసిపోతుంది మినపట్టు....
ఆరగించు మరి ఆమ్లెట్టూ...తనివి తీరా!
రుచులకు కొలువట....శుచులకు నెలవట
అతిథుల వరమట జనముతో కిటకిట
అనునిత్యం ఈ హోటలూ..... ॥యమహో॥

('చూడాలనివుంది' చిత్రంలోని 'యమహానగరి' అన్న పాటకు పేరడీగా)

-బి.సోమరాజు, వీరనారాయణం

ఈ సంచికలోని పేరడీ పెరేడ్‌ని రాసిన బి.సోమరాజు, వీరనారాయణం గారికి సోహన్ మ్యూజిక్ వారు 'వన్స్‌మోర్ ఎన్.టి.ఆర్.' సినిమా పాటల ఆడియో సి.డి.ని బహుమతిగా ప్రకటించారు. అతి త్వరలో పోస్ట్‌ద్వారా పంపించడం జరుగుతుంది.

SOHAN MUSIC



# లలిత సంగీతం




ప్రముఖ గాయకుడు, స్వరకర్త
లలిత సంగీత విద్వాంసుడు,
వాగ్గేయకారుడు

**ఎం.చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-27402993


## విజాతులన్నియు వృథా వృథా

ప॥ విజాతులన్నియు వృథా వృథా
అజామిళాదుల కదియే జాతి

చ॥ జాతి భేదములు శరీర గుణములు
జాతి శరీరము సరితోడ నెచెడు
ఆతుమ పరిశుద్ధంబెప్పుడును అది నిర్ధోషంబనాది
ఈతలహరి విజ్ఞానపు దాస్యంబిది ఒక్కటె పోసుజాతి ॥విజాతులన్నియు॥

చ॥ హరి యిందరిలో అంతరాత్ముడిదె
ధరణి జాతి భేదములెంచిన
పరమయోగులీ భావమష్టమదము భవనికారమని మానిరి
ధరణిలోన పరతత్త్వ జ్ఞానము ధర్మమూలమే సుజాతి ॥విజాతులన్నియు॥

చ॥ లౌకిక వైదికలం పటులకునివి
కైకొనునవశ్య కర్తవ్యంబులు
శ్రీకాంతుడు శ్రీవేంకటపతి చేసిన సంపాద మిందరికి
మే కొని యిన్నియు మీరిన వారికి నీ నామమే సుజాతి ॥విజాతులన్నియు॥

**అన్నమాచార్యా కీర్తన**

**గానం**
**సంగీతం** : చిత్తరంజన్
**రాగం** : లలిత (కర్ణాటక సం॥)
**తాళం** : ఆది (కర్ణాటక సం॥)
కహరువా (హిందుస్తాని సం॥)
**ఆరోహణ** : సరిగ మదనిస
**అవరోహణ** : సనిదమగరిస
- షడ్జము, శుద్ధరిషభం, అంతరగాంధారం, శుద్ధ మధ్యమం, శుద్ధ దైవతం, కాకలినిషాదం యీరాగం లోని స్వరాలు.








ఈ రాగాన్ని చతుశృతి దైవతంతో 17వ మేళకర్త సూర్యకాంతం రాగజన్యంగా కర్ణాటక శాస్త్రీయ సంగీతంలోను, 53వ మేళ కర్త గమనశ్రమ రాగ జన్యంగా హిందుస్తాని సంగీతంలోను వున్నట్లు పండితులు చెబుతారు. కాని రాగం వాడుకలో శుద్ధదైవతమే ప్రముఖంగా వుండడంచేత యీరాగం 15వ మేళ కర్తయగు మాయా మాళవ గౌళ రాగ జన్యంగానే చెప్పుకోవలని వుంటుంది. హిందుస్తాని సంగీతంలో లలిత్ అనే పేర్తుతోటే ప్రతిమధ్యమం కూడా చేర్చబడి 'స రి గ మ మ ద ని స- స ని ద మ మ గ రి స' మూర్చనతో గానం చేయబడుతున్నది. అనగా కర్ణాటక లలితరాగానికి అదనంగా ప్రతిమధ్యమం కూడా చేర్చబడి హిందుస్తాని లలిత్‌గా ప్రసిద్ధి చెందినది. కర్ణాటక సంగీతంలో లలితరాగం ప్రాచుర్యాన్ని అంతగా పొందలేదనే చెప్పాలి. ముద్దుస్వామి దీక్షితర్ రచించిన యీ రాగంలోని "హిరణ్మయీం లక్ష్మీం

సదా భజామి" అన్న కీర్తన బాగా ప్రచారాన్ని పొందింది యీమధ్యకాలంలో. ఈ కీర్తనను గురించి ఒక కథ వాడుకలో వున్నది. ముద్దుస్వామి,శ్యామశాస్త్రి ఒకే వీధిలో ఉండేవారు. శ్యామశాస్త్రి భార్య ముద్దుస్వామి భార్యతో "తంజావూరు మహారాజగు శరభోజీని దర్శిస్తే సకల సంపదలు లభిస్తాయి గదా. మీకు ఏ లోటూ వుండదు' అని పలికింది. దీక్షితుల భార్య తన భర్తతో ఆ విషయం ప్రస్తావించగా దీక్షితులు తన జిహ్వా భగవంతునే కీర్తిస్తుంది గాని మానవులను కాదని చెప్పి, శ్రీసూక్తభావము తో "హిరణ్మయీం లక్ష్మీనదాభజామి హీన మానవాశ్రయం త్యజామి- స్థిరతరసంప్రదామ్" అంటూ శ్రీదేవిని స్తుతించగా మహాలక్ష్మి సకలా భరణ భూషితురాలై దీక్షితుని భార్య కలలో దర్శనమిచ్చి అభయమొనంగినదట. అప్పటినుండి ఆమెకు ధనవ్యామోహము నశించినదట.

కర్ణాటక లలితరాగం లో" షోడశ కళానిధికి షోడశోపచారములు","జయలక్ష్మి,వరలక్ష్మి సంగ్రామవీరలక్ష్మి" అనే అన్నమాచార్య కీర్తనలకు చక్కటి బాణీలను శ్రీగరిమెళ్ల బాలకృష్ణ ప్రసాద్ కూర్చారు. హిందుస్తానీ లలిత్ రాగం బాగా ప్రాచుర్యాన్ని పొందిన రాగమే. లలిత సంగీతంలో యీ రాగాన్ని చాలామంది స్వరకర్తలు ఉపయోగించారు. చలన చిత్రాలలో- తెలుగు, హిందీ చిత్రాలలో కూడా హిందుస్తాని లలిత్ వినియోగాన్ని గమనించవచ్చు.

పరమభక్తుడైన అన్నమయ్య హరిగుణ సంకీర్తనములు అనేకవిధములుగా రచించాడు. భక్తిగలవాడే ఉన్నతుడు అంటూ తత్త్వ జ్ఞానమును "విజాతులన్నియు వృథావృథా"అన్న యీకీర్తన యందు నిక్షేపించాడు.

జాతి అన్నది శరీరానికి సంబంధించినది. అజామిళుడు నిమ్నకులజుడే అయినా భక్తిచేత ఉన్నతుడు కాలేదా. హరి అందరిలో ఆత్మరూపంలో ప్రకాశిస్తుండగా జాతి భేదాలెంచడం అవివేకం కాదా. ధర్మమూలమైన జ్ఞాన భక్తి వైరాగ్యాలు కలవారు అందరూ భగవత్స్వరూపులే. వారిది సుజాతియే. ఈ విధముగా అన్నమయ్య ఉత్కృష్టమైన తత్త్వ జ్ఞానాన్ని యీ కీర్తనలో నింపి భక్తియొక్క మహాత్త్యమును నిరూపించాడు.1983వ సంవత్సరంలో తిరుమల తిరుపతి దేవస్థానం వారి అన్నమాచార్య ప్రాజెక్టు తరపున శ్రీకామిశెట్టి శ్రీనివాసులు గారు హైదరాబాద్ ఆకాశవాణి కేంద్రంలో "అన్నమయ్య దేశికవితా గానం" శీర్షికన ఒక విశిష్ట కార్యక్రమం నిర్వహించగా అందులోనేను "విజాతులన్నియు వృథావృథా" కీర్తనకు కర్ణాటక లలితరాగంలో బాణీని కూర్చిపాడాను. శ్రీనివాసులు గారి మనసును బాగా ఆకట్టుకున్న అన్నమయ్యకీర్తనలలో యిది కూడా ఒకటని చెబుతూంటారు.

### కర్ణాటక లలిత/హిందుస్తాని లలిత్ రాగాలాధారంగా కొన్ని చిత్రగీతాలు

### కర్ణాటక లలిత రాగం-తెలుగు గీతాలు

| పాట | చిత్రం | గానం | సంగీతం |
|---|---|---|---|
| 1. లలితప్రియకమలం విరిసినది | రుద్రవీణ | ఏసుదాస్, చిత్ర | ఇళయరాజా |
| **హిందుస్తాని లలిత్‌రాగం** | | | |
| 1. అమ్మంటే తెలుసుకో | మావిడాకులు | బాలు, చిత్ర | కోటి |
| 2. లలితల వంగలతా పరిశీలన (జయదేవ అష్టపది) | "కృష్ణంవందే జగద్గురుం" (ప్రైవేటురికార్డు) | పి. సుశీల | యస్. రాజేశ్వరరావు |
| 3. ఆతపత్రమ్ముభంగి (పద్యం-కరుణశ్రీ కుంతీకుమారి) | ప్రైవేటురికార్డు | ఘంటసాల | ఘంటసాల |
| **హిందీ** | | | |
| 1. ఎక్ షహన్ షా నే బన్‌వాకే హఁసీఁతాజ్‌మహల్ | లీడర్ | రఫీ,లత | నౌషాద్ |
| 2. సాయిబాబా బోలో | షిర్డికే సాయిబాబా (మనోజ్ కుమార్ నిర్మించిన చిత్రం) | రఫీ, బృందం | పాండురంగ దీక్షిత్ |

హాస్య నాటిక

# కారులో షికారు

**ఇందులో పాత్రలు**

| | | |
|---|---|---|
| పాపారావు | గౌరీపతి | శ్రీనివాస్ |
| ఎ.సి.బి. ఇన్‌స్పెక్టర్ | భిక్షం | కావేరి |

- కె.వి.ఆర్.విజయకుమార్

**జరిగిన కథ :** రెండు పోర్షన్లు ఉన్న యింటికి వసారా ఒకటే. ఒక పోర్షన్లో రిటైర్డు హెడ్‌మాస్టరు గౌరీపతి ఉంటాడు. భార్యలేదు. ఒక్కగానొక్క కొడుకు శ్రీనివాస్ (వాసు) డిగ్రీ పూర్తిచేసి, ఉద్యోగంలేక రాక స్వయం ఉపాధి పథకాలంటూ ఏవో పిచ్చి వ్యాపారాలు చేస్తూంటాడు.

ఇక రెండో పోర్షన్లో, రెవిన్యూ డిపార్టుమెంట్‌లో పనిచేసే యు.డి.సి. పాపారావు. ఆయన కూతురు కావేరి ఉంటారు. వాసు, కావేరి ప్రేమించుకుంటారు. కొడుకంటే అమిత ఇష్టం ఉన్న గౌరీపతికి అది సమ్మతమే కానీ పాపారావుకి ఇష్టం లేదు. ఓ రోజు వాసు పాపారావుకు తన స్కీముల గురించి చెబుతూ ఉంటాడు.

- ఇక చదవండి.

పాపారావు : అప్పటికి చావకపోతే? (అనుమానంగా అడిగాడు)

గౌరీపతి : బాటాచెప్పుల కంపెనీ మీద దావా వెయ్యి మామయ్యా... దోమని కూడా చంపలేని నీ చెప్పుల కంపెనీ ఎందుకని?

పాపారావు : అంతేగాని నీ మందుల కంపెనీ మీద వద్దంటావ్... శుంఠ (అన్నాడు కోపంగా)

వాసు : నెక్స్ట్ ఐటమ్ విరామం తర్వాత .... (అడ్వర్‌టైజ్ మెంట్‌లా చెబుతాడు)

పాపారావు : ఇపుడు మేము బయటకు పోయి సిగరెట్ కాల్చుకు రావాలా?

గౌరీపతి : అరేయ్ టెన్షన్‌తో చచ్చిపోయేట్లున్నాడు చెప్పరా పాపం (కుతూహలంగా అన్నాడు)

వాసు : నెక్స్ట్ ఐటమ్ వందేళ్ళ గ్యారంటీ వున్న విసనకర్ర (అంటూ బ్యాగ్‌లో నుండి విసనకర్ర తీస్తాడు)

పాపారావు : (చేతిలో విసనకర్ర లాక్కొని) వందేళ్ళ గ్యారంటీనా? నీ బొందేం కాదు! ఎండాకాలం వేడి వేడి అన్నంలో అవకాయ వేసుకొని ఒక పీకుడు పీకి యిలా యిలా ఊపితే అరగంటలో అంతర్ధానమవుతుంది. (అంటూ కింద పారేస్తాడు)

వాసు : అందుకే ఈ ప్రాబ్లంని సాల్వ్ చేయడం కోసం మా కంపెనీ ఎక్స్‌పర్ట్స్ పగలు, రాత్రి శ్రమించి కరెంటు లేకపోయినా విసనకర్ర కూడా ఉపయోగించకుండా పరిశోధనలు చేసి చేసి వందేళ్ళ గ్యారంటీ ఫార్ములా కనిపెట్టారు.

గౌరీపతి, పాపారావు : ఏంటో అది?

వాసు : ఏముంది? విసనకర్ర ఇలా రెండు చేతుల మధ్య పట్టుకొని తలని యిలా, యిలా ఆడిస్తూ ఉపయోగిస్తే వందేళ్ళు గ్యారంటీ.

పాపారావు : ఏడిసినట్టే వుంది.

వాసు : అలాగే వీపు గోక్కునే కర్రలు.... వళ్ళు రుద్దుకునే బిళ్ళలు.

పాపారావు : పళ్ళు రాలగొట్టుకునే రాళ్ళు లేవా బాబూ?

వాసు : మా కేటలాగ్ చూసి చెబుతాను మామయ్యా.... (అంటూ బ్యాగ్‌లో చెయ్యి పెడతాడు)

పాపారావు : ఇదిగో ఈ సోంబేరి పనులకే నాకు వళ్ళుమండేది. ఒక్కటి పనికొచ్చేదుందిరా నీ దగ్గర? ఈ వెధవ చచ్చు సామాన్లు తీసుకునా నువ్వు తిరిగేది? అసలు నిన్నిలా తయారు చేసిన వీడ్ని అనాలి.

వాసు : ఆఁ... ఈ ఒక్కటీ ఏం కాదు. ఇంకా నా దగ్గర రకరకాల స్కీములు, వివిధ పథకాలున్నాయి చూపిస్తా!

పాపారావు : చంపేస్తా!

వాసు : అదే! అదే! మేధావి వర్గాన్ని అణగదొక్కటమంటే యిదే!

(కావేరి ప్రవేశిస్తూ)

కావేరి : హాయ్ వాసూ! పీటర్ ఇంగ్లాండ్ షర్ట్, ప్యాంట్ .. సూపర్‌గా వున్నావ్ ఆ జిప్ పెట్టుకో ఇంకా బావుంటావ్ (అంది వెక్కిరింతగా)

వాసు : (గతుక్కుమని వెనక్కి తిరిగి జిప్ సరిచేసుకుంటాడు)

పాపారావు : ఇదిగో కావేరీ, ఈ వాసు గాడున్నప్పుడు నిన్ను బయటకు రావద్దని చెప్పలా..... లోపలికి వెళ్ళు. ఆ టీవీలో ఇంకా నాలుగు అడ్వర్‌టైజ్‌మెంట్స్ వస్తాయి. అవన్నీ నోట్ చేసుకో..ఫో.. (అంటూ కసురుకుంటాడు)

గౌరీపతి : ఎందుకురా చిన్నపిల్లనలా కసురుకుంటావ్! నిన్ను మణులడిగిందా? మాణ్యాలడిగిందా?...టీవీలో చూపించినవేగా అడిగింది...

పాపారావు : టీవీలో విమానం చూపిస్తారు కొంటామా. నీది కాకపోతే తాటి చెట్టుకి ఎదురు డేకమన్నాట్ట వెనకటి కెవడో! అట్లా వుంది నువ్వు చెప్పేది...మొన్నటికి మొన్న 'మీ వయస్సు అసలు కనపడనివ్వదని' దిక్కుమాలిన సబ్బు కొనుక్కొచ్చింది. దాంతో స్నానం చేసి గోక్కోలేక చచ్చాను.

కావేరి : (అమాయకంగా) 'దురదలు చిటికెలో మాయం' ఫటక్ లోషన్ - ఫటక్ మలాం' కూడా కొన్నాగా రాసుకోకూడదా ఏమిటి?

(ఇంతలో వాసూ వెనుక నుండి కావేరిని గిల్లుతూ సరసాలాడు



తుంటాడు. పాపారావు అది గమనించి)

పాపారావు : మళ్ళీ నువ్వొచ్చావ్.... పద నువ్వింట్లోకి పద (అంటూ లోపలికి కావేరిని నెట్టుకు పోతాడు)

గౌరీపతి : ఒరేయ్ వాసూ ఏంటిరా ఈ గోల? అసలే వాడు నిన్ను చూస్తే ఇంత ఎత్తున లేస్తున్నాడే నువ్వు వాడి కళ్ళ ముందే వాడి కూతురుతో సరసాలు ఆడితే ఈ పాపేకాదు ఏ పాపీ నీకు పిల్లనివ్వడు. రా లోపలకెళ్ళి భోంచేద్దాం (లోపలికి వెళ్తాడు)

వాసు : నాన్నా నీ నోములపంట నెంత మాటన్నావు!? నా టాలెంటు చూపిస్తా. రాళ్ళను కరిగిస్తా. వర్షం కురిపిస్తా. బండరాయి లాంటి మామయ్యను స్కీములో చేర్పిస్తా, కావేరిని చేబడతా! ఇదే నా ప్రతిజ్ఞ ...ప్రతిజ్ఞ ఏమిటబ్బా!.. తర్వాత చూద్దాంలే.

* * *

కావేరి వాటాలోకి తొంగిచూస్తూ కేక పెడతాడు - 'బావిలో బక్కెట్లు తీస్తాం'

కావేరి : (లోపల నుండి) మా యింట్లో బావిలేదు బోరే!

వాసు : నవరాలు కడ్తాము (మళ్ళీ కేకపెడతాడు)

కావేరి : నవరాలు వేసుకునే వాళ్ళు ఎవరూ లేరు.

వాసు : చెప్పులు కుడతాము. చెప్పులు కుడ్తాము (మళ్ళీ కేక వేస్తాడు)

కావేరి : మూడూ నువ్వే చేస్తావా (అంటూ బయటకు వచ్చి వానును చూసింది)

కావేరి : వాసూ, నువ్వా! ఇవి కూడా మీ స్కీములలో భాగమా?

వాసు : అవును, మన లవ్వు స్కీములో ఒక భాగం. మన పెళ్ళి స్కీములో ఒక భాగం. బండరాయి లాంటి మీ నాన్న హృదయాన్ని కరిగించే స్కీములో ఒక భాగం. అవునూ మీ నాన్నను స్కీములో చేరమని నువ్వయినా చెప్పవా?

కావేరి : నేనా!? నేను చెపితే అస్సలు చేరడు.

వాసు : అయినా సరే ! నేను నిన్ను ప్రేమిస్తాను.

కావేరి : నేనూ అంతే!

వాసు : ఐ లవ్ యూ!

కావేరి : నేనూ అంతే!

వాసు : మై తుమ్‌సే ప్యార్ కర్తా!

కావేరి : అచ్చా అచ్చా

వాసు : కావేరీ, నా వువ్నై కాదలిక్కిరన్

కావేరి : ఆమ...ఆమ.......

వాసు : ఒక డ్యూయెట్ వేసుకుందామా?

కావేరి : నాకు రాదుగా..

వాసు : నా కొచ్చుగా ..ఇలా రా ఉప్పు గుప్ప వయ్యారి



భామా ఆడతాను.

పాపారావు : (లోపల్నుండి )అమ్మాయ్, వానుగాడ్ని అక్కడే ఉండమను కాల్చిన అట్లకాడ తీసుకొస్తున్నా.

వాసు : అమ్మో మీ నాన్న!

కావేరి : వానూ, మా నాన్న హృదయాన్ని కరిగిస్తానన్నావు కదా!

వాసు : అదేమన్నా వెన్నపూసా కరిగించడానికి, రేపు చూద్దాంలే.

(ఇద్దరూ వెళ్లిపోతారు). లైట్సాఫ్

* **

**(పాపారావు ఆఫీసుకి వెళ్ళడానికి రెడీ అవుతుంటాడు. వాసూ పాపారావు వెనకాలే తిరుగుతూ స్కీమ్ గురించి ఎక్స్‌ప్లెయిన్ చేస్తుంటాడు)**

పాపారావు : ఇదెక్కడి గోలరా బాబూ 'విశ్వానం గల పీనుగ మోసినోడ్ని పట్టిందని' నా ప్రాణం తీస్తున్నావ్. నీ దిక్కుమాలిన స్కీముతో నన్ను చంపుకు తింటున్నావ్.

వాసు : అలాకాదు మామయ్యా నామాట విను....నెలలు తిరిగేటప్పటికీ నిన్ను కోటీశ్వరుడ్ని చేసే పథకాలు నా దగ్గరవున్నాయి. ఒక్క పాతికవేలు మా టేక్ ప్లాంటేషన్స్‌లో పెట్టుబడి పెట్టు. నీ పేరు మీద పాతిక టేకు చెట్లు పాతిస్తాం. పది శ్రీగంధం చెట్లు ఫ్రీగా ఇస్తాం... మొదటి సంవత్సరం టేకు చెట్లు , గంధం చెట్లు మేం వేసే ఎరువులతో అలా అలా పెరుగుతువుంటాయ్.

పాపారావు : ఆహా..వాటి మధ్యలో గడ్డి కూడా పెరుగుతుందిగా (వ్యంగ్యంగా అన్నాడు)

వాసు : కరెక్ట్...ఆ గడ్డిని కూడా వృథాగా పోనియ్యం.

పాపారావు : ఏం... నువ్వు మీ కంపెనీ వాళ్ళు మేస్తారా గడ్డి?

వాసు : మేం తింటేం ఎంత తింటాం... నీ పేరు మీద పది గొర్రెల్ని వాటి మధ్య వదులుతాం పొట్టేలు ఒకదాన్ని తోడిచ్చి.....ఇక ఆ మెత్తటి గడ్డిమేసి, మేసి గొర్రెలన్నీ అడ్డంగా బలిసి...పొట్టేల్తో కలిసి పిల్లల్ని పెడతాయి... వెంటనే ఆ గొర్రెల్ని అమ్మి ....పది రెళ్ళు ఇరవై వేలు..పదివేలు నీకు డి.డి..మిగతా పదివేలతో....మరిన్ని గొర్రెలు ..వాటితో వాటి పిల్లలు...

పాపారావు : మరి టేకు...గంధం చెట్లో?

వాసు : ఆ అవి వూరుకుంటాయా... అలా




అలా పెరుగుతూ ఆకాశం వైపు టార్గెట్ పెట్టుకుని పెరుగుతుంటాయి. రెండేళ్ళకు మానిక సైజ్...ఎత్తు ఇలా చూస్తే కనపడదు. అలా పైకెత్తి చూడాల్సిందే. ఈ లోపు గొర్రెలు... పిల్లలు తామర తంపరగా పెరుగుతాయ్. వాటిని అమ్మి లక్ష.... గంధం చెట్లకు పక్క కొమ్మలు నరికి అమ్మితే అడుగు ముక్కఆరువేలు, నీవి పది మొక్కలు అరవై ఇంటు ఆరువేలు అంటే ఆరులక్షలు+ గొర్రెలు లక్ష -ఏడు లక్షలు రెండు సంవత్సరాలలో కళ్ళ చూస్తావ్ అలా ఇయర్‌బైఇయర్ పదేళ్ళకు 70 లక్షలు ఆ తర్వాత టేకు చెట్లు వాటేసుకుంటే అందవ్.

పాపారావు : ఏం... వాటిని మీరు కాజేస్తారా?

వాసు : కాదు...వాటేసుకున్నా అందనంత లావవుతాయ్. వాటిని అమ్మితే చెట్టు లక్ష. 25 ఇంటు లక్ష: 25 లక్షలు ఇందాకటివి 70 లక్షలు ఇలా పాతిక లక్షలు మా కంపెనీ బోనస్ 5 లక్షలు వెరసి కోటి... మొత్తం డి.డి. రూపంలో పోస్ట్‌లో మీ యింటి కొస్తుంది.

(బయటినుండి పోస్ట్ అన్న కేక వినిపిస్తుంది)

వాసు : (ఆలోచనలో చెప్తాడు) అదుగో కోటి డి.డి. వచ్చినట్లుంది. ఆ! (అది చూసి) అది పక్కింటికి వచ్చిన పోస్ట్.

పాపారావు: అది కాదురా ఇన్ని పనికిమాలిన లెక్కలేసే వాళ్ళు ఆ పెట్టుబడేదో వాళ్ళే పెట్టి ఈ గొర్రెల్ని, గంధం చెట్లని పాతుకు చావొచ్చుగా....

వాసు:మా కంపెనీకి అంత దురాశ లేదు మామా.... అలాపెంచి, పోషించిన దాంట్లో పావలా వంతు కంపెనీకి తీసుకొని పదిపైసలు వంతు కమీషన్ నాకిస్తుంది. నీలాంటి వాళ్ళని పదిమందిని చేర్పిస్తే నేనూ కోటేశ్వరరావునే..ఛ. .ఛ.. కోటీశ్వరుడ్నే. ఈ పదిసంవత్సరాల్లో నీ టేకు చెట్ల మధ్య గొర్రెల మంద మధ్య నువ్వు ఫ్రీగా వనభోజనం చేసుకునే ఏర్పాటుంది. గంధం చెట్ల మధ్య వీరప్పన్ లా ఫోజిచ్చి ఫోటో కూడా తీయించుకోవచ్చు... చూశారా ఎంత ఛాన్సో!

పాపారావు: నువ్వు చెప్పేది బాగానే వుంది కానీ (మెత్తబడతాడు) ఇంతకీ ఇప్పటికి ఎంతమంది చేరారంటావ్.. (ఉత్సాహంగా అడిగాడు)

వాసు : నువ్వుగాక ఇంకా తొమ్మిదిమంది చేరితే నా వంతు పదిపూర్త వుతుంది.

పాపారావు : ఏడ్చినట్లుంది... అంటే ఇంత వరకు ఏ 'శుంఠా' చేరలేదంటావ్.

వాసు : అందుకేగా మామయ్యా ఫస్ట్ నిన్ను చేర్పిస్తుంది. 'ఇంట గెలిచి రచ్చ గెలవమన్నారు' కదా!

పాపారావు : అంటే నేను శుంఠనా? (ఆశ్చర్యంగా అడిగాడు) పిచ్చి పిచ్చి వేషాలేయకు.. ఆ తొమ్మిది మంది చేరిన తర్వాత నా దగ్గరకు తగలడు అప్పుడు ఆలోచిస్తా. (ఇంతలో కావేరి వస్తుంది)

కావేరి : వాసూ, వాసూ నా కొక డౌట్ నువ్వే తీర్చాలి. తీరుస్తావా?

వాసు : ఓ తప్పకుండా అడుగు.

కావేరి : మాట తప్పవుగా.

వాసు : తప్పను.

కావేరి : మరీ ఇప్పుడే టి.వి.లో చూపించారు. 'పులిరాజా కు' 'ఎయిడ్స్' వస్తుందా? రాదా?

వాసు : అబ్బా అది అంత అవసరమా?

పాపారావు : వాడికి ఎయిడ్స్ వస్తుందో రాదో తెలియదు కానీ నువ్వు ఇంక ఇక్కడ ఉంటే నా చేతిలో చావొస్తుంది. ఫో లోపలికి (కావేరి వెడుతుంది)

పాపారావు : ఒరే వాసూ నేను నీ స్కీములో చేరాలంటే ఒక కండీషను. నువ్వు కావేరి వంక కన్నెత్తి చూడకూడదు. పన్నెత్తి మాట్లాడకూడదు.

-(తరువాయి వచ్చే సంచికలో)




ఉన్న పాటలన్నీ మంచి పాటలేనని అనిపించుకున్న అన్నపూర్ణా వారి

# వెలుగు నీడలు

చిత్రంలోని తొమ్మిది పాటలలో మూడింటి గురించి గత సంచికలో వివరించగా మరో రెండిటి గురించి ఈ సంచికలో.....

ఓ రంగయో పూల రంగయో
ఓర చూపు చాలించి
సాగిపోవయో ॥ఓరంగయో॥
పొద్దువాలి పోతున్నదోయి
ఇంత మొద్దు నడక
నీకెందుకోయి- ॥పొద్దు॥ ॥ఓ రంగయో॥
పగలనక రేయనక
పడుతున్న శ్రమనంతా
పరుల కొరకు ధారపోయు
మూగజీవులు ॥పగ॥
ఆటలలో పాటలలో
ఆయాసం మరిచిపోయి
ఆనందం పొందగలుగు
ధన్యజీవులు ॥ఓ రంగయో॥
కడుపారగ కూడులేని
తలదాచగ గూడులేని
ఈ దీనుల జీవితాలు
మారు టెన్నడొ ॥కడుపారగ॥
కలవారలు లేనివారి
కష్టాలను తీర్చుదారి
కనిపెట్టి మేలు చేయగలినప్పడే ॥ఓ రంగయో॥



ఈ పాటను శ్రీశ్రీ రాయగా సుశీల, ఘంటసాల బృందం ఆలపించారు. సావిత్రి, అక్కినేనితో పాటు కొందరు జూనియర్ ఆర్టిస్టులు అభినయించారు. సన్నివేశపరంగా చూసుకుంటే హీరో, హీరోయిన్లు అలా చల్లగాలి కోసం బైటికెళ్ళి పాడుకొని ఒకరినొకరు మరింతగా అర్థం చేసుకోవాలి. ఇప్పటి పరిస్థితుల్లో ఇటువంటి సన్నివేశాలకి ఎటువంటి పాటలు వస్తాయో తలచుకుంటే -విలువలకు విలువనిచ్చే మనసేదైనా సరే కుమిలిపోతుందే తప్ప మరేం చేయలేదు. కానీ 'అన్నపూర్ణ' వారికి ఇటువంటి ఊహలు రావు. హీరో ఎలాగూ అభ్యుదయ భావాలున్న వ్యక్తి కనుక హీరోయిన్

అతడి భావాలను అభిమానిస్తూ ఉంటుంది కనుక బోట్ పై విహరిస్తున్నప్పుడు కూలిపనులు ముగించుకుని ఇళ్ళకు వెళుతున్న శ్రమజీవులను చూస్తూ పాడుకుంటే బావుంటుందనీ-కథలో తరువాత వచ్చే భాగంలో అక్కినేని మాట మీద ఒకటైన జగ్గయ్య, సావిత్రి తమ జీవితాలను పేదవారికి అంకితం చేయాలనుకోవడానికి, ఆ తరువాత వైధవ్యం పొందిన సావిత్రి పాత్ర వారి సేవలలో తన జీవితాలను గడపాలనుకునే నిర్ణయం తీసుకోవడానికి ఈ సన్నివేశం ఆలంబనగా ఉంటుందనీ - ప్లాన్ చేసుకున్నారు. శ్రమశక్తిని గౌరవిస్తూ అభ్యుదయభావాలకు తావిచ్చే పాట అనగానే శ్రీశ్రీ కలం ఎంతగా పులకించిపోతూ ఎన్నేళ్ళయినా వన్నె తగ్గని అమృతధారలను అక్షరరూపంలో ఎలా వర్షిస్తుందో ప్రత్యేకంగా చెప్పనవసరంలేదు. ఈ పాటను తమిళ వెర్షన్ 'తూయఉళ్లమ్'లో రాసిన ఉడుమలై నారాయణ కవి పల్లవి కోసం చాలా రకాలుగా ప్రయత్నించి ప్రయత్నించి చివరకి అసంతృప్తిగానే 'ఓ వేలప్పా- తంగ వేలప్పా' అంటూ సరిపెట్టుకోవలసి వచ్చింది. హరి కాంభోజి రాగానికి కైశిక నిషాదాన్ని అన్యస్వరంగా చేసుకుంటూ స్వరపరిచిన ఈ పాటలో ఇంటర్లూడ్స్‌లో ఫ్లూట్ - ఆ వెనక వినిపించే రిథమ్, ఆ తరువాత వయొలిన్ల నడకను బాగా ఒంటపట్టించుకోగలిస్తే తర్వాతి రోజుల్లో పెండ్యాల స్వరపరిచిన ఎన్నో పాటలలో ఆ పోకడను గమనించవచ్చు. ఈ గీతానికి మాతృక ఓ మరాఠీ చిత్ర గీతమని శ్రీ వి.ఎ.కె.రంగారావు తన 'ఆలాపన' శీర్షికలో పేర్కొన్నారు.

కలకానిది విలువైనది
బ్రతుకు కన్నీటి ధారల లోనే
బలిచేయకు ॥కల॥
గాలివీచి పూవుల తీగ
నేల వాలిపోగా ॥గాలి॥
జాలివీడి అటులే దాని వదిలివైతువా.....ఓ.....ఓ..ఓ..
చేరదీసి నీరు పోసి
చిగురించ నీయవా ॥కల॥
అలముకున్న చీకటిలోనే
అలమటించనేలా ॥అలము॥
కలతలకే లొంగిపోయి కలువరించనేలా..ఓ...ఓ.....ఓ...
సాహసమను జ్యోతిని
చేకొని సాగిపో ॥కల॥
అగాధమౌ జలనిధిలోన
ఆణిముత్యమున్నటులే
శోకాల మరుగున దాగి
సుఖమున్నదిలే ॥అగాధ॥
ఏది తనంత తానై నీ దరికి రాదు
శోధించి సాగించాలి
అదియే ధీరగుణం ॥కల॥







కేవలం 'అన్నపూర్ణ' సంస్థకు మాత్రమే- అని పరిమితం చేయకుండా- తెలుగు సినీ గీతాల చరిత్రలో చిరస్థాయిగా నిలిచిపోదగ్గ పాటగా, ఈ పాటతో సంబంధం ఉన్న ప్రతి ఒక్కరూ తమ జీవితాంతం గర్వంగా చెప్పుకొనే పాటగా 'కల కానిది విలువైనది' పాటను పేర్కొనాలి. పదసంపదకు, భావ పరిణతకు అద్దం పట్టే ఈ పాటలోని విషయాన్ని ఇవాళ మనం వ్యక్తిత్వ వికాసానికి, మనో విజ్ఞానానికి తోడ్పడే ఎన్నో వ్యాసాలలో మరో రూపంలో చదువుతున్నామని గ్రహించాలి. 'లైఫ్ ఈజ్ నాట్ ఏ డ్రీమ్' అని వివేకానందుడు చెప్పిన మాట ఈ పాటకు ప్రేరణ అని అనే వాళ్ళున్నారు. 'అగాధమౌ జలనిధిలోన' అన్న విషయాన్ని ఖలీల్ జిబ్రాన్ ఏనాడో తన సూక్తుల్లో చెప్పాడని అనేవాళ్ళున్నారు. శ్రీ శ్రీ మాత్రం ఈ చిత్రం తమిళ వెర్షన్ లో ఇదే సన్నివేశానికి ఉడుమలై నారాయణ కవి రాసిన చరణాలలోంచి ఈ చరణాన్ని తను తీసుకున్నానని తన సినీ గీతాల సంకలనంలో రాసుకున్నారు. ఇక సంగీత పరంగా చూసుకుంటే - ఈ పాట పీలూ రాగ చ్ఛాయలలో వుందని చెప్పాలి. 1960లో 'సారంగా' అనే హిందీ చిత్రం వచ్చింది. నేటి ప్రముఖ సంగీత దర్శకుడు అనుమల్లిక్ తండ్రి సర్దార్ మల్లిక్ ఆ చిత్రానికి సంగీత దర్శకుడు. ఆ చిత్రంలో ఆయన స్వరపరిచిన 'సారంగా తేరి యాద్‌మె' వంటి హిట్ సాంగ్‌తో పాటు 'పియా కైసే మిలూఁ తుఝ్‌సే మెరెపాఁవ్ పడే జంజీర్' అనే మరో మంచి పాటకూడా వుంది. రఫీ, లతా పాడిన ఆ పాట పీలూ రాగంలోనూ, మధ్యమ (మ) నిషాద (ని) స్వరాలను కలుపుకున్న శివరంజని రాగంలోనూ ఉంటుంది. ఈ రెండు రాగాల మిశ్రమంతో కూడిన పాడిన ఆ పాట ఎక్కడైనా దొరికితే విని చూడండి. స్వరపరిచిన పద్ధతి, పాడించిన పద్ధతి, అంతా ఈ 'కల కానిది విలువైనది' పాటకు రేఖామాత్రంగానైనా ప్రేరణ అయి ఉంటుందా అనే అనుమానం రావడానికి ఆస్కారం ఉంది. ఈ పాటను తెరపై అక్కినేని నాగేశ్వరరావు ప్రధాన పాత్రధారిగా అభినయించగా సావిత్రి, రేలంగి, యస్వీ రంగారావు, సూర్యకాంతం సన్నివేశ ప్రాధాన్యంగా కనిపిస్తారు. అంతేకాదు ఈ పాటను కథానాయకుడు రేడియో స్టేషన్‌లోని రికార్డింగ్ రూమ్‌లో పాడాలి కనుక ఆర్కెస్ట్రాకు సూచనలిచ్చే సంగీత దర్శకుడిగా ఈ చిత్ర సంగీత దర్శకుడు పెండ్యాల నాగేశ్వరరావు కనిపించడం మరో విశేషం . ఈ పాట మూడవ చరణంలో గల 'శోకాలా మరుగున దాగి' అనే లైను రిపీట్ అవుతున్నప్పుడే ఘంటసాల తన గొంతులో పలికించిన అందమైన జీరను ఈ నాటికీ ఎందరో గాయకులు యథాతథంగా అనుకరించడానికి ప్రయత్నిస్తున్నారంటే- ఘంటసాల ఈ పాటను హృదయానికి హత్తుకునేలా పాడారని చెప్పడానికి ఇంతకన్నా మంచి ఉదాహరణ దొరకదు.

- వచ్చే సంచికలో మరికొంత

రచన : కొసరాజు **1** గానం : ఘంటసాల

కృష్ణుడు -ముసలి బ్రాహ్మణుడు:
అపాయమ్ము దాటడాని కుపాయమ్ము కావాలి!
అంధకార మలమినపుడు వెలుతురుకై వెదకాలి!
ముందు చూపులేనివాడు -ఎందునకూ కొరగాడు!
సోమరియై కునుకువాడు సూక్ష్మమ్ముగ్రహించలేడు!
మత్తువదలరా - నిద్దుర మత్తువదలరా!
ఆ మత్తులోన పడితే - గమ్మత్తుగ చిత్తౌదువురా! ॥మత్తు॥
జీవితమున సగభాగం - నిద్దురకే సరిపోవు
మిగిలిన ఆ సగభాగం - చిత్తశుద్ధిలేకపోవు
అతి నిద్రాలోలుడు - తెలివిలేని మూర్ఖుడు
పరమార్థం కానలేక - వ్యర్థంగా చెడతాడు ॥మత్తు॥
సాగినంతకాలం -నా అంతవాడు లేడందురు
సాగకపోతే ఊరక చతికిలబడిపోదురు
కండబలముతోటే ఘనకార్యము సాధించలేరు
బుద్ధిబలము తోడైతే విజయమ్ము వరింపగలరు ॥మత్తు॥
చుట్టు ముట్టు ఆపదలను- మట్టుబెట్ట బూనుమురా!
పిరికితనము కట్టిపెట్టి - ధైర్యము చేపట్టుమురా!
కర్తవ్యము నీ వంతు - కాపాడుట నా వంతు!
చెప్పడమే నా ధర్మం - వినకపోతే నీ ఖర్మం ॥మత్తు॥

రచన : సి. నారాయణరెడ్డి **2** గానం : జిక్కి

హిడింబి:
ఛాంగురే ఛాంగు ఛాంగురే
ఛాంగురే బంగారు రాజా!
ఛాంగు- ఛాంగురే బంగారు రాజా!
మజ్జారే మగరేడా - మత్తైన వగకాడా!
అయ్యారే! ...అయ్యారే నీకే మనసియ్యాలని వుందిరా ॥ఛాంగురే॥
ముచ్చటైన మొలక మీసముంది -
భళా! అచ్చమైన సింగపు నడుముంది!
జిగి బిగీ మేనుంది- సొగసులొలుకు మోముంది
మేటి దొరవు అమ్మక చెల్ల! నీ సాటి ఎవ్వరుండుట కల్ల ॥ఛాంగురే॥
కైపున్న మచ్చకంటిచూపు - అదిచూపుకాదు పచ్చలపిడిబాకు
పచ్చలపిడిబాకో- విచ్చిన పువురేకో!
గుచ్చుకుంటె తెలుస్తుందిరా-
మనసిచ్చుకుంటె తెలుస్తుందిరా ॥ఛాంగురే॥
గుబులుకొనే కోడెవయసు లెస్స - దాని గుబాళింపు ఇంకా హైలెస్స
పడుచుదనపు గిలిగింత - గడుసు గడుసు పులకింత
ఉండనీయమేమి సేతురా- కై దండలేక నిలువలేనురా ॥ఛాంగురే॥

మూలం : బమ్మెరపోతన భాగవతం **పద్యము:1** గానం : పి.బి. శ్రీనివాస్

నారదుడు :
నల్లనివాడు పద్మనయనంబులవాడు కృపారసంబు పై
జల్లెడువాడు మౌళిపరిసర్పి త పింఛమువాడు నవ్వు రా
జిల్లెడు మోమువాడు -మనసిచ్చిన కోరికలిచ్చువాడు శ్రీ
వల్లభుడైన శౌరి యదు వల్లభు భక్తిని పూజసేయుమా

రచన : సముద్రాల **పద్యము:2** గానం : మాధవపెద్ది

జరాసంధుడు:
దుర్మదాంధుడు - బాంధవద్రోహి - కపటి
పరమనీచుడు యాదవార్భకుడు నన్ను
ధిక్కరించునే - ఆ పగ దీరువరకు
శాంతిగనునే ఈ జరాసంధ చక్రవర్తి

రచన : సముద్రాల **3** గానం : పి.బి. శ్రీనివాస్

నారదుడు:
ఏమిటయా నీ లీల - కృష్ణా! ఏమిటయా నీ లీల
ఎందులకీ గోల - మాయాలోలా ॥ఏమి॥
మట్టి బొమ్మలకు ప్రాణముపోసి - మతినొసగి మదమత్తులజేసి
అధార్మికుల అణగార్చ నెపాన - అవతారము ధరియింతువయా ॥ఏమి॥
పరమాత్ముడవై నరులవిధాన - సరసాల గొడవలో చొరబడియేవు
కన్నియ ఇంట కలతలురేపి - కళ్యాణానికే సిద్ధమయేవు ॥ఏమి॥

రచన : సముద్రాల **4** గానం : ఘంటసాల, సుశీల

కృష్ణుడు - రుక్మిణి:
కృ:ప్రియురాల సిగ్గేలనే - నీ మనసేలు మగవానిజేరి ॥ప్రియ॥
రు:నాలోన ఊహించిన - కలలీనాడు ఫలియించె స్వామీ ॥నాలోన॥
కృ: ఏమీ ఎరుగని గోపాలునికి - ప్రేమలేవో నేరిపినావు
మనసుదీర పలుకరించి - మా ముద్దు ముచ్చట చెల్లించవే ॥ప్రియ॥
రు:ప్రేమలు తెలిసిన దేవుడవని విని - నా మదిలోన కొలిచితిని
స్వామివి నీవని తలచి నీకే బ్రతుకే కానుకజేసితిని ॥నాలోన॥
కృ: సమయానికి తగు మాటలునేర్చిన- సరసురాలవే ఓ భామా!
ఇపుడేమన్నా ఒప్పునులే - ఇక ఎవరేమన్నా తప్పదులే ॥ప్రియ॥

మూలం : బమ్మెరపోతన భాగవతం **పద్యము:3** గానం : సుశీల

రుక్మిణి:
ప్రాణేశ నీమంజు భాషలు వినలేని - కర్ణ రంధ్రంబుల కలిమియేల
పురుషరత్నమ! నీవు భోగింపగా లేని - తనులతవలని సౌందర్య మేల
భువన మోహన నిన్ను పొడగానగా లేని- చక్షురింద్రియముల సత్త్వమేల
దయిత! నీయధరామృతం బానగాలేని- జిహ్వకు ఫలరస సిద్ధియేల
నీరజాతనయన! నీ వనమాలికా గంధ మబ్బలేని ఘ్రాణమేల
ధన్యచరిత! నీకు దాస్యంబు సేయని - జన్మమేల వేయి జన్మలకును

రచన : సముద్రాల **5** గానం : పి.బి. శ్రీనివాస్

(పల్లవి) అగ్నిద్యోతనుడు:
కృష్ణా! యదుభూషణా! హే కృష్ణా ! యదుభూషణా!
గోవిందా ! ముకుందా! హే పావనా! ॥కృష్ణా॥

మూలం : బమ్మెరపోతన భాగవతం **పద్యము:4** గానం : సుశీల

రుక్మిణి:
నమ్మితి నామనంబున సనాతనులైన ఉమామహేశులన్
మిమ్ము పురాణ దంపతుల మేలు భజింతుగదమ్మ మేటి పె
ద్దమ్మ! దయాంబురాశివి గదమ్మ! హరిన్ పతి సేయుమమ్మ ! నిన్
నమ్మిన వారి కెన్నటికి నాశములేదు గదమ్మ! ఈశ్వరీ!

రచన : సముద్రాల **5** గానం : పి.బి. శ్రీనివాస్

అగ్నిద్యోతనుడు: (చరణము -1)
దీనులపాలిటి దైవము నీవట- అమరులనేలెడి అయ్యవు నీవట!
భక్త కోటికి చింతామణివట - నినునెరనమ్మిన లోటేరాదట ॥కృష్ణా॥

మూలం : బమ్మెరపోతన భాగవతం **పద్యము:5** గానం : పి.సుశీల

రుక్మిణి:
ఘనుడా భూసురుడేగెనో నడుమ మార్గశ్రాంతుడై చిక్కెనో
విని కృష్ణుండది తప్పుగా దలచెనో! విచ్చేయునో!ఈశ్వరుం
డనుకూలింప దలంచునో దలపడో - ఆర్యా మహాదేవియున్
నను రక్షింప నెఱుంగునో, ఎఱుగదో! నా భాగ్య మెట్లున్నదో!

రచన : సముద్రాల **5** గానం : పి.బి. శ్రీనివాస్

అగ్నిద్యోతనుడు: (చరణము-2)
అఖిలము నెరిగిన అంతర్యామికి - వివరించే పని లేదుగదా!
నమ్మిన కొమ్మను ఏలుకొమ్మని - కృష్ణా- రమ్మని పిలచుట నా భాగ్యమెగా ॥కృష్ణా॥

మూలం : బమ్మెరపోతన భాగవతం **పద్యము:6** గానం : సుశీల

రుక్మిణి:
లగ్నంబెల్లి వివాహముం గదిసె ఏలారాడు గోవిందుడు
విఘ్నంబయ్యెడి మానసంబు వినెనో వృత్తాంతమున్ బ్రాహ్మణుం
డగ్నిద్యోతను డేటికిన్ దడసెనో - యత్నంబు సిద్ధించునో
భగ్నంబై చనునో - విరించి కృతమెబ్భంగిన్ ప్రవర్తించునో

మూలం : బమ్మెరపోతన భాగవతం **పద్యము:7** గానం : పి.బి. శ్రీనివాస్

అగ్నిద్యోతనుడు:
ఆ యెలనాగ నీకు తగు- అంగనకున్ తగుదీవు మా యుపా
ధ్యాయుల యాన పెండ్లియగు తప్పదు జాప్యములేల నీవు నీ
తోయము వారి గూడుకొని తోయరుహాననదెత్తు గాని - వి
చ్ఛేయుము శత్రులన్ నుఱుము సేయుము - సేయుము శోభనంబిలన్

మూలం : బమ్మెరపోతన భాగవతం **పద్యము:8** గానం : పి.బి. శ్రీనివాస్,సుశీల

అగ్నిద్యోతనుడు:రుక్మిణి
అంకిలి సెప్పలేదు చతురంగ బలంబులతోడ నెల్లి యో
పంకజనాభ! నీవు శిశుపాల జరాసుతులన్ జయించి నా
వంకకు వచ్చి రాక్షస వివాహమునన్ భవదీయ శౌర్యమే
యుంకువ జేసి కృష్ణ! పురుషోత్తమ! చేకొని పొమ్ము వచ్చెదన్

మూలం : బమ్మెరపోతన భాగవతం **పద్యము:9** గానం : ఘంటసాల

కృష్ణుడు:
వచ్చెద విదర్భ భూమికి
జొచ్చెద భీష్మకుని పురము సురుచిర లీలన్
తెచ్చెద బాలన్ వ్రేల్మిడి
వ్రచ్చెద నడ్డంబు రిపులు వచ్చిన పోరన్

మూలం : బమ్మెరపోతన భాగవతం **పద్యము:10** గానం : ఘంటసాల

నేపథ్యము :
కనియెన్ రుక్మిణి చంద్రమండల ముఖున్ కంఠీరవేంద్రావ ల
గ్ను నవాంభోజ దళాక్షు చారుతర వక్షున్ మేఘ సంకాశ దే
హు నగారాతి గజేంద్ర హస్తనిభ బాహున్ చక్రి పీతాంబరున్
ఘన భూషాన్వితు కంబు కంఠు విజయోత్సాహున్ - జగన్మోహనున్

మూలం : బమ్మెరపోతన భాగవతం **పద్యము:11** గానం : మాధవపెద్ది

జరాసంధుడు:
బ్రతుకవచ్చు నొడల ప్రాణంబులుండిన
బ్రతుకు కలిగెనేని భార్యకలదు
బ్రతికి తీవు భార్య పట్టు దయ్యమెరుంగు
వగవ వలదు చైద్య- వలదు వలదు!

మూలం : బమ్మెరపోతన భాగవతం **పద్యము:12** గానం : మాధవపెద్ది

రుక్మి:
మాసరి వాడవా మా పాప గొనిపోవ - ఏపాటి గలవాడ వేది వంశ
మెందు జన్మించితి వెక్కడ పెరిగితి- వెయ్యది నడవడి ఎవ్వడెరుగు
మాన హీనుడ వీవు మర్యాద లెరుగవు - మాయగైకొని గాని మలయరావు
నిజరూపమున శతృ నివహంబుపైబోవు వసుధేశుడవుకావు- వావిలేదు కృష్ణా!
కొమ్మనిమ్ము నీవు గుణరహితుడవు - విడువు విడువవేని విలయకాల
శిఖి శిఖా సమాన శిత శిలీ ముఖముల - గర్వమెల్లగొందు కలహమందు

మూలం : బమ్మెర పోతన భాగవతం **పద్యము:13** గానం : పి.బి. శ్రీనివాస్

నారదుడు :
తలమనక భీష్మనందను
తలయును మూతియును గొరుగ తగవే బంధున్
తలయును మూతియు గొరుగుట
తలదరుగుటకంటె తుచ్ఛ తరము మహాత్మా!

మూలం : బమ్మెర పోతన భాగవతం **పద్యము:14** గానం : పి.బి. శ్రీనివాస్

నారదుడు:
తగు నీ చక్రి విదర్భరాజ సుతకున్ తథ్యంబు వైదర్భియున్
తగు నీ చక్రికి ఇంతమంచి దగునే దాంపత్య మీ ఇద్దరన్
దగులన్ గట్టిన బ్రహ్మ నేర్పరిగదా దర్పాహతారాతియై
మగడైనాడుగ చక్రి ఈ రమణికిన్ - మా పుణ్యమూలంబునన్

రచన : సముద్రాల **6** గానం : జిక్కి, యల్.ఆర్. ఈశ్వరి

రుక్మిణి చెలియలు:
నల్లని వాడైనా-ఓ చెలీ -చల్లనివాడేలే!
గోపుల గాచెడి వాడైనా - నీ గొప్పకు తగ్గని వాడే చెలీ ॥నల్లని॥
మురళీ మోహనుని - చెలీ, మురిపించిన జాణవులే!
మా గోపాలుని ఇల్లాలివౌట- నీభాగ్యమె భాగ్యము
ఇలవేలుపులౌ మిమ్ముల జూచి - తరియించెను మా జన్మలే ॥నల్లని॥
మనసే పందిరియై - చెలీ, నీ వలపులు పూలతలై
అనురాగాలే పరిమళించి -ఆనందము నీయగా
మీ ప్రియగాథ - యుగయుగాలకు - కథగా నిలచునులే ఓ చెలీ ॥నల్లని

రచన : సముద్రాల **పద్యము:15** గానం : ఘంటసాల

నేపథ్యము:
ప్రీతి నర్థుల నాదరించు ధర్మసుతుండు -
పరుల ఆదరమ్మున బ్రతుక వలసె
కొండలైనను పిండి గొట్టెడు భీముడు-ఆర్తుడై చేసాచి అడుగవలసె
అరిభయంకర ధనుర్ధరుడైన పార్థుడు - పరువును విడి జోలె పట్టవలసె
కవికి వెన్నెల సోక కందిపోవు కవలు - ఎండలో బిచ్చము నెత్తవలసె
తిరిపెపుం బువ్వ నాకలి దీర్చుకొనుచు
ఒరుల పంచను కాపుర ముండవలసె
బ్రాహ్మణాకృతి పాండు భూపాలసుతులు
కటకటా! ఎంత చిత్రమీ కాలమహిమ

రచన : కొసరాజు **7** గానం: మాధవపెద్ది

భీముడు:
ఓహొహొ హొహొ....
భళాభళీ నా బండీ- పరుగుతీసే బండి
బండిలో తిండి జూడ - బ్రహ్మకు నోరూరునండి ॥భళా॥
తిండి లేనిదే కండలేదురా! కండలేనిదే గుండెరాదురా! హే తమ్ముడూ!
గుండెదిటవుగానున్నచో - బ్రహ్మాండములోనే ఎదురు లేదురా
కరకర ఆకలి మండుతువుంటే - కమ్మని భోజన మెదురుగవుంటే
గుటకలు మ్రింగుచు కూర్చొనువాడు - ఉంటేవాడు వెర్రివాడు ॥భళా॥
అట్టురా! మిన పట్టురా! దీన్నొదిలి పెట్టే దెట్టురా!
తీపి తీపి బొబ్బట్టురా! అహ తింటే ఆకలి కట్టురా!
పప్పుతోటి ముద్దగలిపి- పచ్చడితో అనుపానమేసి
బక్కపేగులకు పట్టిస్తుంటే- చెప్పశక్యమా దీని రుచి ॥భళా॥
సాటిలేని జగజెట్టి భీముని - చేతుల తీట తీరునులే
అరి చేతుల తీట తీరునులే
ఏకచక్ర పురవాసుల బెడద - నేటితోనే పరి మారునులే
తల్లి ఋణమ్మును తీర్చెద -నా ధర్మమ్మును నెరవేర్చెద
ఓ ఆత్మబంధూ! నీ అండ వుంటె ఎవరడ్డమైన పరిమార్చెద ॥భళా॥

రచన : సముద్రాల | పద్యము:16 | గానం: మాధవపెద్ది

జరాసంధుడు:

సాటిరాజందునా శాపోపహతమైన -యదువంశమున జన్మ మందినావు
సరి వీరుడందునా సమరాన వెన్నిచ్చి-ద్వారకా నగరిలో దాగినావు
గుణశాలి వందునా కూరిమి జూపిన -మామపై బడి హత మార్చినావు
మతిమంతు డందునా మరది ప్రేమించిన-అబల హరించి పెండ్లాడినావు
మూతిమీదను మీసమే మొలవనట్టి- పేడివగు నీవు నాసరి జోడుకావు
మీసలను దీసిననుబల్ రోసమున్న-భీమసేనుడె నాకు ఉజ్జీ ముకుందా!

రచన : సి. నారాయణరెడ్డి | 8 | గానం: సుశీల, లీల

స్వాగతం... స్వాగతం సుస్వాగతం
స్వాగతం కురుసార్వభౌమ స్వాగతం సుస్వాగతం
శత సోదర సంసేవిత సదనా అభిమానధనా సుయోధనా
స్వాగతం సుస్వాగతం
మచ్చలేని నెలరాజువు నీవే
మనసులోని వల రాజువు నీవే
రాగ భోగ సుర రాజువు నీవే...
రాజులకే రారాజువు నీవే
ధరణిపాల శిరోమకుట మణి తరుణ కిరణ పరిరంజిత చరణా
స్వాగతం సుస్వాగతం
తలపులన్ని పన్నీటిజల్లులై
వలపులన్ని విరజాజిమల్లెలై...
నిన్ను మేము సేవించుటన్నది
ఎన్ని జన్మముల పున్నెమో అది
కదన రంగ బాహుదండ ధృత గదా ప్రకట పటు శౌర్యా భరణా
స్వాగతం సుస్వాగతం

రచన: సముద్రాల | పద్యము:17 | గానం: పిఠాపురం నాగేశ్వరరావు

పిట్టనొకదాని పడమొత్తి గుట్ట నెత్తి
బురదపాముని చేబట్టి బుగిలియున్న మద్దుల గూల్చి
ముదుసలి ఎద్దు గెల్చి
బల్లిదుడనన్న మల్లులు గొల్లు మనరె
పాలుదాపగా వచ్చిన పడతి ఉసురు చూరగొన్నావు
ప్రేమతో చేర బిలుచు సజ్జనుని మేనమామను చంపినావు
హంతకుడవు ఎట్లుగై కొందువగ్రపూజ
కన్నుమరుగైన వెన్న మీగడ హరించి
మాయ లెరుగని మగువల మది గలంచు చోర జారాగ్రణివి
సదాచారుడవని పొగడ తలయూప నీకైన బుద్ధి లేదే
అత్తకొడుకుకు నిశ్చయంబైన కన్నె చెల్లెలగు గాదె
ఆమెను చెట్టబట్టి కులుకునిను దేవుడని మెచ్చుకొంద్రుగాక
ఎవరు... నీదు దాసులు
నిను దేవుడని మెచ్చుకొంద్రు గాక నీదు దాసులు
నేను మన్నింప కృష్ణా

రచన: సముద్రాల | పద్యము: 8 | గానం: ఘంటసాల

వికృత రూపుని నిన్ను చూపించునాడు
అత్త కొసగిన మాట పోనాడలేక
కాచితిని నూరు తప్పలు ఈ క్షణము తోడ
చెల్లిపోయె నీ ఆయువు చేదిరాజా!

# కథా సంగ్రహం

శ్రీ కృష్ణ భగవానుడు భగవద్గీతలో"సాధు సంరక్షణ, దుష్ట శిక్షణ, ధర్మ సంస్థాపన కోసం ప్రతి యుగంలో నేను జన్మిస్తూ వుంటాను"అని చెప్పారు. ఆ కార్యక్రమంలో పాండవ రక్షణ, కౌరవ శిక్షణ, ఒకటి. యుద్ధంలోఅర్జునుణ్ణి నిమిత్తంగా చేశాడు. యుద్ధానికి ముందు భీమసేనుని దుష్ట శిక్షణకు వినియోగించుకొన్నాడు.

పాండురాజు మరణించిన తరువాత పాండవులు తల్లి కుంతీదేవితో హస్తినాపురానికి వచ్చి అక్కడే పెరుగుతున్నారు. కాని కౌరవులు వారిని అనురాగ పాత్రులైన అన్నదమ్ములుగా కాక అసూయాపరులైన దాయాదులుగా భావించి అనేక కష్టాలు కలిగించేవారు. కళ్లారా చూచినా కుంతీదేవి ఏమి చేయలేక అల్లుడు శ్రీ కృష్ణమూర్తితో తన బాధ వెళ్లబోసుకొని బావలను కాపాడమంటుంది. అలాగేనని ఆ బాధ్యతను పైనవేసుకొన్నాడు వాసుదేవుడు.

దుర్యోధనుడు పాండవులను కాశీలో లక్కయింటిలో పెట్టి దహనం చేయాలని తన మిత్రులు, మామ శకునితో పన్నాగం చేసి, నయానా, భయానా, చెప్పి తండ్రిని అందుకు ఒప్పిస్తాడు. ధర్మరాజు ఆ దుస్తంత్రం తెలుసుకో లేక పెద్దలవద్ద సెలవు తీసుకుని కాశికి వెళతాడు. శ్రీ కృష్ణుడు కాశినగరానికివచ్చి, జరిగిన మోసం భీమసేనునికి తెలియజేసి, ఆ ఇంటిలో నుంచి వెలుపలికి బిలం త్రవ్వమని చెపుతాడు. జాగారం చేస్తానని మాట తీసికొంటాడు. కన్ను మూయకుండా కాపాడతాడు. నిర్ణీతదినాన కౌరవదూతలు లక్కయింటికి నిప్పు పెట్టగానే పసిగట్టి వారిని ఆమంటల్లో వేసి బావ మాట ప్రకారం బిల మార్గాన భీముడు, అన్నదమ్ములను, తల్లిని తప్పించి తీసుకుపోతాడు.

ఒకచోట తల్లినీ, అన్నదమ్ములను, పెట్టి భీమసేనుడు కాపలాకాస్తూ ఉండగా హిడింబుడనే రాక్షసుడు వాసనబట్టి వారిని తెమ్మని చెల్లెలు హిడింబిని పంపుతాడు. ఆమె వచ్చి భీమసేనుని రూపంచూచి మెచ్చి తన్ను పెళ్ళాడమని అర్థిస్తుంది. ఆలస్యానికి ఆగలేక హిడింబుడు వచ్చి భీమునితో తారసిల్లి చనిపోతాడు. తల్లికోరిక మీద హిడింబిని భీమసేనుడు పెళ్ళాడతాడు. శ్రీ కృష్ణుడు వచ్చి నూతన దంపతులను ఆశీర్వదిస్తాడు. కుంతి కృష్ణుని పెళ్లిమాట తెస్తుంది. "ఆ సుముహూర్తం వచ్చినప్పుడు సతీసమేతంగా వచ్చి నేనే నీ ఆశీస్సులు పొందుతాలే అత్తా!" అంటాడు వాసుదేవుడు.

నారదుడు రుక్మిణి దేవికి కృష్ణ మంత్రోపదేశం చేసి స్మరించ మంటాడు. తప్పకుండా స్వామి నీ కోరిక తీర్చి నిన్ను తరింపజేస్తాడంటాడు. కాని మగధ సామ్రాట్ జరాసంధుడు రుక్మిణిని శిశుపాలునికిచ్చి పెళ్ళిచేయించడానికి ఆమె అన్న రుక్మిచేత వాగ్దానం పుచ్చుకొంటాడు. నారదుని సలహాతో రుక్మిణి తనకు గురుతుల్యుడైన విప్రుని ద్వారా పరిస్థితులు కృష్ణస్వామికి వివరించి తనను రక్షించమని రాయబారం పంపుతుంది. దేవి పూజకు వచ్చిన రుక్మిణీ దేవిని తీసికొని రథారూఢుడై కృష్ణుడు ద్వారకకు వెళతాడు. కళ్యాణమండపంలో కన్నెకోసం ఎదురు చూస్తున్న శిశుపాలాది రాజలోకం ఉద్రిక్తులై కృష్ణుని వెంటపడతారు. దంతవక్త్రుని చంపి, రుక్మిని పరాభవించి ద్వారవతికి చేరి శ్రీ కృష్ణుడు రుక్మిణీ దేవిని పెళ్ళాడతాడు.

అనాడిచ్చినమాట మేరకు ఏకచక్రపురంలో ప్రచ్ఛన్న జీవితం గడుపుతున్న అత్తవద్దకు వెళ్లి పుణ్యదంపతులు దీవెనలందుతారు.

బకుడనే రాకాసి ఏకచక్ర పురప్రజలను పీడించుకుతింటూ ఉన్నాడు. ఒప్పందం ప్రకారం ఆనాడు నరబలి యీయవలసినవంతు పాండవులుండే ఇంటి బ్రాహ్మణులది. నేనంటే నేనని వారు వంతులు వేసుకుని వాపోతున్నారు. ఆ దుస్థితి చూచి వారిని ఓదార్చి కుంతీదేవి భీమసేనుని పంపించింది. బండిమీదుండిన భోజనమంతా భోంచేసి బకాసురుణ్ణి మట్టుపెట్టి భీముడు విజయోత్సాహంతో తిరిగి వస్తాడు.

ద్రుపద మహారాజుకు తన కూతురు ద్రౌపదిని అర్జునునికి ఇవ్వాలని ఆశ. పాండవులు లక్కగృహంలో దగ్ధమైనందున ఆ అవకాశం తప్పిపోయిందని వాపోతుండగా నారదుడు ద్రుపదునికి, పాండవులు సజీవులేనని, స్వయంవరం చాటిస్తే అర్జునుడు వచ్చి మత్స్య యంత్రం ఛేదించి ద్రౌపదిని పెళ్లాడతాడని చెపుతాడు.

ఏకచక్రపురంలో భిక్షాటన చేస్తున్న అర్జునుడు స్వయంవరం వార్త విని ద్రుపద నగరానికి బయలుదేరతాడు. స్వయంవరానికి నానా దేశాధీశ్వరులు వస్తారు. వచ్చినవారంతా, తుదకు కర్ణునితోసహా నీటిలో నీడ చూచి మత్స్య

యంత్రాన్ని పడగొట్టలేకపోతారు. అప్పుడు విప్రవేషధారియైన అర్జునుడు వచ్చి ఆ యంత్రాన్ని పడగొడతాడు. కళ్యాణం పూర్తికాగానే అర్జునుడు ద్రౌపదిని తీసికొని తల్లివద్దకు వెళ్లి ఒక అపూర్వమైన కానుక తెచ్చానంటాడు. అన్నదమ్ములందరూ సమానంగా పంచుకోండి అంటుంది. ఆడపిల్లని తెలిసి ఆమె నివ్వెరపోతుంది. వాసుదేవుడు వచ్చి ద్రౌపది పూర్వ జన్మకథ చెప్పి ఆ దీవెన క్రమమేనని చెపుతాడు.

పెద్దలమాట త్రోసివేయలేక అంధరాజు, విదురుని పంపి పాండవులను హస్తినాపురికి పిలిపిస్తాడు. పశ్చాత్తాప హృదయుడై ధర్మరాజును చేరదీసి గతం మరిచిపొమ్మని సగపాలు రాజ్యం పంచియిస్తాడు. ఈ నిర్ణయానికి కురురాజు కంటగించుకొంటాడు.

శ్రీ కృష్ణుడు- ఇంతటితో ప్రమత్తులై ఉండరాదనీ- మిత్ర శత్రు నిర్ణయం చేసుకోటానికి రాజసూయం చేయమనీ పాండవులను ప్రోత్సహించి, భీమసేనుని వెంటతీసుకొని జరాసంధుని మట్టుబెట్టటానికి వెళతాడు. బ్రాహ్మణ వేషధారులై అంతఃపురం ప్రవేశించి జరాసంధుణ్ణి నిద్రలేపి రణభిక్ష కోరతాడు. జరాసంధుడు, మోసం తెలిసి కూడా సమవీరుడైన భీమసేనునితో పోరాడతాడు. శ్రీకృష్ణుని సూచన గ్రహించిన భీముడు జరాసంధుని చీల్చి యెడాపెడా పారవేసి అతన్ని కడతేర్చుతాడు.

పాండవుల రాజసూయాహ్వానం కౌరవులకు కూడా వస్తుంది. శకుని మామ సలహా పాటించి కురురాజు బంధు మిత్రులతో తరలి ఇంద్రప్రస్థం వస్తాడు. అఖండ స్వాగతంతో రారాజును పాండవులు గౌరవించి మయసభలో విడిది ఏర్పాటు చేస్తారు. అచ్చటి శిల్ప సౌందర్యాలు చూచి కురురాజు భ్రమిస్తాడు. భంగపడతాడు. పాంచాలి పరిహసించిందను కొంటాడు. ఆక్రోశంతో అందరూ అప్పుడే ప్రతీకారం చేస్తామంటారు. శకుని అడ్డుపడి అది తరుణంగానీ, మార్గంకానీ కాదనీ, మంచిగా తన పాచికలతో వంచించి, పరిహసించిన పాంచాలిని కురురాజు పేరోలగంలో వివస్త్రగా నిల్చి


ఎన్.టి.రామారావు


తివిక్రమరావు


టి.వి.రాజు


సముద్రాల


కొసరాజు


సి.నారాయణరెడ్డి


ఘంటసాల


పి.బి.శ్రీనివాస్


మాధవపెద్ది


పిఠాపురం


సుశీల


లీల


జిక్కి


ఎల్.ఆర్.ఈశ్వరి

పరాభవిస్తానని వాగ్దానం చేస్తాడు.

రాజసూయం సంపూర్ణమవుతుంది. ధర్మరాజు పితామహుని ఆనతిపై వాసుదేవునికి అగ్రపూజ జరిపిస్తాడు. "ఇందరు మహర్షులు, మహారాజులుండగా యాదవునికి అగ్రపూజా!" అని శిశుపాలుడు ఆవేశోద్రేకాలతో శ్రీ కృష్ణుని నిందిస్తాడు. శిశుపాలుని తల్లికిచ్చిన మాట ప్రకారం నూరు తప్పులు కాచి తరువాత చక్రంతో శ్రీకృష్ణుడు అతని శిరస్సు ఖండించి వేస్తాడు. తన విశ్వస్వరూపాన్ని ప్రదర్శిస్తాడు. భీష్మాదులందరూ వినమ్రులై నమస్కరిస్తారు. శ్రీ కృష్ణుడు ఆశ్రితులకు అభయం ఇస్తాడు.

## పాత్రలు- పాత్రధారులు

ఎన్.టి.రామారావు, వి.నాగయ్య, టి.ఎల్.కాంతారావు,
రాజనాల, ముక్కామల, శోభన్‌బాబు, బాలయ్య, మిక్కిలినేని,
కె.వి.ఎస్.శర్మ, ధూళిపాళ, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి,
ఎ.వి.సుబ్బారావు, మల్లాది, బి.హెచ్.విజయారావు,
కె.జగ్గారావు, శేషగిరిరావు,

**ఉదయకుమార్**

కె.ఆర్.విజయ, ఎస్.వరలక్ష్మి, గీతాంజలి, రత్న, స్వర్ణ,

## సాంకేతిక నిపుణులు

చిత్రానువాదము, దర్శకత్వము

**ఎన్.టి.రామారావు**, బి.ఏ.

| | |
|---|---|
| నృత్యములు | : భారతి, కనకలక్ష్మి, సుశీల, తిలకం |
| నేపథ్య గాయకులు | : ఘంటసాల, పి.బి.శ్రీనివాస్, మాధవపెద్ది, పిఠాపురం, సుశీల, లీల, జిక్కి, ఎల్.ఆర్.ఈశ్వరి, |
| రచన | : సముద్రాల రాఘవాచార్య |
| పాటలు | : సముద్రాల, కొసరాజు, సి.నారాయణరెడ్డి |
| సంగీతం | : టి.వి.రాజు |
| సహాయకుడు | : కృష్ణమూర్తి |
| నృత్యం | : వెంపటి సత్యం |
| కళ | : టి.వి.ఎస్.శర్మ |
| సహాయకుడు | : సోమనాథ్ |
| కూర్పు | : జి.డి.జోషి |
| సహాయకుడు | : శివమూర్తి |
| వేషధారణ | : పీతాంబరం, భద్రయ్య, భక్తవత్సలం, శేఖర్, సుధాకర్ |
| అలంకరణ | : అచ్యుతరావు |
| సహాయకులు | : తమ్ము, బాబు |
| పోరాటములు | : సాంబశివరావు, స్వామినాథన్ |
| స్టిల్సు | : ఆర్.ఎన్.నగరాజారావు |
| పబ్లిసిటి | : స్టూడియో శర్మ, టి.వి.యస్., విజయ పబ్లిసిటీస్, విజయవాడ |
| శబ్దగ్రహణం | : వి.శివరాం |
| రికార్డింగ్ | : ఎ.వి.పార్థసారథి |
| స్టూడియో | : వాహిని |
| ప్రాసెసింగ్ | : విజయా లాబరేటరి, ఎన్.ఆర్.రంగనాథన్ |
| చిత్రీకరణ | : రవికాంత్ నగాయిచ్ |
| సహకార దర్శకులు | : బి.హెచ్.విజయరావు, రమేష్ |
| నిర్మాణ చాలకుడు | : కె.ఆర్.వి.ప్రసాదరావు |
| సహాయకుడు | : జి.కృష్ణమూర్తి |
| నిర్మాత | : **త్రివిక్రమరావు** |

## 'సరిగపదమని-16'

**జవాబులు:-**

అడ్డం: 3.సదా 5.సరిగపదమని 7.గారి 9.నిగమ 11.పాపా 13.రీమా 15.దాపరి 17.పరి 18. సా 19.దాగని 21.పారి 23.సారిగా 24.సరిమా 25.నీ

నిలువు: 1.పరి 2.పమ 4.దాసరి 5.సరిసరి 6.దరిని 8.మాపాప 10.గద 12. పారి 14. మానిని 16.మాదా 20.గని 21.పాగా 22.సరి

### కరెక్టు సమాధానాలు వ్రాసిన వారు:

డా॥ఉప్పల.వెంకటరమణయ్య-కడప, పి.సుమతీ-నందపేట(నెల్లూరు), చివుకుల.సుబ్రహ్మణ్యశాస్త్రి-అన్నవరప్పాడు, వి.వి.రమణి- బచేలి(చత్తీస్‌గడ్), ఎ.టి.కాశీనాథ్- న్యూనల్లకుంట(హైదరాబాద్), వి.శ్రీనివాస్-బెంగుళూరు, నందూరి.రామానుజాచార్యులు-లబ్బీపేట(విజయవాడ), పింగళి.మధుబిందు -బెంగుళూరు, కె.వి.యన్.యస్.భగవాన్-రాజమండ్రి, యం. వల్లీసుబ్రమణ్యం- నాతయ్యపాలెం(విశాఖపట్నం), జి. జ్యోతి-వినుకొండ, సి.హెచ్. సుమతీపావన్-హైదరాబాద్ , ఎం. దామెదరాచార్యులు-హుజుర్‌నగర్ (నల్గొండ), టి. భాగ్యలక్ష్మి- కర్నూలు, వి.వి.యస్.వి.రణధర్-పినపళ్ళ, ఎ.టి. శ్రీనివాసన్- అనంతపురం, వేముల.శేఖర్-నిజామాబాద్, కూచిభోట్ల.జయచంద్ర- హైదరాబాద్, మేడా పద్మావతి- అక్కయ్యపాలెం(విశాఖపట్నం), మేడామస్తాన్ రెడ్డి- అక్కయ్యపాలెం, యం. సంతోష్‌కుమార్-అనకాపల్లి, కె.సత్యనారాయణ-కడప, వై.వి.గిరిజ-మౌలాలి, యం.రామారావు- ముంబాయి, బి.కవిత-ప్రొద్దుటూరు, కనకదండి.జగన్నాధరావు-టాటానగర్ (జార్కండ్), జంధ్యాల. కిరణ్మయి-మచలీపట్నం, ముగ్గళ్ళరాజ్‌కుమార్-మాల్కాజ్‌గిరి, సి.వి. శాస్త్రి-న్యూనల్లకుంట, ఉప్పాల మోహన బాబు-అవనిగడ్డ(కృష్ణా), సి. విజయసారధి-శ్రీరామ్‌నగర్(కర్నూలు), పి. కల్యాణ్ కళాధర్-జేమ్స్‌గార్డెన్(నెల్లూరు), జి.వి.ఆర్.మూర్తి-హైదర్‌గూడ(హైదరాబాద్) యం.అంజిరెడ్డి-ఒంగోలు, యం.సత్యవాణి-తణుకు, అమూల్య. పాణ్యం- కర్నూలు, అడపా. విఘ్నేశ్వరరావు-పర్లాకిమిడి, పి.మధు- విజయనగరం, నెల్తుతా.రమాదేవి-హనుమకొండ, చేబోలు.శ్రీవాణీశైలజ-విశాఖపట్నం, పి.వేణుగోపాల్‌రావు-అచ్చంపేట(మహబూబ్‌నగర్), యం.వి.యస్.యన్.శాస్త్రి- విజయవాడ.

### ఒక తప్పుతో వ్రాసిన వారు:

తాళ్ళూరి.చంద్రశేఖర్-హైదరాబాద్, సపారే.ఇందిర- కళ్యాణ్(వె), పద్మావతీ శ్రీనివాస్‌రావు.సాంసాళి-ఎమ్మిగనూర్, అల్లూరిరామరాజు- విజయవాడ ,యం.బిందుమాధవి-హైదరాబాద్, కె. చంద్రహర్ష-సత్తెనపల్లి, పి.యస్.ఆర్. ప్రసాద్-బాలాజీనగర్(నెల్లూరు), పరాంకుశం.శ్రీలక్ష్మి-సికింద్రాబాద్, ఆర్. సత్యరాజన్-కోవ్వూరు, సపారె.ఈరణ్ణ-ఆదోని, నారోజు శంకరా చార్యులు -చిలుకానగర్, అయ్యగారి రాజశేఖర్-రాజోలు, జి.పాండురంగశర్మ -హైదరాబాద్, ధరణి మధుర- సంతోష్‌నగర్ కాలని(హైదరాబాద్), యం. మీనా ప్రభాకర్-పాలెం, తాళ్లూరి జయదేవ్-నిజామాబాద్, బెహరా శేషశాయి- సత్తెనపల్లి (గుంటూరు), ఎమ్. ఎన్.వాణి- గణపవరం(ప.గో.జిల్లా), యం.కృష్ణప్రియ-నల్గొండ, మంత్రి ప్రగడశ్వేత-నల్గొండ, ఆత్మూరి.శ్రీపల్లవి -హైదరాబాద్, మాచెర్ల. హనుమంతురావు-రాజమండ్రి, అవధానం .లక్ష్మిమోహన్-తిరుపతి, కె.వి.సరస్వతి-హైదరాబాద్, రాచపూడి. జానకిరామయ్య-విజయవాడ, గర్రేపల్లి.వెంకటరావు- హైదరాబాద్, సి.హెచ్.జాహ్నవి-వరంగల్, పి. సుబ్రహ్మణ్యం-నర్సాపూర్, యల్లాపంతులచందు-శ్రీకాకుళం, యస్. సమీర-హైదరాబాద్, సి.హెచ్.శోభాకుమారి-చీపురుపల్లి(విజయనగరం), కర్రి ఝాన్సీ-హైదరాబాద్, పి.మయూకా-అమలాపురం, ఆర్. మధుసూదన్-చిత్తూరు, అద్దంకి.సీతాదేవి- హైదరాబాద్, పప్పు అప్పారావు-శ్రీరాంనగర్(విజయనగరం), టి.గిరిజ-సికింద్రబాద్, జి. జయలక్ష్మి-కర్నూలు, నండూరి. సుబ్బారావు-కాకినాడ, ఆర్.కిషోర్ కుమార్-కరీంనగర్, యం.ఉమామహేశ్వర్- సికింద్రాబాద్, ఎం. వి. యన్.లక్ష్మి-కాకినాడ, పి.వి.సౌజన్య-హైదరాబాద్, పి.వి. పద్మకుమారి-హైదరాబాద్, కే.వి.యన్.బిందు-హైదరాబాద్, బచ్చు విజయ్‌కుమార్-విశాఖపట్నం, యన్.ఉమాజ్యోతి- గుంటూరు, జి.వి. కృష్ణకుమార్ జగ్యయ్యపేట, కొంపెల్ల పద్మజారాణి-విశాఖపట్నం, పి.తిరుమల ప్రసాద్-హైదరాబాద్, రాచమళ్ళ విశ్వకళ్యాణ్- రామవరప్పపాడు(కృష్ణా), బి.భార్గవి-అచ్చంపేట (మహబూబ్‌నగర్).

### రెండు తప్పులతో వ్రాసిన వారు:

టి. యస్. నారాయణ- గూడూరు, కె. నాగేశ్వరరెడ్డి-జైపూర్, ఎన్. జగన్మోహనరావు-కరీంనగర్, పి.పాపారావు-విశాఖపట్నం, ఆర్.వి.వి. క్రిష్ణా- హైదరాబాద్, వి.సాయికుమార్-పర్లాకిమిడి(ఒరిస్సా), జానూ.బాబారావు- గుడివాడ, యన్. భువన్ కుమార్- ఒరిస్సా, యజ్జల జగన్నాథం- పాతపట్నం (శ్రీకాకుళం), మన్నవ.మాధవి-సత్తెనపల్లి, పుణ్యాల శ్రీలక్ష్మి-సత్తెనపల్లి, పుణ్యాల రాజ్యలక్ష్మి-సత్తెనపల్లి, శ్రీనివాస్‌పవార్-రామ్‌నగర్(నిజామాబాద్), వి. నారాయణరావు-రాజమండ్రి, వరయోగిరామ్‌మోహన్-సికింద్రాబాద్, జి. జయచంద్రగుప్త-కర్నూలు, ఇ.రాము-కర్నూలు, మంచెం విజయ-కాకినాడ, సి. యామిని-హైదరాబాద్, నిర్మల కృష్ణ-తిరుపతి, పి.సురేష్‌బాబు-చిత్తూరు, చుంచుమల్లేష్ బాబు- విశాఖపట్నం, కోలపల్లి ఈశ్వర్- నెల్లూరు, పెంద్యాల మురళీధరరావు- నల్గొండ, పి.యస్.ఆర్.సి.మూర్తి- సికింద్రబాద్, యం. అమృత-కర్నూలు, కె. సుధాదేవి-చీరాల, కోటసాయిదీపక్-నెల్లూరు, ఆలవారుశెట్టి హరిత- దర్గామిట్ట(నెల్లూరు), ఉదొలి భాస్కరయ్య- చెన్నై, సి. లలితాదేవి- నెల్లూరు, జాగిర్దార్ మాధురి-సామర్లకోట(తూ.గో.జిల్లా), గంటి వినయ్-అమలాపురం, జి. సుబ్రమణ్యం-అస్సాం, గంటి రమ్య-అమలాపురం, ఆమంచి వెంకటలక్ష్మీ కామేశ్వరి-రాజోలు (తూ.గో.జిల్లా), యస్.కె.భాషా ముంతాజ్-సాలూరు.

### మూడు తప్పులతో వ్రాసిన వారు:

చందలూరి.రాజాకృష్ణప్రసాద్-కాకినాడ, యిరుకుళ్ళ వీరన్న-కరీంనగర్, జైదేవ్ ప్రసాద్-ఖమ్మం, వంగా సత్యనారాయణ- విజయవాడ, యం.వి.తేజస్వని-కర్నూలు, వై.బి.వి.ఆర్. మూర్తి-శ్రీకాకుళం,జె. వెంకటన్న-పెనుగొండ(మహబూబ్ నగర్).

## 'సరిగపదమని-17'

**జవాబులు:-**

అడ్డం: 1.ముద్దబంతి 3.పిలిచిన 5.కల్ల 7.పూల 8.అహ 9.మసక 11. చీర 12.గట్టు 13.నీనామ 15.దాసు 16.ఈ 20.లష్కరు 21.బంగారు. 22.పిలుపు

నిలువు: 1. ముక్కు 2. బండి 3 .పిల్ల 4.నరహరి 5.కలవర 6.బాస 9.మత్తు 10.సొగసు 11.చీమ 14.నాపేరు 17.కలలు 18.కోడలు 19. మంగా 22.రుచి

### కరెక్టు సమాధానాలు వ్రాసిన వారు:

టి.రాఘువేందర్-సంగారెడ్డి, వాన్‌జా.సత్యనారాయణ-విజయవాడ, లుంబూరు లక్ష్మీప్రసాద్- హైదరాబాద్, విజయ& ఉదయభాస్కరరావు-రాజమండ్రి, వి.లీలాకుమారి-హైదరా బాద్, ఎన్.వాగ్దేవి-హైదరాబాద్, యం.మాధురి,రంగారావు-రామ్‌గిరి (నల్గొండ), యస్.హిమబిందు-హైదరాబాద్, పి.సరళ-సికింద్రాబాద్, ఎస్.శేషకుమారి-గణపవరం, యు.యు.ము. -ఎమ్మిగనూరు, ఆసన్ మూర్తి- హైదరాబాద్, కె.సంతోష్‌కుమార్-సికింద్రాబాద్, సంగాడి.లక్ష్మి.కృష్ణకుమారి-ఉక్కునగరం (విశాఖపట్నం), మండలీక.సుబ్బారావు- కాకినాడ, చివుకుల. సుబ్రహ్మణ్యశాస్త్రి- ఒంగోలు, కె.రమ్యకృష్ణ- హైదరాబాద్, తేతల్లి వసంత-విశాఖపట్నం, యండి.ఆసీఫ్‌బాషా-నాచారం, పి.శ్రీవాణి- వైజాగ్, నడుకూరు.లక్ష్మీప్రభ-కోట, పి.లక్ష్మీదేవి-కర్నూలు, కె.రామారావు- హైదరాబాద్, అవసరాల.మణి- విశాఖపట్నం, పి.యన్.యన్.రాజు-అచ్చంపేట, కె.వి.రమణారెడ్డి- హైదరాబాద్, కె.లక్ష్మీకాంతమ్మ- నెల్లూరు, ఎ.శ్రీనివాస్-పాతపాలమూరు, కే.వి. ఎన్.కుసుమలత-హైదరాబాద్, ఓగిరాల.అంజని గోపాలకృష్ణ-నెల్లూరు, కొండదాడి.సుగుణాకరరావు-విశాఖపట్నం, పి.ప్రసాద్- హైదరాబాద్, జి.వి.కృష్ణకుమార్- జగ్గయ్యపేట , పాణ్యం ప్రత్యూష-ఎర్నాకులం, సి.విజయసారధి-శ్రీరామ్‌నగర్(కర్నూలు), మర్రిజాగృతి లహరి-కర్నూలు, బి.అరుణశ్రీనివాస్-ఒరిస్సా, జోశ్యుల భానుమూర్తి-భీమవరం, ఎం.వి.యస్.లక్ష్మి- కాకినాడ, పి.పాపారావు-విశాఖపట్నం.

### ఒక తప్పుతో వ్రాసిన వారు:

కలబరి రాజేష్-విజయనగరం, యన్.మధులిక-కావలి, అయ్యగారి.రాజశేఖర్- రాజోలు, కె.యల్.యన్.రెడ్డి-నిజామాబాద్, కె.వి.యన్.యస్. భగవాన్-రాజమండ్రి, పోదూరిశ్రీనివాసరావు-సంబల్‌పూరు (ఒరిస్సా), సి.హెచ్.సుమతీపావన్- హైదరాబాద్, పి.విజయలక్ష్మి- రామారావుపేట (తూ.గో.జిల్లా), వై.రాజేష్-పెందుర్తి, వంగలభార్గవి-రాజేంద్రనగర్(తూ.గో.జిల్లా), కె.ప్రభావతి-ఖమ్మం, టేకుమళ్ళ నిర్మల-నెల్లూరు, మేడా మస్తాన్‌రెడ్డి- విశాఖపట్నం, మేడాపద్మావతి- విశాఖపట్నం, టి.విజయలక్ష్మి-కర్నూలు, వి.లత-హైదరాబాద్, ఇ.పి. రాధికామూర్తి-హైదరాబాద్, ఆత్మూరిశ్రీపల్లవి-హైదరాబాద్, కె.వి.సరస్వతి-హైదరాబాద్, కె.జ్యోతిశర్మ-కర్నూలు, వై.భానుప్రసాద్-కర్నూలు, నెలుతా రమాదేవి-వరంగల్, టి.వి.యన్.మూర్తి- హైదరాబాద్, కోయ్యానూక రత్నం-రామక్రిష్ణారావుపేట(కాకినాడ), యం. దామోదర్-నల్గొండ, జి.పాండురంగశర్మ-హైదరాబాద్, ఎ.పద్మని-విశాఖపట్నం, కావేరి రాం-కమలానగర్ (విశాఖపట్నం), వడ్లమన్నాటి భార్గవి-విజయవాడ, గోసాల నాగలక్ష్మి- రాజమండ్రి (తూ.గో.జి), సి.హెచ్.గణపతిప్రసాద్-జత్ని, జాగిర్దార్ మాధురి- సామర్లకోట (తూ.గో.జి), ఉడాలి జ్ఞానప్రసూన-అడియార్(చెన్నై), సి.శాంతశ్రీ.భార్గవి-తారిగొండ (మెదక్), కె.వి.దుర్గామోహనరావు-నల్గొండ, ఉప్పులూరి సుధాలక్ష్మి-రాజోలు(తూ.గో.జి), యన్.శ్రీవాణి- గాంధీనగర్ (విజయవాడ), యస్.యస్.కె.సుధాకర్ -విశాఖపట్నం, టి.అనిత-అచ్చంపేట, సి.అనేషా-హైదరాబాద్, సపారె.ఈరణ్ణ-ఆదోని,నారోజు శంకరాచార్యులు-చిలుకానగర్, నేమాన సుభోష్‌చంద్రబోస్-శ్రీకాకుళం, యన్.రామానుజాచార్యులు-జగ్గయ్యపేట, స్రవంతి వంకేశ్వరం-కర్నూలు, చి.ఎలిశెట్టిప్రశాంతి-రామేశ్వరకాలనీ, సి.హెచ్.పద్మశ్రీ-హైదరాబాద్, బి.మురళీధర్‌రావు-దుందిగల్, ఎం.వి.యన్.శ్రీప్రసాద్-విశాఖపట్నం, మండిగ భాస్కర్-సీతారామపురం (విజయవాడ), కె.సుధాదేవి-చీరాల, టి.మహి-గూడూరు, బి.నాగరాజఆచారి -హైదరాబాద్, జి.శ్రీకీర్తన-విశాఖపట్నం, రావుల వేణుగోపాల్-కాజీపేట(వరంగల్) , కిషోర్‌కుమార్ ఆర్-కరీంనగర్, జి.ప్రభావతి-కాంతమూరు, కె.వి.ప్రణీతసాయి-రాజమండ్రి, టి.సాయిరామి రెడ్డి-హైదరాబాద్, మాచార్ల శ్రీవిద్య-నరసరావుపేట, టి.శివప్రియ -హైదరాబాద్, డి. జానకిదేవి-హైదరాబాద్, ఆదిరాజు ధర్మరావు-శ్రీకాకుళం, ఎన్.జగన్మోహనరావు-కరీంనగర్, టి.ప్రియాంక-గుంతకల్లు, పక్కి మధు-విజయనగరం, కె.నీరజ.దీపిక-హైదరాబాద్, యం.వి.యస్.యన్.శాస్త్రి-విజయవాడ, పి.శిరీషకుమార్- రాజమండ్రి, పుణ్యాల.శ్రీలక్ష్మి-సత్తెనపల్లి, వై.నాగలక్ష్మి-ఖమ్మం, మరువాడ.కామేశ్వర రావు-మంచిర్యాల, బి.శ్రీనివాసప్రభాకర్-హైదరాబాద్, పి.పద్మనాభన్ -హైదరాబాద్, పాణ్యం.రుక్మిణీదేవి-కర్నూలు, పసుపులేటి.ఝాన్సీల క్ష్మీబాయి -మొగలికుదురు(తూ.గో.జి), యం.దుర్గామనోజన్య-హైదరాబాద్, వకుళాభరణం.అనంతలక్ష్మి-హైదరాబాద్, బి.కవిత-తిరుపతి, కె.మరళీ మెహన్-మార్కాపురం, బి.రామక్రిష్ణ-ప్రొద్దుటూరు, యం.అంజిరెడ్డి-ఒంగోలు, డా॥ఎం.పురుషోత్తమాచార్య-నల్గొండ, శ్రీమతి.సి.కమల-హైదరాబాద్, ఆర్.వి.వి.క్రిష్ణ-హైదరాబాద్, యడపల్లి.చంద్రశేఖర్-గుంటూరు, వి.ఉష- తెనాలి, పింగళి లలిత-ఒంగోలు, పి.మానసకృష్ణ- హైదరాబాద్, వేలివెంటి కృష్ణవేణి-కొత్తపేట(తెనాలి), సి.హెచ్.శ్వేత-చీపురుపల్లి, పర్వా వాసుదేవ రావు-దేవరకొండ, ఇ.భవానిప్రసాద్-కాజూర్, యన్.వి. యల్.స్రవంతి-యలమంచిలి, గణగం వెంకటరమణమూర్తి -విశాఖపట్నం, అద్దంకి సీతాదేవి-హైదరాబాద్, రాచమళ్ళ విశ్వకళ్యాణ్-విజయవాడ, పి.విజయభార్గవి-చీరాల, అడపా విఘ్నేశ్వరరావు-పర్లాకిమిడి, పి.వేణుగోపాల్‌రావు- అచ్చంపేట, మాణిక్యాల మల్లేశ్వరమ్మ-హైదరాబాద్, కాటేపలి కృష్ణమోహన్-మిర్యాలగూడ, యల్లాపంతుల చందు-కానుకుర్తివారివీధి (శ్రీకాకుళం). గుంటియామిని కార్తీక్‌సాగర్, స్వాతి.స్వప్నక్రాంతి-వనపర్తి(మహబూబ్‌నగర్).

### రెండు తప్పులతో వ్రాసిన వారు:

జి.ఆశాజ్యోతి-వినుకొండ, బెహరా శేషశాయి-సత్తెనపల్లి, కె.మాణిక్యాంబ-పెదప్రోలు, ఇందిర-హైదరాబాద్, వేముల పద్మావతి-హైదరాబాద్, యం.కుమారి-దోర్నాల, వెత్సా.రామకృష్ణ-విజయనగరం, మోచెర్ల.శ్యామంత్-రాజమండ్రి, ఆలవారుశెట్టి హరిత-దర్గామిట్ట (నెల్లూరు), యం.జీవా-తూ.గో.జి, డి.స్వాతిలక్ష్మి-చీపురపల్లి, వి.లక్ష్మి-హైదరాబాద్, కె. పూర్ణిమ-అనంతపురం, ఆమంచి లక్ష్మీకామేశ్వరి-రాజోలు, ఏ.బి.వి.ఎన్.రమేష్-వెల్లూరు (తమిళనాడు), ఆదూరి రామకృష్ణ-హైదరాబాద్, వుప్పలూరి పద్మావతి-కొవ్వూరు మద్దాలి సువర్చలా.శ్రీనివాస్--హైదరాబాద్, తాళ్ళూరి రాధ-హైదరాబాద్, యస్.దేవగిరి -వరంగల్, కె.యస్.యస్.శ్రావణి-రాజమండ్రి, ఎ.కొండల రెడ్డి- మెదక్, నిర్మలకృష్ణ -తిరుపతి, జి.వి.రాజేష్-కర్నాటక, యం.సంతోష్‌కుమార్-అనకాపల్లి, సి.వి.యస్. నాగమణి-ఫత్తేఖాన్‌పేట(నెల్లూరు), సి.హెచ్.దీపిక-రామ్‌నగర్(వైజాగ్) యస్. సమీర-హైదరాబాద్, అవధానలక్ష్మీమోహన్-తిరుపతి, సావిత్రి చంద్రరావు-విజయనగరం, టి.రాధ-సికింద్రాబాద్, కె.మల్లేష్-సికింద్రబాద్, ఉప్పాల.మోహనబాబు-అవనిగడ, ఎన్.శారదా-విశాఖపట్నం, పప్పు అప్పారావు-శ్రీరామ్‌నగర్(విజయనగరం), మోకా రామారావు-ముంబాయి, శ్రీనివాస్‌పవార్-నిజామాబాద్, కోడూరు సత్యనారాయణ-కడప, యజ్జల జగన్నాథం-పాతపట్నం(శ్రీకాకుళం), పి.కళ్యాణ్ కళాధర్-నెల్లూరు, పి.పార్థసారధి-అనంతపురం, ఎ.రాధికాదేవి-అమలాపురం, అయితా. సత్యనారాయణ-సూళ్ళురుపేట, వి.వి.సూర్యనారాయణమూర్తి-కాకినాడ, యం.విద్యాసాగర్-కర్నూలు, పుణ్యాల.రాజ్యలక్ష్మి-సత్తెన పల్లి, రాజ్ కుమార్ ముగ్గళ్ళ -మిర్యాలగూడ, మన్నవమాధవి-సత్తెనపల్లి, సి.హెచ్.సంధ్య-రాజమండ్రి, కె. రాధాస్వాతి-ఒరిస్సా, కె.పద్మావతి-విజయనగరం.

### మూడు తప్పులతో వ్రాసిన వారు:

జి.వెంకటరావు-హైదరాబాద్, డా॥జె.వి.రాఘవమూర్తి-రాజమండ్రి, ఉషా హైవంత్-కోల్‌కటా, వి.కె.పి.మాధూరి-శ్రీరామ్‌నగర్(రాజమండ్రి), బి.శ్రీకాంత్ -విశాఖట్నం, ఎ.ప్రవీణ్‌కుమార్-కర్నూలు, జంధ్యాల. కిరణ్మయి-మచిలీపట్నం, డా.ఎస్.వి.ప్రసాద్-మెదక్, పక్కి సుందరీ కృష్ణ-జహీరాబాద్(మెదక్), బచ్చు విజయకుమార్-కొత్తవెంకోజిపాలెం (విశాఖపట్నం).

RNI Regd.No.APTEL/2001/5503 HAASAM HAASYA SANGEETHA PATHRIKA Postal Regn. No.H-HD-997/2003.

